The one and only Magazine devoted to Humour & Music

వెల : రూ.10

1-15 జూన్ 2003

పేజీలు 68+8

# హాసం

హాస్య-సంగీత పత్రిక




అందమైన కళ్లే కాదు
వారసత్వంగా వచ్చేది.....
అపాయకరమైన వ్యాధులు కూడా...
హెపటైటిస్-బి వ్యాధి సోకిన తల్లి తనకు
తెలియకుండానే గర్భస్థ శిశువుకు కూడా
సంక్రమింపచేస్తుంది - ఆ కాలేయపు వ్యాధిని.
మీ డాక్టర్‌ను సంప్రదించండి.
సకాలంలో టీకా వేయించుకోండి. ధర
అందుబాటులో ఉండే అంతర్జాతీయ శ్రేణి
వ్యాక్సిన్ గురించి తెలుసుకోండి.
ప్రజాహితం కోరి విడుదల చేసినది
ప్రాణాంతక హెపటైటిస్-బి వ్యాధి నిరోధక టీకా
శాన్‌వాక్-బి తయారీదారులు:
శాంతా
బయో టెక్నిక్స్ (ప్రై)లి.
3వ ఫ్లోరు, శిరీన్ ఛాంబర్స్, బంజారాహిల్స్, హైదరాబాద్
ఫోన్స్ : 040-23548507, 23608843, ఫ్యాక్స్: 040-23548476
హెపటైటిస్-బి
పసుపు వలయం
ప్రమాద సూచకం
Help. Stop HBV
Shanvac™ - B
r-DNA Hepatitis-B vaccine

హాసం
హాస్య-సంగీత పత్రిక

Also available on net - www.haasam.com

# హాస్యం - సంగీతం

## ఇవీ సంగతులు
41



**ముఖచిత్రం**
'పలనాటి బ్రహ్మనాయుడు'తో
సోనాలిబింద్రే, బాలకృష్ణ
ఆర్తీ అగర్వాల్







'సెంటర్ స్ప్రెడ్'లో
'ఒకరాజు ఒకరాణి'
'ఒక్కో...నీప్రేమబంగారం కాను'
సినిమా పాటల పుస్తకాలు
కలర్‌లో



62వ పేజీలో ఎన్టీఆర్ ఫోటోల కర్టసి : విజేత




తెలుగు భాష కాని (రాని) సింగర్స్‌లో తెలుగులో సుస్పష్టంగా, భావయుక్తంగా పాడేవారిలో నెంబర్ వన్ పి.లీల (16-31 మే) ఆమె పాడిన పాటల ఉదాహరణలు బాగానే ఇచ్చినా- తొలిరోజుల్లో 'గుణసుందరి కథ'లో పాడిన తొలిపాట- "ఓ మాతా మొరవినవా" తో ఆమె ప్రజ్ఞ బలపడింది. ఆ వేడికోలు పాటలోని చరణంలో "జాలి కలుగదా నా గతిగనిని" అని కంఠం పైకెత్తి పాడడంలో వినిపించిన ఆర్తికి, ఏ దేవతయినా సరే ప్రసన్నం కావలసిందే! 'నా గతిగనినా' అన్నప్పుడు ఓగిరాలగారు సాగించిన వినురూ, ఆమె పాడిన తీరూ- చిరస్మరణీయం. ఆ ఉచ్చారణ ( నేటి గాయకులూ! గమనించండి) అమోఘం!

-రావి కొండలరావు, హైదరాబాద్

హాసం 16-31 మే సంచికలోని రెండు కథలు చదివిన తరువాత హాసంలో తొలినాళ్ళలో వచ్చినటువంటి సునిశితమైన హాస్యం బదులు వెకిలితనం, మొరటు తనం ఉన్న కథలు వస్తున్నాయనిపించింది. అవసరం ఉన్నా లేకపోయినా విచ్చల విడిగా ఆంగ్లపదాల నుపయోగించడం ఆయా రచయితల భాషా దారిద్ర్యాన్ని, భావదాస్యాన్ని సూచిస్తున్నాయి. హాస్యం అంటే చెవికోసుకునే నాకు ఇలాంటి కథల తీరు ఎంతో బాధ కలిగిస్తున్నది. వేరే పత్రికలలో సాధారణ ప్రచురణకు నోచుకోని ఇలాంటి కథలు హాసంలో చోటు చేసుకుంటున్నాయంటే నాకు చాలా ఆశ్చర్యం గొలుపుతున్నది. దయచేసి కథల ఎంపిక పట్ల శ్రద్ధ వహించమని నిత్యమూ 10 పత్రికలు తప్పనిసరిగా చదివే వృద్ధునిగా నా సూచన.

సీరియల్స్ రెండూ ఆయా రచయితల స్థాయికి తగ్గట్లు ఉత్సాహభరితంగా, ఆసక్తికరంగా సాగుతున్నాయి.

-కడియాల సోమేశ్వర శర్మ, హైదరాబాద్.

1-15 మే నెల సంచికలోని ఆత్రేయ తీపి గురుతులు శ్రీ వేటూరి గారి గతస్మృతులు నా హృదయాన్ని కదిలించింది. అలాగే అపురూప గాయకులు శ్రీ మన్నాదే శ్రీ తలత్ మెహమూద్ గార్ల గురించి వ్యాసం పత్రికకే హైలెట్. శ్రీ బాపుగారి విశ్వరూపం నిజంగా కన్నుల పండుగ. శ్రీమతి వక్కలంక సరళగారి వివరాలందించినందుకు మా ధన్యవాదములు కళాభివందనములతో

-ఎన్.సారంగపాణి, అనంతపురం.

మే 1-15 సంచికలో 'ఆత్రేయ' జయంతిని పురస్కరించుకొని అందించిన వ్యాసం అద్యంతం ఆసక్తితో చదివింపజేసింది. అదే విధంగా మన్నాడే పుట్టిన రోజు సందర్భంగా అందించిన వ్యాసం, ఫొటోలు ఆకట్టుకున్నాయి. 'అర్థం చేసుకుందాం ఆస్వాదిద్దాం' లో జగ్జీత్‌సింగ్ పాట గూర్చి చాలా చక్కగా వివరించారు.

-ఎం.డి.ముస్తఖీమ్, కొల్లాపూర్.

తెలుగువాడు పుస్తకం 'కొని' చదవడు- ఇది పాస్టెన్సు. పుస్తకాలు కొని చదవటమే గాక, హాసంలాంటి పుస్తకాలను తరచు చూచి మురిసిపోతుంటాడు - ఇది ప్రెజెంటెన్సు.

తీపి, ఉప్పులాంటి రెండు భిన్న రుచులతో చేసిన క్రాక్‌జాక్ బిస్కట్‌లాగ, సంగీతం, హాస్యం లాంటి రెండు భిన్న రసాలతో పత్రికను వెలువరించటం పాఠకుల నాడిని ఖచ్చితంగా పట్టుకొన్న పబ్లిషర్స్ మేధాశక్తికి నిదర్శనం. మీకు అభినందనలు.

సార్! మీకు హిప్నాటిజం వచ్చా? హాసం సామూహికంగా మమ్మల్ని మత్తులో ముంచుతుంది. షాపులో పుస్తకాలు కొని చదవటం తప్పితే ఎప్పుడూ చందా పంపని నేను, హాసంకు చందా పంపుతున్నాను. స్వీకరించగలరు. (అహా! విధి ఎంత బలీయం!) అన్నట్లు..... భూకైలాస్ రివ్యూలో తగునా వరమీయ... పాట చివర్లో సముద్రాల చూపిన ఒక మెరుపు విస్మరించారు. అక్కడ 'చేకొనుమా దేవా...... చేకొను మహాదేవా' అనీ అద్భుతమైన ప్రయోగం. మిగతా అంతా ఓ.కె.

డబ్బింగ్ చిత్రాలు పరిచయం చేస్తున్నారు. సంతోషం ఆ కోవలో జింబో, రామభక్త హనుమాన్, మనోహరలాంటి చిత్రాలు కూడా వెయ్యాలని - అభ్యర్థన. ఆఖరున నా కృతజ్ఞతలు హాసంకు కాదు. దాన్ని తొలిసారిగా నాకు పరిచయం చేసిన లెక్చరర్ బి.ఎ.డి. గార్కి.

-కె.శివకుమార్, ఒంగోలు.

మీరు నా గురించి అంత శ్రద్ధ తీసుకుని కష్టపడి ఫోటోలు 25 సం॥ ముందువి కలెక్ట్ చేసి 'హాసం' పత్రికలో విపులంగా రాసినందుకు నా కృతజ్ఞతలు. మీరివన్నీ ఎలా కలెక్ట్ చేశారో తెలుసుకోవాలని కుతూహలంగా వున్నది. నేను మర్చిపోయిన పాటలు కూడా జ్ఞాపకం చేశారు. చాలా థాంక్స్. నాకు ఒక అబ్బాయి వున్నాడు. అతని పెళ్ళికే అమెరికా వెళ్ళాము. పెళ్ళి అక్కడే జరిగింది. ఇద్దరూ సాఫ్ట్‌వేర్ ఇంజనీర్స్ మీరు ఎంతో శ్రద్ధ తీసుకుని నా గురించి రాశారని మా మావయ్య గారు చెప్పారు. మర్చిపోయిన సినీ ప్రపంచానికి నన్ను మళ్ళీ జ్ఞాపకం చేశారు. మీకు ఎలా ధన్యవాదాలు తెలుపుకోవాలో తెలియటం లేదు. నా మనసెంతో ఆనందంతో గంతులేస్తున్నది. With Lots of Thanks.

-బి. వసంత,
(సినీ నేపథ్యగాయని),
చెన్నై.

మే 1-15 సంచికలో "సినీ గీతకోశం"లో 'ప్రతిరాత్రి వసంతరాత్రి' రచయిత దేవులపల్లి బదులు సి.నా.రె వ్రాశారు. ఎన్‌సైక్లోపిడియాగా భావిస్తున్న 'హాసం' 'అపహాసం' కాకూడదని నా ప్రగాఢ విశ్వాసం. దయవుంచి ముద్రణలో లోపాలు గాని, పాఠకుల పంపే విషయాన్ని క్షుణ్ణంగా పరిశీలించాకనె ముద్రణకి అనుమతినివ్వండి. ప్రతీది మీరే చూసుకొని పక్షానికొక సంచిక విడుదల చెయ్యటం- నిజానికి ఇవన్నీ పెద్దశ్రమతో, శ్రద్ధతో, ఏకాగ్రతతో కూడుకున్న పనులే కాదనను. మరింత శ్రద్ధ తీసుకుని మావంటి 'హాసం' నూవర్ అభిమానుల్ని సంతృప్తి పరచమని మనవి.

-సయ్యదు రహమతుల్లా, పర్లాకిమిడి, ఒరిస్సా.

1-15 మే సంచిక చాలా బాగుంది. ఎలుక వచ్చె ఇల్లు భద్రం చదవటం మొదలవగానే ఎప్పుడూలేంది ఓ చిట్టెలుక మా ఇంట్లోకి చేరింది. దానికి మీరే బాధ్యులు. నవ్వు రాకుండా చదవాలంటే కష్టంగా ఉంది. అలాగే నెరజాణల సిగ్గులు ఆచార్య తిరుమల గారు చాలా చక్కగా అప్పటి యువతుల మనోభావాల్ని ముందుంచారు. ఇద్దరుమిత్రులు నవల సాగుతూనే ఉంది. మిగతా శీర్షికలు వేటికవే సాటి. చివరగా నాదో కోరిక- హాసంలో నెక్స్ట్ వీక్‌లో సంగీత దర్శకులు కాని వేరెవరయినా సరే వారి బర్త్‌డేలు ముందుగా ప్రచురిస్తే ప్రియ పాఠకులమైన మేము వారికి గ్రీటింగ్స్ లేదా ఫ్యాక్స్ ద్వారా శుభాకాంక్షలు తెలిపే అవకాశం కల్పించే శీర్షిక ప్రవేశ పెట్టగలరని ఆకాంక్ష.

-జె. నాగేష్, హైదరాబాద్.

కొత్తగా ప్రవేశపెట్టిన 'ఘంటసాల క్విజ్' చాలా బాగుంది. కూపన్‌లో పాఠకుల చిరునామా గురించి కూడా చోటు కేటాయిస్తే బాగుణ్ణు. "సినీ గీతకోశం" లో 450 నెంబరు పాట 'షిఫాను చీరకట్టి" అని ప్రింటవాలి. 'అంత్యాక్షరి'కి త్వరలో కాబోతున్న మూలగ్రంథమైన 'హాసం'లో ఇటువంటి తప్పులు రాకూడదని మనవి.

-సోమయాజుల సాయిప్రసాద్, ఒరిస్సా.

తమిళ 'అర్థం చేసుకుందాం' చాలా గొప్పగా ఉంటుంది. మాతృకను ఆకాశానికి ఎత్తివేయకుండా అసంబద్ధత ఉన్న అంశాలను కూడా ప్రస్తావించి, చాలా నిష్పక్షపాతంగా రాస్తున్నారు గోపాలకృష్ణగారు. ఇతర భాషల పాటలు వినేటప్పుడు ఆయా భాషలు రావని బాధపడేవాణ్ని. ఇప్పుడు 'హాసం' చదివే అవకాశం తెలుగేతరులకు లేదేనని బాధపడుతున్నాను.

-జి.వంశీకుమార్, గదగ్(కర్నాటక)

సంపుటి : 2 సంచిక:17

1-15 జూన్ 2003

పేజీలు: 68 + 8

విడి ప్రతి : రూ. 10-00

సంవత్సర చందా : రూ. 200

విదేశాలలో (ఎయిర్‌మెయిల్): $50

జీవిత చందా : రూ. 2000

విదేశాలలో (ఎయిర్‌మెయిల్): $400


The one and only Magazine devoted to Humour & Music



# హాసం

## హాస్య-సంగీత పత్రిక

41


మేనేజింగ్ ఎడిటర్
ఎమ్బీయస్ ప్రసాద్

ఎడిటర్
రాజా

రిఫరెన్స్ కర్టసీ
డా॥ కె.వి.రావు
జె.మధుసూదన శర్మ


ప్రముఖుల పుట్టినరోజులను, వర్ధంతులను వారిని అభిమానించే వారికి పండుగలుగా తీర్చిదిద్దడం 'హాసం' అలవాటు. ఆ సందర్భంగా వారి గురించి వ్యాసాలు వెలువరించడంలో ఒక క్లిష్టత ఉంది. ఆ వ్యాసం సమాచారాన్ని అందివ్వగలగాలి; కొంత'పర్సనల్ టచ్'ఇవ్వాలి., ప్రశంసాపూర్వకంగా ఉంటూనే అతిశయోక్తులకు, ఉత్ప్రేక్షలకు పోకూడదు. అంతేకాదు, ఆయా రంగంలో కొనసాగుతున్నవారయితే వ్యాసాన్ని జయాపజయాల సమీక్షగా మలచకూడదు. సాధారణంగా ఇంటర్వ్యూలలో అడిగే 'రొటీన్' ప్రశ్నల జోలికి పోకూడదు.

ఇటువంటి వ్యాసాలకై సమాచారం కోసం తడుముకోవలసిన పరిస్థితి 'హాసం'కు ఎన్నడూ లేదు. అందుబాటులో సమాచారం, అరుదైన చిత్రాలు 'హాసం' ట్రేడ్ మార్కు . 'పర్సనల్ టచ్' ఇవ్వగల స్నేహం, సామీప్యం సంపాదకుడికి వ్యక్తిగతంగా ఉన్నాయి. ఇక ఆయా ప్రముఖుల నేపథ్యంగురించి, ట్రాక్ రికార్డు గురించి 'హోమ్ వర్క్' చేసుకోవడంలో ఎన్నడూ వెనుకంజ వేయలేదు. అయినా లబ్ధ ప్రతిష్టుల గురించి రాయడానికి, ఇంటర్వ్యూ చేయడానికి ఆ రంగంలోనో లేదా సమీప రంగంలోనో ఉన్న ఇతర ప్రముఖుల సేవలను ఉపయోగించుకోవడానికే 'హాసం' ప్రాధాన్యత ఇస్తోంది. దానిలో సొగసే వేరు. అది సక్రమంగా నిర్వహించబడినప్పుడు ఆ ప్రముఖులిరువురికీ సంతోషం కలగడమే కాదు, పరస్పర గౌరవాభిమానాలు పెంపొంది, మరింత సదవగాహన ఏర్పడుతుందని 'హాసం' నమ్మకం.

కానీ ఇది అనుకున్నంత సులువు కాదు. ప్రముఖుడూ, వ్యాసకర్తా ఇద్దరూ ప్రాచుర్యంలో ఉన్నవారే. సమయాన్ని పెద్దగా కేటాయించలేని వారే! సినీ రంగానికి చెందిన వారయితే మరీనూ...షూటింగు ఒత్తిళ్లు, టూర్ల మధ్య సతమతమయ్యేవారే! వ్యాసం వ్రాయాలన్నా, ముఖాముఖి కలిసి ఇంటర్వ్యూ చేయాలన్నా ఒకటికి నాలుగు సార్లు ఫోన్ చేసి ఎపాయింట్‌మెంట్ తీసుకుని, టైము వెచ్చించి వెళ్లి కలవాలి. అంతకుముందే ఎంతో సమాచారం సేకరించుకోవాలి. దానిని ఓ క్రమంలో పెట్టుకోవాలి. దాని ఆధారంగా ప్రశ్నలు వేసి సమాధానాలు రాబట్టుకోవాలి. వ్యక్తిగతంగా ప్రశ్నలు వేసేటప్పుడు పాఠకులకు ఆసక్తికరంగానూ ఉండాలి; అవతలివారికి ఇబ్బందీ కలగకూడదు. జర్నలిస్టులు కానివారు కూడా జర్నలిజపు ఛాయలు సమకూర్చుకోవాలి. మొత్తమంతా సమకూడాక ప్రజారంజకంగా తీర్చిదిద్ది పాఠకులకు అందించాలి. మరి ప్రముఖుల పక్షాన్నుండి ఆలోచిస్తే వారు తీరిక చేసుకోవాలి, ఓపిక కనబరచాలి. ఈ వ్యయప్రయాసల కోరుస్తూ వ్యాసం అందంగా, పొందికగా రూపొందడానికి అవతలి వ్యక్తిపై గౌరవాభిమానాలుండాలి. అన్నింటినీ మించి ఆ వ్యాసాన్ని వెలువరించే పత్రికపై వారిద్దరికీ ప్రేమ ఉండాలి.

'హాసం'మీద ప్రేమతో 'హాసం' అభివృద్ధిని కాంక్షించే పెద్దలెందరో ఉండబట్టే ఇప్పటివరకు 'హాసం' ఇటువంటి ఎన్నో అద్భుతాలను సాధించగలిగింది. అయినా ఈ సంచిక రూపకల్పన 'హాసం'కు పెను సవాలుగా నిలిచింది. జూన్ మొదటి పక్షంలో జన్మించిన ప్రముఖులు ఎందరో ఉన్నారు. వారందరినే కాదు, వారి గురించి వ్యాసాలు వ్రాసేవారిని, ఇంటర్వ్యూలు చేసేవారిని ఎంపికచేసుకుని, వారందరినీ సమీకరించుకుని, సమన్వయ పరిచి కావలిసిన విధంగా రాబట్టుకోవడం ఓ ఫీటే! ఒక్కసారి లోపలిపేజీలలోకి తొంగి చూస్తే మేం ప్రస్తావించే విషయం ఎంత క్లిష్టమైనదో అర్థమవుతుంది. ఇళయరాజా, బాలు గురించి వేటూరి సుందర్రామ్మూర్తి, ఇ.వీ.వీ. గురించి జనార్ధన మహర్షి, యస్వీ కృష్ణారెడ్డి గురించి చంద్రబోస్, చక్రి గురించి భాస్కరభట్ల రవికుమార్...

కళ్లు తిరిగే ఈ దుష్కర యజ్ఞం సజావుగా జరగడానికి మా శక్తియుక్తుల కంటె 'హాసం' పై ఆయా మహానుభావుల ప్రేమాభిమానాలే కారణమని మా నమ్మకం. వారందరికీ కృతజ్ఞతలర్పిస్తున్నాం.




HAASAMHAASYASANGEETHAPATHRIKA
Flat No. 502, Sri Balaji Nilayam
13-1-212, Motinagar,
Hyderabad-500 018
Ph: 2383 1388 / 5557 0215
email: haasammag@hotmail.com

Printed and Published by:
K.I.Varaprasad Reddy
on behalf of Hummus Infoway (P) Ltd.,
502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD-500 018
Fax: 040-23541713

Printed at: Kalajyothi Process Ltd.,
1-1-60/5, RTC X Roads,
Musheerabad, Hyderabad-20,

Published at: 502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD-500 018

Editor: RAJA

Marketed by:
Margadarsi Marketing Pvt Ltd.,
6-3-570, Eeenadu Compound
Somajiguda, Hyderabad-82

# పతి పత్ని ఔర్ 'అది'

-పోడూరి కృష్ణకుమారి



ఆరోజు పొద్దున్నే మా ఇద్దరికీ మాటా మాటా వచ్చి మాటాడుకోవటం మానేసాం. దెబ్బకి ఇల్లు శాంతినివాసమై పోయింది. డాన్ టు డస్క్ కర్ఫ్యూలాగా పొద్దున్న మొదలయి రాత్రి ఎనిమిదింటి దాకా వాతావరణంలో ప్రశాంతత కొనసాగింది.

ఎనిమిది గంటల రాత్రివేళ నేనూ మా ఇంటి సైకియాట్రిస్టూ- అంటే మా ఆయనే లెండి - మూతులు ముడుచుకుని చెరో పుస్తకం చేత్తో పట్టుకుని చెరో కుర్చీలో కూచునున్నాం. మా ఆయన పేషంట్లకి సైకియాట్రిస్టే కానీ పెళ్ళానికి మాత్రం ఉత్తి మొగుడు అంటే... ఐమీన్... జస్ట్ ప్యూర్ మొగుడన్నమాట ఉత్తుత్తి మొగుడు కాదు. డాక్టర్ జెకిల్ మిస్టర్ హైడ్ టైపు. ప్రస్తుతం మిస్టర్ హైడు తన కోపాన్ని మాత్రం హైడ్ చేసుకోకుండా మొహం ముటముటలాడించుకుంటూ కూచున్నారు.

ఠంగూ ఠంగూ మనని జే గంటలు కొట్టే గడియారాలేనాడో పోయాయి. ఇప్పుడన్నీ పాటలుపాడే గడాయారాలూ కూతలు కూసేవినూ. మా ఆయన తనకీ తన టేస్టుకీ తగ్గట్టుగా ఈ మధ్యనే ఓ గడియారం తెచ్చి ఫుల్లు వాల్యూమ్ పెట్టి మరీ గోడెక్కించారు. అది మోస్ట్ అనెక్స్‌పెక్టెడ్ మూమెంట్‌లో గుండెలదరగొట్టే ట్యూనేదో వాయించి వాయగొడ్తూంటుంది.

మా ఇద్దరి మధ్యా నిశ్శబ్దం దట్టంగా ఘనీభవించింది. ఆ క్షణంలో

'పాడు జీవితమూ యవ్వనమూ
మూడునాళ్ళ ముచ్చటలోయీ'

ట్యూనిచ్చింది గోడమీంచి గడియారం.

'మా మూణ్ణాళ్ళ ముచ్చట ముప్పై ఏళ్లకిందే మూతిముడుచుకుందన్న సంగతి దీనికెల్లా తెలిసింది చెప్మా? యంత్రాలు మనుషుల్ని నియంత్రించడం అంటే ఇదే కావొోను!' అనుకుంటూ ఎన్నో గంటకిదీ పాటపాడుతుందో చూద్దామని తలెత్తా.

ఎనిమిదయిందని చూసి తల, కళ్ళూ మళ్ళీ కిందకి పుస్తకంలోకి దింపుతూ చూసాను దాన్ని. చూసీ చూడ్డంతోనే కొయ్యబారిపోయా. నోట మాటరాలా 'అది'... అది కూడా నావైపే చూస్తోంది రెప్పెయ్యకుండా.(దానికి రెప్పలుంటాయా?)

చూసి చూసి విసుగేసినట్టు డైరెక్షన్ మార్చి కదిలింది అది. అది అదంటే అదే తేలు! పెద్దగా ఉంది. నల్లగా ఉంది. తేలనుకూడదేమో మండ్రగబ్బనాలేమో. అసలే నోరెండిపోతోంది. అంతపెద్ద మాట నోర్తిరగదు. తేలుకీ సెటిలవుతా.

అది నెమ్మదిగా ఏనుగులా గజగమనంతో తన భారీకాయాన్ని ముందుకు నడిపిస్తోంది. ఏనుక్కి తొండం ముందువైపున్నట్టూ దీనికి కొండెం వెనక వైపుంది. ఠింగ్‌మని స్టింగ్ చేసెయ్యడానికి రెడీగా ఎత్తి పెట్టుకునోస్తోంది. అది మిస్టర్‌హైడ్ వైపే స్టీరింగ్ తిప్పింది. నేను వేగంగా ఆలోచించాను.

"అమ్మోతేలు" అని గట్టిగా అరిస్తే? ప్రమాదం. ఆయన ఉలిక్కిపడి ఒక్క గంతేసి సరిగ్గా తేలు వైపే కాలేస్తే అది కాటేస్తే? అంటే కుడితే? పాపం! ఎంత కోపంగా ఉన్నా ఎంత మొగుడైనా సాటి మానవుడే కదా! ఒక్కటే ప్రాబ్లమ్. ఇవాళ మనకి మాటల్లేవు కదా ఎలా వార్నింగివ్వడం? మానవతా దృక్పథంతో కర్ఫ్యూ సడలించాల్సిందే. కంగారు పెట్టకుండా నెమ్మదిగా ఇండైరెక్టుగా చెప్తూ అసలు విషయం అర్థం అయ్యేలా చెయ్యాలి. నేను గొంతు సవరించుకున్నాను.

"ఏదైనా విషప్పురుగుని చూస్తే కలిగే

భయానికి మీ సైకియాట్రీ భాషలో ఏదైనా ప్రత్యేకమైన పదం ఉందా?'' అనడిగాను. మెడికల్ మరియు సైంటిఫిక్ సంగతులెత్తి ఎకడమిక్ డిస్కషన్‌లోకి దించి అసల్సంగతి చల్లగా చెబుతామని.

''ఆ... వుంది. వైఫోఫోబియా'' అని ఆన్సరొచ్చింది. 'అది' ఎనిమిదంగుళాల దూరంలో ఉంది. అదాయన కాల్దగ్గర కొచ్చేలోగా నేను విషయానికొచ్చెయ్యాలి.

''విషంతో కుట్టే పురుగు సమీపంలో ఉన్న సిట్యుయేషన్‌లో కూడా భయపడకుండా ఉండే వ్యక్తులక్కూడా ఏదైనా స్పెషల్ పేరుందా?'' అనడిగాను ఇప్పుడు మీరలాంటి వ్యక్తిగా మారాలి అని సూచిద్దామన్న సదుద్దేశంతో.

''అటువంటి సిట్యుయేషన్‌ని 'పెళ్ళి' అంటారు. దానికి భయపడని వ్యక్తిని 'భర్త' అంటారు ఏ సైన్సులోనైనా'' కచ్చగా వచ్చింది జవాబు.

మన మట్టి బుర్రలోకి ఆన్సర్ నంబర్‌వన్ యొక్క మీనింగ్ అవ్వటికి ఇంకింది. ఒళ్ళుమండిపోయింది. కంట్రోల్ చేసుకున్నాను. తప్పదు. సరే ఇంకొంచెం డైరెక్టు రూట్లో వద్దాం. 'అది' రెండంగుళాలకి వచ్చేసింది.

''తేలు లాంటి విష జీవిని చూస్తే మీరు భయపడి కంగారుపడి పోతారా?''

''ఇప్పుడు చూస్తూనే ఉన్నానుగా? ఏం భయపడుతున్నాను? ఎంత కూల్‌గా ఉన్నానో కనిపించట్లేదా?'' సూటిగా నా ముఖంలోకి చూస్తూ ప్రశ్నించాడు గంభీరంగా.

చచ్చాం. నున్నితాలూ రౌండెబౌట్లూ ఇన్‌డైరెక్టూ లాభంలేదు నాకన్నా ట్యూబ్‌లైటు ఇహ డైరెక్ట్ స్పీచే గతి.

''మీ కుర్చీకిందే మీ ఎడంకాలికి దగ్గరగా నల్లటి పెద్ద తేలుంది''

కూల్‌గా 'ఓహో'; అనుమానంగా ''ఆఁ?!''; భయంగా ''ఆ..ఆ..ఆ..!!!'' ఒక్క అంగలో డైనింగ్ రూమ్‌లోకెళ్ళిపోయారు మిస్టర్ హైడ్ దకూల్ కస్టమర్ చాలా వేడిగా. మనం అప్పటికే డైనింగ్ టేబుల్ మీద నిలబడి పోయాం.

నల్లతేలు 'ఇంత పిరికి సన్నాసులెక్కడా చూళ్ళేదు' అన్నట్టో లుక్కు మావైపు నిరసనగా విసిరి పక్కకి తిరిగింది. అప్పుడు చూశాం ఇద్దరం - ఇంకో గోడవారనున్న బొద్దింకని తరుముతూ అది ఆ కుర్చీకిందకొచ్చిందని.

బొద్దింక గోడవారనే పరిగెత్తి చీకటి గుయ్యారం లాంటి చిన్నకారిడార్ లోకి తిరిగింది. ఆ కారిడార్‌లో తిన్నగా ఏడడుగులు నడిచి కుడివైపుకి తిరిగితే ఇంకా చీకటిగా ఉండే బాత్రూమ్ వస్తుంది. మా మెడికల్ కాలేజి క్వార్టర్సన్నీ ఇలాగే చీకటి గుహల్నీ గుయ్యారాలనీ తొలిచి కట్టినట్టుంటాయి. ఎక్కడ వెలుతురుండాలో అక్కడ పగలు కూడా చీకటే ఉంటుంది. లైట్లు వెలగవు. కొందరి బుర్రల్లో లాగే! అన్నీ లూజు కాంటాక్ట్‌లు. ఆ చీకటి వెలుగుల దోబూచుల్లో మేం రకరకాల బూచుల్తో అశాంతియుత సహజీవనం చేస్తుంటాం.

తేలు కారిడార్ ఎంట్రన్స్ పాయింట్ దగ్గర నిలబడి సర్వేచేసింది. బొద్దింక ఎటుపోయిందా అని.

మా ఆయన ఎడంచేత్తో ఓ బూటు కుడి చేత్తో పొడుగాటి ఇనపచువ్వని త్రిశూలంలా పట్టుకుని జాగ్రత్తగా ఎత్తెత్తి అడుగులు వేస్తూ తేలు వెనకాల చేరారు. ఎడం చెయ్యి పైకెత్తి అర్జునుడి లెవెల్లో గురిచూసి ఠాప్పుమని కొట్టారు. ఆ దెబ్బకి ఆయనే అదిరిపోయినట్టున్నారు అరనిముషం అలాగే అదిమి పట్టుంచి ఆయాసపడ్డారు. ఆయాసం తీరాక స్లోమోషన్‌లో బూటాయుధాన్ని పైకి తీసారు.

నేను ఊపిరి బిగపట్టి ఉత్కంఠగా చూస్తున్నా. బూటు పూర్తిగా పైకిలేచింది. కింద ఏమీలేదు. ఖాళీ. తేలేమయింది చెప్మా!

'హలో! ఇక్కడ' కొండెం ఊపి పిలుస్తోంది తేలు, రెండగులు దూరంనించి.

''హుఁ! చత్వారాలొచ్చాక శత్రు సంహారిలిలాగే ఏడుస్తాయి'' గొణుక్కుంటూ కిటికీ దగ్గరికెళ్ళా. ''చింటూ! మింటూ!'' అంటూ పిలిచాను, మా పక్కింటి టీనేజి కుర్రాళ్ళ పేర్లులెండవి.

వాళ్ళ కిటికీ దగ్గర అరడజన్ మొహాలు ప్రత్యక్షమయ్యాయి. వాళ్ళ అమ్మా నాన్నా ఊరెళ్ళిన శుభసందర్భంలో ఈ కుర్రాళ్ళు పార్టీ చేసుకుంటున్నారల్లే ఉంది! ''వాట్ ఆంటీ?'' అంది ఆరు మొహాల్లోంచీ ఓ మొహం. ''కొంచెం హెల్ప్ కావాలి ఇలా వస్తారా?'' అనడిగాన్నేను నా హెల్ప్‌లెస్ గ్రాండ్‌మదర్ గొంతుపెట్టి.

''వాళ్ళనెందుకూ పిలుస్తావ్? ఉన్న సమస్య చాలదా?'' శ్రీవారు యుద్ధం మొదలెట్టారు.

గుండెల్లో దడ దడ పుట్టించే టకటక శబ్దాల్లో అమ్మాయిలు రాక్, షేర్, క్యాట్‌వాక్‌లు చేసుకుంటూ గృహం ప్రవేశించారు, వింతైన డ్రెస్సులూ విడ్డూరమైన హెయిర్ డ్రెస్సులు వాళ్ళూను!!

''వాట్ ఆంటీ?'' ''వై ఆంటీ?'' ''వాట్ అంకుల్?'' ''వై అంకుల్?'' అంటూ కాళ్ళూ చేతులూ తొక్కేసుకున్నారు వాళ్ళల్లో వాళ్ళే.

నేను పరిస్థితి వివరించాను. అమ్మాయిలు భయంతో కెవ్వు కెవ్వున కేకలు పెట్టారు. అబ్బాయిలు భయం దాచిపెట్టడానికి కేకలు పెట్టారు.

టార్చి వేసి శత్రువుని చూపించాను. మళ్ళీ కెవ్వుకెవ్వులు ''ఓ గాడ్ మై గాడ్'' అనుకుంటాను.

''నేన్చెప్పానా ఈ హిస్టీరియా పేషంట్లని పిలవద్దని'' అన్నాయి మా ఆయన చూసిన ఈటెల్లాంటి చూపులు.

జీన్సు తొడిగిన అస్తిపంజరం లాంటి పిల్లొకత్తె అర్జంటుగా ఫ్రిజ్ దగ్గరకి పరిగెత్తింది. ''ఏనో రెక్సియా నెర్వోజా'' అన్నారు హైడ్ పాత్రని కాసేపు పక్కనపెట్టి డాక్టర్ జకిల్‌గా అవతరించి ఇన్‌స్టంట్‌గా ఆ పిల్ల జబ్బుని డయగ్నోజ్ చేసి సంతోషిస్తూ.

ఆ అమ్మాయి ఫ్రిజ్ తెరిచేసి ఓ ఐస్‌క్రీమ్‌కార్టన్ లాగి డైరెక్టుగా అందులోంచే తినెయ్యడం మొదలెట్టింది. భయం తగ్గించుకోవడానికి తిండే మార్గం కాబోల్ పిల్లకి.

''ఫౌల్!'' ఏకగ్రీవంగా అరిచారు మిగతా టీనేజి జనాభా. ''చూడండి ఆంటీ! అంతా




జూన్ రెండవ వారంలో చేపమందు పంపిణీ సందర్భాన్ని పురస్కరించుకొని సరదాగా...

తనొక్కత్తే లాగించేస్తోంది. మేం అందరం మలమలా మాడిపోతుంటే!" కంప్లెయింట్ చేశారు.

"ఇంకా రెండు కార్టన్‌లున్నాయి. తేలును చంపితే అన్నీ మీకే" ఐస్‌క్రీమ్ చూపించి ఫ్రిజ్ లాక్ చేసాను.

"ఓకే. కమానిండియా! హిటిట్! కిలిట్!" ఛీరింగ్ చేశారు అమ్మాయిలందరూ డైనింగ్ టేబుల్ మీద గుంపుగా, సెక్యూర్‌గా నిలబడి.

అబ్బాయిలొక్కొక్కళ్ళూ ఒక్కో ఆయుధం ధరించి యుద్ధానికి సిద్ధమయ్యారు. రెండు క్రికెట్ బ్యాట్లూ, మూడు టెన్నిస్ ర్యాకెట్లు, రెండు తిరగేసి పట్టుకున్న చీపురు కట్టలు - ఇవీ వెపన్స్.

బ్యాట్‌ని నిలువుగా కుడిచేత్తో పట్టుకుని బ్యాలెన్స్ కోసం ఎడంచెయ్యి పక్కకు చాపి గురి చూసాడు చింటూ.

శత్రు బలగాన్ని బేరీజు వేస్తున్నట్టు గుడ్లు కదపకుండా కాన్‌సన్‌ట్రేట్ చేసింది తేలు.

చింటు వెనకాల సైనికులందరూ సిద్ధంగా ఉన్నారు.

"ఎటాక్!" గావు కేక పెట్టాడు చింటూ.

ఎటాక్ చేసింది తేలు! కొండి ఎత్తిపెట్టి పృథ్వీ మిసైల్‌లా దూసుకొచ్చింది అబ్బాయిలవైపు.

"బచావ్!" నాయకుడు చింటూతో సహా సైనికులందరూ నేలమీద మాయమయి సోఫాలు, కుర్చీలు, బల్లలు మొదలయిన వాటి మీద ప్రత్యక్షమయ్యారు.

"నేన్చెప్పానా? ఈ ఫోబిక్స్‌ని పిలవద్దని చెప్పానా?" అన్నాయి హైడ్ ప్లస్ జకిల్ గారి చూపులు. నేను చూపులు మళ్ళించుకున్నాను.

"షేమ్! షేమ్!" అరిచారు డైనింగ్ టేబుల్ టాపర్స్, అబ్బాయిలు కిందకి దిగారు. పౌరుషం వచ్చికాదు. తేలెందుకు పరిగెత్తుకొచ్చిందో తెలియడం వల్ల. నేలకన్నంలోంచి సడన్‌గా బైటికొచ్చిన బొద్దింకని ఎటాక్ చేద్దామని పరిగెత్తుకొచ్చింది తేలు. దాన్నపార్థం చేసుకుని వీళ్ళు తోకలు ముడిచి సోఫాలెక్కారు.

బైటకొచ్చిన బొద్దింక తన మీదకొచ్చిన తేలున్చూసి ఓ క్షణం బిత్తరపోయింది. లేని ధైర్యం తెచ్చుకుని తేలు కళ్ళల్లోకి సూటిగా చూసింది.

తేలుకూడా బొద్దింక కళ్ళల్లోకే కన్నార్పకుండా చూస్తూ నెమ్మదిగా ముందు కొచ్చింది.

తేలుని బొద్దింక, బొద్దింకని తేలూ హిప్నటైజ్ చేసుకునే ప్రయత్నం కళ్ళలో కళ్ళు పెట్టుకుని తీవ్రంగా చూసుకున్నాయి. బొద్దింకే గెలిచింది.

తేలు అరమూతలు పడ్డ కళ్ళతో మత్తుగా అటూ ఇటూ ఊగింది. బొద్దింక గోడకన్నంలోకి తుర్రుమని మాయం అయిపోయింది. తేలు పాపం వెర్రిమొహం (ఆ పార్టుని మొహం అనచ్చా?) వేసుకుని నిలబడిపోయింది.

"ఇదే సమయం. కొట్టండి!" ప్రోత్సహించా. అందరూ టపటపా ఫటఫటా కొట్టారు తేలెక్కడ ఉందని వాళ్ళనుకున్నరో ఆ స్పాట్ మీద. అందరూ ఒకేసారి వేర్వేరు స్పాట్ల మీద వీరబాదుడు బాదుడు, ఏకత్వం భిన్నత్వంలా.

మా హైడ్ చేతిలో ఇనప కడ్డీ ఇద్దరు కుర్రాళ్ళ పాదాలు పచ్చడి చేసింది. వాళ్ళ చేతుల్లోని చీపుళ్ళు ఒంగి ఉన్న ఆయన వీపుని సాపుచేసాయి.

"అయ్యో అంకుల్ మీరా?" అన్నాడో బ్బాయి. కొనరులాగా కనిగా ఇంకో దెబ్బ వేసి నాలిక్కరచుకుని 'సారీ' అన్న పదానికభినయం పట్టేస్తూ.

"చెప్పానా? చెప్పానా? ఈ వయొలెంట్ మానియక్స్‌ని పిలవద్దని?" అన్నాయి ఆయనగారి చూపులు. నేను కిటికీ లోంచి శూన్యంలోకి చూసాను.

"మొత్తానికి తేలున్నేను చంపాను" అన్నాడో ఎర్రచొక్కా కుర్రకుంక. (ఎ.కు) అది విని చూపుల్తో పెళ్ళాన్ని భస్మం చెయ్యటమెలా? అన్న టాపిక్ మీద రిసెర్చ్ చేస్తున్న మా ఆయన అతనికేసి చూసారు.

"చంపావా? ఏదీ?" అడిగారు.

"ఏమిటి ఏది?" ఎ.కు.

"అదే... తేలు"

"అదే తేలా? ఇంకెక్కడుంది? అది చచ్చింది. పరలోకంపోయింది.భూమ్మీద లేదింక" అన్నాడు ఎ.కు అతి తెలివిగా. "ఇంక ఐస్‌క్రీమ్ నాకిచ్చెయండి. అఫ్‌కోర్స్... నాక్కుండా ఇచ్చెయండి" అని కూడా అన్నాడు.

"చంపితే దాని డెడ్ బాడీ చూపించు" అన్నాడు చింటూ.

"యా. హెబియస్ కార్పస్?" అన్నాడు మింటూ.

"హెబియస్ కార్పస్ బతికున్న బాడీస్ కోసమే అడగాలి. చచ్చిన బాడీస్ కోసం కాదు" అన్నాడు ఎ.కు. చట్టాన్నంతా అవపోసన పట్టేసినట్టు.

"ఏం కాదు. అడగచ్చు. పెర్రీమేసన్ చదవలేదా?" మింటూ

"ముస్సలి తాతలు చదువుతారు పెర్రీమేసన్. చట్టం మారిపోయింది. గ్రాండ్‌పా!" ఎ.కు. వెక్కిరించాడు.

"నో, చట్టాన్నెవరూ మార్చలేరు. చట్టం ముందు అందరూ సమానులే" ప్రకటించాడు చింటూ తన పొడుగాటి జులపాలూపుకుంటూ. ఏ నాటికైనా తను ప్రెసిడెంటాఫిండియా అవుతానని వాడి ప్రగాఢ వాంఛ మరియు విశ్వాసం.

"ఆగండాడండి. ఇదేమన్నా అసెంబ్లీనా పార్లమెంటా? పాయింట్‌లెస్‌గా వాదన లేసుకోవడానికి? మనం ఇక్కడ తేలును చంపడానికి సమావేశమయ్యాం, అక్కర్లేని డిస్కషన్ల కోసం కాదు." కేకలేసి అందరి నోళ్లు మూయించా. ఎ.కు.వైపు తిరిగాను "నేను చంపేసాను అని డిక్లేర్ చేసి లాభం లేదు. సాక్ష్యాలు-ఎవిడెన్స్-చూపించు. నేనే హత్య చేసాను అని నువ్వు పాలకొల్లు గోపురం మీదెక్కి నుంచుని కేకలు పెట్టినంత మాత్రాన ఉరిశిక్ష వేసెయ్యరు. సాక్ష్యం కోసం ఏళ్ల తరబడి విచారిస్తారు కోర్టువారు. అలాగే నువ్విప్పుడు తేలును చంపినట్లు చూపించాలి. చచ్చిపోగానే మన తేలు బొందితో స్వర్గాని కెళ్లిపోదు. తన పార్థివ శరీరాన్నిక్కడే వొదిలి ఆత్మతో మాత్రమే పోతుంది." అని ఎ.కు.కి.ఎక్స్‌ప్లెయిన్ చేసాను.

"అందరూ మీమీ ఆయుధాలిలా ఇవ్వండి. తేలు పచ్చడై దేనికైనా అంటుకుందేమో చూద్దాం. చీపుళ్లూ ఇనుపచువ్వలూ అక్కర్లేదు" అన్నాను అవెక్కడ పడ్డాయో తెలుసు కాబట్టి.

అందరూ అన్నీ చూపించారు. కహీఁభీ నహీ. నేలంతా వెతికాం నాస్తి.



ఉన్నట్టుండి డైనింగ్ టేబుల్ మీంచి "బచావ్! బచావ్!" అరుపులు వినిపించాయి. అందరం అటు చూశాం.

అది డైనింగ్‌రూమ్ గుమ్మం దగ్గర నిలబడుంది. అక్కడ నిలబడి టేబుల్ మీది కలర్‌ఫుల్ కన్నెపిల్లల గుంపుని మెచ్చుకోలుగా చూసింది. తన డెక్కలు రెండింటినీ రెండుసార్లు కలిపింది అభినందనలతో చప్పట్లు కొడుతున్నట్లు.

నిశ్శబ్దంగా చూస్తూ నుంచున్నాం. అది ఇప్పుడెటుకదుల్తుందో అని. టేబులెక్క కుండా నేలమీదే నిలబడి ఐస్‌క్రీమ్‌లాగిస్తున్న మిస్ ఎనొరెక్సియా టెన్షన్ పట్టలేక యమాస్పీడ్‌గా తినేస్తోంది.

తేలుని కదలకుండా దిగ్బంధం చేయడానికి తెలుగువాళ్లు కనిపెట్టిన మంత్రం నాకు సడెన్‌గా గుర్తొచ్చింది.

''కోడిక్కోడిక్కోడిక్కోడి'' జపించడం మొదలెట్టాను. కుర్రాళ్లందరూ గుడ్లు పెద్దవిచేసి నా వైపు భయం భయంగా చూసారు. ''నేన్చెప్పానా ఈ ఆంటీక్కొంచెంక్రాకనీ?'' అంటున్నాడు చింటూ మింటూగాడి చెవిలో.

''ఏంటమ్మా చింటూ అంటున్నావ్?'' అడిగాను.

''ఏం లేదాంటి. నేలంతా క్రాకిచ్చేసిందీ తేలెందులోనైనా దూర్తుందేమోనంటున్నా. అవును గానీ కోడి కోడి అంటున్నారెందుకాంటీ? అన్నాడు వాడు అమాయకంగా మొహం పెట్టి.

"అవునూ అలా ఎందుకనాలీ?" ఓ క్షణం ఆలోచించా. ఎప్పుడో ఎవరో ఏదో ఎక్స్‌ప్లనేషనిచ్చారని గుర్తు. అదేవిటో ఇప్పుడు గుర్తు రావట్లా.

"ఎందుకనాలో నాకు తెలుసుకానీ నేనిప్పుడు చాలా బిజీగా ఉన్నా అడ్డదిడ్డం ప్రశ్నలేసి నన్ను డిస్టర్బ్ చెయ్యకు."చింటూని కసిరేసి, మళ్లీ 'కోడిక్కోడిక్కోడి'మంత్రం జపించా.

మూతులకి చేతులడ్డం పెట్టుకుని కుర్రకుంకలాహాటే నవ్వులు. ఏడవనీ భడవల్ని !"కోడిక్కోడిక్కోడిక్కోడి"...ఆశ్చర్యం! మంత్రం పనిచేసింది! తేలు కదలకుండా నిలబడింది. మంత్రబద్ధురాలైందల్లే ఉంది!

అందరి చేతుల్లోనూ ఆయుధాలు నిశ్శబ్దంగా లేస్తున్నాయి. నుంచున్నదాన్ని నుంచున్నట్టే కొట్టేసేటందుకు. ఉచ్ఛ్వాస నిశ్వాసములు, లబ్‌డబ్‌లు స్తంభించాయి. ఆ టెన్షనిండిన క్షణంలో...

టింగ్ డిడింగ్ డింగ్‌మని అడ్డదిడ్డంగా పరుగెత్తుకుంటూ వచ్చి తేలుని టీజ్ చేసింది బొద్దింక. లెఫ్టినించి రైటుకి తిరిగి, యు టర్న్ కొట్టి ఎనొరెక్సియా పాదాలమీంచి పాక్కుంటూ డైనింగ్ టేబుల్ కిందకెళ్లింది. దాని వెనుకే తేలూను.

"చూస్కోచూస్కో","వాచవుట్ వాచవుట్" బల్లమీది బ్యూటీస్ గోలపెట్టారు.

తేలు ఎనొరెక్సియా పాదాల దాకా వెళ్లిపోయింది. అరక్షణం ఫ్రీజయిపోయిన ఎనొరెక్సియా మరుక్షణం తేరుకుంది.

''థూవ్'' నోటినిండా ఉన్న ఐస్‌క్రీమ్‌ని తేలుమీద ఉమ్మేసింది. తేలు స్టన్నయిపోయింది.

సురభి నాటకాల్లో వైరు ట్రిక్కులాగా ఎనొరెక్సియా పిల్లని టేబుల్ మీదకి 'జుఁయ్' మని లాగేసారు మిగతా పిల్లలు.

ఎనొరెక్సియా చేతిలో కార్టన్ అడుగు ఊడిపోయి మిగిలిన ఐస్‌క్రీమ్ అంతా చల్లని పిడుగులా ఒక్కసారి తేలు మీద పడింది.

గులాబి రంగు ఐస్‌క్రీమ్ కుప్పకింద నల్లరంగు తేలు మాయమయింది. నెమ్మదిగా ఐస్ కరుగుతూ మొదట నల్లని గుండ్రటి కళ్లు వెలుపలికొచ్చాయి. తరువాత కొండి, ఆ పై డెక్కలు మిగతా శరీరమూ.

అయితే ఇప్పుడా శరీరం వేరేగా ఉంది. ఐస్‌క్రీమ్ పిడుగు పడక ముందు పూర్తిగా కల్తీలేని నల్లరంగుతో నిగనిగలాడింది తేలు దేహం. పిడుగు తరువాత ఎమర్జయిన శరీరమూ నల్లగానే ఉందిగానీ ఆ నల్లరంగు మీద గులాబి రంగు చుక్కలున్నాయ్!

''ఓ! ద స్పాటెడ్ స్కార్పియన్! చుక్కలున్నతేలు!" అరిచారెవరో.

తేలు దీనంగా చూసిందందరి వైపూ."పాపం! తనని తనే గుర్తుపట్టుకోలేదేమో అదిప్పుడు" అన్నాను.

"యా. ఇట్స్‌గోయింగ్ త్రూ ఐడెంటిటీ క్రైసిస్" అన్నారు మా ఇంటి సైక్రియాటిస్ట్.

వంటింట్లోకి హడావుడిగా పరిగెడుతున్న బొద్దింక ఆగి వెనక్కి తిరిగింది. ఈ కొత్త అవతారాన్ని తేరిపారచూసింది. చూసి చూసి చిందులేసి గిరగిరా తిరిగి పొట్టపగిలేలా నవ్వింది చప్పుడు చేయకుండా.

బొద్దింక నవ్వుచూసి అవమానభారంతో కుచించుకుపోయింది తేలు. డెక్కలు ముడిచేసింది. కొండె కిందకి దింపేసింది.

సిగ్గుతో సగం చచ్చిన తేలుని పూర్తిగా చంపడానికి మా ఆయన వంతంగా ముందుకొచ్చారు. ఇనుపచువ్వని దుడ్డుకర్రలా ఎత్తి పట్టుకుని పెద్దపెద్ద అడుగులు వేస్తూ ఆవేశంగా వచ్చారు."ఠాంగ్!!!" చువ్వ బలంగా పడింది. తేలుమీద కాదు నేలమీద.

పాత సినిమాల్లో సీతమ్మ వారికోసం భూమాత విచ్చుకున్నట్టుగా గవర్నమెంటు వారి సిమెంటు నేల క్రాకిచ్చింది. గులాబి చుక్కల నల్లతేలు వెనక్కి తిరిగి చూడకుండా ఆ పగుల్లో ప్రవేశించింది. కంటిక్కనపడని అథోలోకాల్లోకెక్కడికో నిష్క్రమించింది.

ఒక మహావీరుడి మహాభినిష్క్రమణం చూస్తున్నట్టుగా అనిపించి మా గుండెలు భారంగా జాయింటుగా నిట్టూర్చాయి!

నేనొక నల్లటి వెడల్పాటి స్టికింగ్ టేప్ తీసుకొచ్చి నేలమీద క్రాక్‌పై గట్టిగా అంటించేసాను.

'గుడ్ బై అండ్ థ్యాంక్యూ డియర్ వృశ్చికం!" యు ఆర్ ది బెస్ట్ మ్యారేజ్ కౌన్సిలర్. అలిగి అహంకరించి మాటాడుకోవటం మానేసిన మొగుడూ పెళ్లాలు మళ్లీ మాట్లాడుకునేలా కలిపావ్. ఆ మాటలు చాలా వెటకారంగా ఉన్నా సరే అసలంటూ మాటాడుకునేలా చేసావ్. వివాహబంధాలు విడాకులైపోకుండా ఉండాలంటే అప్పుడప్పుడూ ఊరికే భయపెట్టి కుట్టకుండా వెళ్లిపోయే నీలాంటి ప్రియ కీటకాలు భార్యాభర్తల మధ్యకి వస్తుండాలి మరి' అనుకున్నాను.

'అలకలు తీరిన కన్నులు ఏమనె ప్రియా'

ట్యూనిచ్చింది గోడమీంచి గడియారం.





# లలిత సంగీతం

ప్రముఖ గాయకుడు, స్వరకర్త
లలిత సంగీత విద్వాంసుడు,
వాగ్గేయకారుడు

**ఎం.చిత్తరంజన్**

సమర్పిస్తున్న శీర్షిక ఇది.
ఫోన్ నెం. 040-27402993

## ఒక మది మహతీ నాద సుధ

ప॥ ఒక మది మహతీ నాదసుధ
చిలికిన దట యిల రామకథ
రామకథ శ్రీరామకథ

1.చ॥ ఉడుత మనసున్న స్వామి కరుణించు
కలత పడనీక కడలిని దాటించు
మంగళకరమట ఆ పాదుకలు
తలనిడుకొనునట ఏడేడు లోకాలు

2.చ॥ గౌతమి గంగ పంచవటీ సీమ
నీపద ధూళిలో పులకించంగ
అడవి అయోధ్యగ విరబూచేనంట
అతడున్నచోటంత ఆనందమేనంట

3.చ॥ మానవత్వమే రామతత్త్వమట
మనిషి మనీషిగ మనలో తానట
మహనీయులకు మాననీయుడట
మహిలో మనకే దేవదేవుడట



రచన, సంగీతం : ఉషాకాంత్
గానం : ఉషాకాంత్, వేదవతి ప్రభాకరరావు
రాగం : సింధు భైరవి - రాగ్ భైరవి (హిందుస్తాని సం॥)
తాళం : ఆది (కర్ణాటక సం॥) - కహరువా (హిందుస్తాని సం॥)
ఆరోహణ : స రి గ మ ప ద ని స
అవరోహణ : స ని ద ప మ గ రి స

**- షడ్జము, శుద్ధరిషభం, సాధారణ గాంధారం, శుద్ధమధ్యమం, పంచమం, శుద్ధ ధైవతం, ఖైశికినిషాదం - యీ రాగంలోని స్వరాలు.**

ఇవేకాక చతుశృతి రిషభం, ప్రతిమధ్యమం, చతుశృతి రిషభం, ప్రతి మధ్యమం, చతుశృతి ధైవతం కూడా యీ రాగంలో వాడబడుతాయి. అయితే స్వరకర్త యీ పాటకు కూర్చిన బాణీలో చతుశృతి ధైవతాన్ని మాత్రం ఉపయోగించలేదు. హిందుస్తాని సంగీతంలో ఉదయం పాడబడే రాగాలలో ఒకటిగా రాగ్‌భైరవి ప్రసిద్ధి చెందినది. ఆ సంగీతంలో యీ రాగం ప్రముఖ శాస్త్రీయ రాగంగా పరిగణించబడుతున్నది. ఉత్తర భారతంలో యీ రాగం దాదాపుగా అన్ని రసాలకూ ఉపయోగించబడటం విశేషం. లలిత సంగీతానికి ఎంతో అనుకూలమైన యీ రాగంలో దక్షిణాదిన ఎక్కువగా శృంగార, కరుణ రసాలకు సంబంధించిన పాటలు మనకు వినిపిస్తాయి. కాని ఉత్తర దేశంలో హాస్యము, వీరము మొ॥ రసాలకు సంబంధించిన పాటలు కూడా మనకు కనిపిస్తాయి. హిందీ చలన చిత్ర గీతాలలో యీ విషయం మనం గమనించవచ్చు. పూజ్య బాపూజీ నిర్యాణం చెందిన ఘట్టాన్ని పురస్కరించుకుని సింధుభైరవి రాగంలో మహమ్మద్ రఫీ గానం చేసిన "సునోసునో ఐ దునియావాలో బాపూ కీ యే అమర్ కహాని" అనే ప్రైవేటు రికార్డు భారత ప్రజలను ఎంతగానో ఆకట్టుకుంది. అలాగే జాతి సమైక్యత, సాంస్కృతిక విశిష్టతను ప్రబోధించే విధంగా పలు భారతీయ భాషల మినీ గీతాలతో రూపొందించిన "మిలే సుర్ మేరా తుమ్హారా" అన్నది ఆకాశవాణి, దూరదర్శన్ కేంద్రాలలో విస్తృతంగా ప్రసారమై అమిత ప్రచారాన్ని పొందింది. భీమ్‌సేన్‌జోషి, డా॥బాలమురళీకృష్ణ, లతా మంగేష్కర్ మొదలగు వారంతా సింధుభైరవిలో గానం చేసిన యీ గీతికా గుచ్ఛంలో చివరగా స్వరకర్త (Louis Banks) రాగంలో అన్య స్వరాలు చేర్చకుండా గ్రహ భేదం చేసి "జనగణమన" గీతంలోని "జయహేజయహే జయజయజయ జయహే" అన్న పంక్తి యొక్క ట్యూన్‌ని తలపింపచేసేదిగా రూపొందించడం ఎంతో హృద్యంగా వున్నది. సింధుభైరవి రాగం గురించిన విషయాలు చాలా వరకు 1-15 జనవరి 02 "హాసం" సంచికలో తెలియజేశాను.

రామనామం మధురమైనది. రామాయణగాథ పావనమైనది. నారదుడు వాల్మీకిని రామునిగాథను గ్రంథస్థం చేయమని కోరటం విజ్ఞులెరిగిన విషయమే. నారదుడు మీటే వీణ పేరు 'మహతి'. ఆ మహతీ నాదసుధ రామకథను చిలికినదట. ఆ రామాయణాన్ని లలిత పదాలతో ఒక చిన్న పాటలో అద్భుతంగా చిత్రీకరించారు ఉషాకాంత్. సేతుబంధం, పాదుకా పట్టాభిషేకం వంటి ఘట్టాలను సూచిస్తూ ఆదర్శ మానవతామూర్తియైన రాముని స్తుతిస్తూ సాగే యీ లలిత గీతము, బాణీ కూడా లలితంగా అమర్చుకుని సువాసనలీనే స్వర్ణ కుసుమంగా భాసిస్తున్నదనటం అతిశయోక్తి కాదు.

## ఉషాకాంత్

ఆకాశవాణిలో లలిత సంగీత స్వరకర్తగా, గాయకుడుగా సుమారు మూడు దశాబ్దాలకు పైగా సంగీత సేవ చేస్తున్న కళాకారుడు శ్రీ ఉషాకాంత్. వృత్తిరీత్యా ఎల్.ఐ.సి.లో ఉద్యోగిగా పనిచేసిన యీయన అసలు పేరు జి.వేదాంతం. ఆయనతో నాకు 1968 నుండి పరిచయం. హైదరాబాద్ ఫిలిం టాలెంట్స్ గిల్డ్‌లో నేను, నిర్మల్‌కుమార్, ఉషాకాంత్, ఆయన సోదరుడు ప్రీతమ్ మొదలైన వారందరమూ ఎన్నో సంగీత కార్యక్రమాలను నిర్వహిస్తూండేవాళ్ళం. కర్ణాటక శాస్త్రీయ సంగీతంలో వీణావాదన కూలంకషంగా అభ్యసించిన ఉషాకాంత్ గాయకుడు, స్వరకర్తయే కాక చక్కని రచయిత కూడా. పాట రాసినా, బాణీ కూర్చినా, గానం చేసినా సున్నితంగా హృదయానికి హత్తుకునేలా ఉండటం యీయనలోని ప్రత్యేకత. సహజంగా







స్నేహశీలి అయిన ఉషాకాంత్ నాకెంతో ఆప్తుడు. ఆకాశవాణిలోను, దూరదర్శన్‌లోను అనేక గీతాలు, సంగీత రూపకాలు ఆయన స్వరపరచినవి ప్రసారమైనాయి. "పల్లెరా యిది పల్లెరా" (పులికంటి కృష్ణారెడ్డి), "ఇది మానవతా గీతం" (వై.రామకృష్ణారావు), "భారతనందన వనమున విరిసిన కుసుమము నేను" (డా॥పద్మినీదేవి), "ఏ ఊహ వేసిన బొమ్మలో" (కృష్ణశాస్త్రి), "కన్నుల నీరున్నా" (దుర్గా నాగరాజు) మొ॥న గీతాలు మచ్చుకు కొన్ని. సాధారణంగా లలిత సంగీతంలో ఉపయోగించబడని 'గౌళ' రాగాన్ని డా॥ పద్మినీదేవి రచించిన "భారతనందన వనమున" గీతానికి వాడి చక్కని బాణీ కూర్చారు ఉషాకాంత్. ఆకాశవాణి గాయనీ గాయక బృందం చేత ఎన్నో పాటలు పాడించారు ఆయన. నార్ల చిరంజీవి రచన "తెలతెల వారకముందే" అనే పాటకు యీ స్వరకర్త కూర్చిన బాణీని నేను చాలాసార్లు వేదికల మీద పాడడం జరిగింది. శివగంగ, లేపాక్షి, సింగారి, వసంత రాజీయం, యదుకిశోరం, గీత గోవిందం (జయదేవ), వాల్మీకి మహర్షి మొదలగు సంగీత రూపకాలకు వేమన యోగి, సుప్రభాతం పంచతంత్రం (కార్టూన్ సీరియల్) మొ॥లైన టీవీ సీరియల్స్‌కు, చలో ఢిల్లీ, అర్చన, ప్రేమించిచూడు (నిర్మాణంలో వున్నది) మొదలగు చలన చిత్రాలకు, చిలక పలుకులు (బాలల అకాడమీ వారిది), జిహ్వే కీర్తయా, సుప్రజారామ మొ॥లగు ఆడియో ఆల్బంలకు సంగీతాన్ని సమకూర్చారు యీ స్వరకర్త. 'చలో ఢిల్లీ' అనే బాలల చలన చిత్రానికి ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర అవార్డు లభించినది. 1995లో ఆకాశవాణి వార్షిక అవార్డులలో ఉషాకాంత్ సంగీత సారథ్యం వహించిన "శివగంగ" సంగీత రూపకానికి మెరిట్ సర్టిఫికెట్ లభించినది. ఉషాకాంత్ కుటుంబంలో అందరూ కళాకారులే. ఆయన శ్రీమతి, కుమార్తె, కుమారుడు డా॥శ్రీకాంత్ అందరూ కూడా ఆకాశవాణిలో పాడే గాయనీ గాయకులు. పదవీ విరమణ తరువాత నిరంతర సంగీత సేవలోనే సాగుతున్న ఉషాకాంత్ జీవితం ధన్యము.

**సింధుభైరవి రాగాధారంగా చిత్ర గీతాలను "హాసం" పత్రిక 1-15 జనవరి 2002, 1-15 మే 2002 సంచికలలో పేర్కొనడం జరిగింది.**



# బాపు విశ్వరూపం 13

పుస్లకాల కవరు పేజీలు డిజైన్ బాపు ఒక నూతన పంథాను ఆవిష్కరించారు. కొత్త ఒరవడిని ప్రవేశపెట్టారు. పుస్తకమంతా పూర్తిగా చదివి, దానిలో ప్రధాన సన్నివేశాన్నో, ప్రధాన రసాన్నో కొన్నిగీతలలోనే వ్యక్తం చేయగల దిట్ట బాపు. బాపు పఠనాసక్తి, చదివినది ఆకళింపు చేసుకునే శక్తి ఆయనకెంతో ఉపకరించాయి. రచయిత చెప్పాలనుకుని చెప్పలేకపోయినది కూడా బాపు కవరు పేజిలో కనబడుతుంది చాలాసార్లు. ఆయన వేసిన కవర్ ఇలస్ట్రేషన్స్ ఎన్నో వందలు; ఎన్నో రకాలు. ఈసారికి ప్రబంధ కావ్యాలను ఆకర్షణీయంగా అందించిన తీరు చూద్దాం-

ఎమెస్కోవారు 2 రూపాయలకే పుస్తకాలు అందించే రోజుల్లో సంప్రదాయ సాహితి పేర ప్రబంధాల పునర్ముద్రణ మొదలు పెట్టారు. వాటికి కవరుపేజిలు వేసేటప్పడు బాపు ఆ కావ్యాలను చదివి, ఆస్వాదించి వాటిలో రసవద్ఘట్టాలను ఎంచుకొని వాటితో ముఖపత్రాలను అలంకరించారనిపిస్తుంది. ప్రాచీన సాహిత్యం కాబట్టి చక్కటి లతలు, పూలతో బోర్డర్లు వేశారు. తంజావూరు కవులు రాసిన శృంగార ప్రబంధాలకు సబ్జెక్టును బట్టి బాపు ముఖపత్ర రచన కూడా అదే ధోరణిలో చేశారు.

ఆయా ప్రబంధాల సబ్జక్ట్ గుర్తుచేసుకుంటే కవరు పేజిల విశిష్టత మరింత బాగా తెలుస్తుందన్న నమ్మకంతో స్వల్ప పరిచయం.....



'ఆముక్తమాల్యద'లో కథానాయిక గోదాదేవి. దేవుడికై పూలమాలలను కట్టి తాను ధరించిన తర్వాతనే దేవుడికి అర్పిస్తుంది. (అముక్తమాల్యద అంటే 'విడిచిన మాలలను ఇచ్చేది' అని అర్థం) అందుకే గోదాదేవి మాలలతో సహా దర్శనమిస్తోంది.

'పారిజాతాపహరణము'- పోరుసలిపి దేవలోకం నుండి పారిజాత వృక్షాన్ని తీసుకురావడానికి కారణభూతమైన సత్యభామ అలుకను హైలైట్ చేయడం జరిగింది.





'శృంగారశాకుంతలం' దుష్యంతుడు, శకుంతల మొదటిసారి కలుసుకునే దృశ్యం. ఈ కావ్యంలోని నాయికా నాయకుల ప్రథమ సమాగమ దృశ్యం అనేక కావ్యాలలో ఇటువంటి ఘట్టాలకు ఒరవడి అయిందంటారు.

రాధిక ఇళ అనే కన్యను పెంచి కృష్ణుడికిచ్చి పెళ్ళి చేయడం, కృష్ణుడు ఆమెపై ఎక్కువ మక్కువ కనబరచడంతో అలగడం, దక్షిణ నాయకుడైన కృష్ణుడు ఆమె అలకతీర్చి రంజిల్లింపచేయడం కథా వస్తువు.





'విజయ విలాసం' - విజయుడంటే అర్జునుడు. అతడు మునిలా మారువేషంలో వచ్చి సుభద్రను వలచి, వలపింప చేసుకున్న ఘట్టం.



ప్రభావతీ ప్రద్యుమ్నం- ప్రభావతి ప్రద్యుమ్నుల ప్రేమకావ్యం.



'హర విలాసం' శివలీలలగాథ. తన కోసం ఘోరతపస్సు చేస్తున్న పార్వతిని మారు వేషంలో వచ్చిన శివుడు పరీక్షించే దృశ్యం.

బిల్హణీయం - అందమైన రాకుమారికి పాఠాలు చెప్పడానికి వచ్చిన పండితుడు సుందరాంగుడు కావడంతో భయపడి, ఏవో అబద్ధాలు చెప్పి మధ్యనొక తెర ఏర్పాటు చేస్తాడు రాజు. కానీ విధివిలాసం వల్ల ఒకరినొకరు చూసుకోవడం, మోహంలో పడడం జరుగుతుంది. కథకు మూలబిందువైన తెరను తెరపైకి తెచ్చారు బాపు.





కళాపూర్ణోదయం - నిజానికి చాలా కాంప్లికేటెడ్ కథ. ఎన్నో పాత్రలు. అయినా కవరుపై ఉయ్యాలలూగే సుందరిని ఎంచుకోవడానికి కారణం - ఆ ప్రబంధంలోని బాపుగారిని ఆకట్టుకున్న ఓ చక్కని పద్యం! ఉయ్యాల ఊగుతూ ఆకాశం అంచులను తాకుతూ స్వర్గలోక సుందరులపై కయ్యానికి కాలు సాచగల సోయగం గల కథానాయిక కలభాషిణిని వర్ణించే పద్యానికి 'గీత' కల్పన చేశారు బాపు.



'అహల్యా సంక్రందనం' - అహల్య అనగానే రాయిబొమ్మకై వెతుకుతాం. కానీ ఇక్కడ శపించబడడానికి ముందున్న శృంగారమూర్తి అహల్య కథ. శాపానికి కారణమైన ఘట్టాన్ని - ఇంద్రుడితో (సంక్రందుడు అంటే ఇంద్రుడు) ఆమె ప్రణయాన్ని- చిత్రకారుడు చూపుతున్నాడు.



శశాంక విజయం- శశాంకుడంటే చంద్రుడు. అతడు గురుపత్ని అయిన తారతో ప్రణయం సాగించి తనతో తీసుకుపోవడం, దేవతలు దండెత్తి వస్తే వారిని ఓడించడం కావ్య వస్తువు.



వైజయంతీ విలాసం- విప్రనారాయణుడనే భాగవతోత్తముడిని ఒక వేశ్యాంగన హావభావాలతో రెచ్చగొట్టి తపోభంగం చేసే గాథ ఇది. రెచ్చగొట్టగల ఒంపుసొంపు లామె కున్నాయని బాపు నిరూపించారు.

అలనాటి ఆణిముత్యాల గురించి
నేటి తరానికి అనువైన శైలిలో తెలిపే

# నవ్వుటద్దాలు

క్లాసిక్స్ రీటోల్డ్

- ఆచార్య తిరుమల

## దేవతల దరిద్రం




మనం అజ్ఞానం వల్ల చాలాచాలా అనుకుంటూ వుంటాం. అనుకున్నవన్నీ నెరవేరాలని ఆరాటపడుతూ వుంటాం. అందుకు దేవుళ్లకు మొక్కుతూ వుంటాం. ఆయా దేవతల కరుణకు పడిగాపులు పడి యెదురు చూస్తూ వుంటాం. మన కోర్కెలు తీర్చకపోతే ఆ దేవుణ్ని వొదిలేసి, తీరుస్తాడనే మరో దేవుడి దగ్గరకో, బొమ్మల దగ్గరకో మకాం మార్చేస్తాం. ఏది యెలా వున్నా, మన కోరికలు తీరాలి, కాదు దేవుళ్లు తీర్చాలి. అసలు, కోర్కెలు మనం కోరుకోవటమేమిటి? ఆ దేవుళ్లెవరో - వాళ్లు తీర్చటమేమిటి? వాళ్లకేం పని? వాళ్లకసలు మనతో సంబంధమేమిటి? మన కోర్కెలు తీర్చటమే వాళ్ల పనా? తీర్చకపోతే వాళ్లకేం నష్టం? - అసలు అలాంటి ఆలోచనలేవీ మనకు రావు.

దరిద్రం వల్ల కష్టాలు, కష్టాల వల్ల కన్నీళ్లు వస్తాయని అందరికీ తెలుసు. అయితే, కష్టాలు కన్నీళ్లు, దరిద్రం అనేవి మానవులకే కాదు, దేవతలకి

కూడా వుంటాయని చాలామంది గుర్తించరు. మన పురాణ పురుషుల్లో చాలా మంది అష్టకష్టాలూ అనుభవించినవారే. భృగుమహర్షి కోపంతో తనను తన్నటం వల్లనే కదా భార్యావియోగం ప్రాప్తించి శ్రీమన్నారాయణుడు తిరుమలపై వేంకటేశుడుగా వెలిసింది? శని పట్టటం వల్లనేగా శివుడు చెట్టు తొర్రలో దాక్కున్నది? భృగు శాపం వల్లనేగా బ్రహ్మకొక ఇల్లంటూ లేకుండా పోయింది? ఇంద్రుడెన్నిసార్లు రాక్షసుల చేతుల్లో చావుదెబ్బలు తిని స్వర్గసుఖాలు విడిచిపెట్టి పారిపోలేదు? దేవతాంశలుగా పుట్టిన పాండవులు గానీ, కేవలం ధర్మావతారుడైన శ్రీరాముడు గానీ, నలచక్రవర్తి గానీ, సత్యహరిశ్చంద్రుడు వంటి మహాపురుషులు గానీ ఎన్నెన్ని కష్టాలు అనుభవించలేదు? శ్రీరాముడైతే మరీను. కనీసం పాదరక్షలు కూడా లేవు. ఉన్న వాటిని చాలా భక్తిగా తమ్ముడు భరతుడు వచ్చి పట్టుకుపోయాడు. సరిగ్గా ఇదే మన మనస్తత్వం కూడా. అందుకే మనం భారత సంతతిగా భారతీయులమయ్యాం. అష్టకష్టాల్లో భార్యా వియోగం ఒకటి. అదెంత దుర్భరమో అనుభవించిన ఏ శ్రీరాముని వంటి వారికో గానీ తెలియదు. ఈ శ్లోకం చూడండి.

**సౌమిత్రే! నను సేవ్యతాం తరుతలం చండాంశు రుజ్జృంభతే**
**చండాంశో ర్నిశికా కథా? రఘుపతే! చంద్రోదయ మున్మీలతి**
**వత్సై తద్విదితం కథయ భవతా! ధత్తే కురంగం యతః**
**క్వాపిప్రేయసి! హా కురంగ నయనే! చంద్రాననే! జానకీ!!**

సీతా వియోగంతో రాముడికి రాత్రేదో, పగలేదో కూడా తెలియటం లేదు. చెట్లచాటుగా చంద్రోదయమైతే సూర్యోదయమై ఎండ తీవ్రత తనను బాధిస్తోందని లక్ష్మణునితో అంటే లక్ష్మణుడు 'రామా! రాత్రి సూర్యుడేమిటి? అది చంద్రోదయ'మన్నాడు. అలాగని నువ్వెలా చెప్పగలవని రాముడనగానే లక్ష్మణుడు చంద్రునిలో మచ్చని చూపిస్తూ ఆ కురంగాన్ని (లేడి) చూడమన్నాడు. రాముడా కురంగాన్ని చూసి "ఓ కురంగనయనా! చంద్రాననా! ప్రేయసీ! సీతా!" అంటూ (సీత గుర్తుకు వచ్చి) ఘొల్లుమన్నాడు. కష్టదశకి యింతకంటె పరాకాష్ఠ సన్నివేశం మరొకటుంటుందా?

దేవతల కన్నీటిని గూర్చి చెప్పాలంటే - **"కాటుక కంటి నీరు చనుకట్టు పయింబడ నేల యేడ్చెదో, కైటభదైత్యమర్దనుని గాదిలి కోడల!"** అంటూ బమ్మెర పోతన దర్శించింది ఏడుస్తున్న సరస్వతీ దేవినే కదా! అంతెందుకు, రుద్రుని కన్నీళ్లే గదా రుద్రాక్షలు! ఇక, దరిద్రాన్ని గూర్చి ప్రస్తావించవలసి వస్తే - అది నిజానికి దేవతలదే. శనీశ్వర, జ్యేష్ఠాదేవి వంటి వారు దరిద్రానికి అధిష్ఠాన దేవతలు. వారి పట్టు వల్లే కదా మానవుల్లో ఇంత దరిద్రం! ఇంతకీ దరిద్రమంటే ఏమిటో తెలుసా? వస్తు సంపద లేకపోవటం కాదు **"దరిద్రాతి దుర్గతిం ప్రాప్నోతీతి దరిద్రః, దరిద్రా దుర్గతౌ"** దుర్గతిని పొందటం దరిద్రం. అది పొందినవాడు దరిద్రుడు. ఆ లెక్కలో దేవతలు మనకోసం దరిద్రులవుతున్నారని భావించాలి. ఈ బలహీనత ఆధారంగా రెచ్చిపోయి కవులు అంతంత దేవతల్నెంతెంత మాటలతో ఆటలు పట్టించారో ఈ పద్యాలూ, శ్లోకాలూ చూస్తే తెలుస్తుంది. పైకి తిడుతున్నట్టు లోపల పొగడటం, పైకి పొగడుతున్నట్టు లోపల్లోపల తిట్టటం - ఒకటేమిటి? అనేక చమత్కారాలు పైగా సవాళ్లు విసరటం! మహాకవి శ్రీనాథుడు శివుణ్ని **"తిరిపెమున కిద్దరాండ్రా?"** - ముష్టివాడికి యిద్దరు పెళ్లాలు కావల్సి వచ్చారా? అంటూ కసిరి నీళ్లు పుట్టించటం,

**గరళము మ్రింగితి నంచుం**
**బురహర! గర్వింపబోకు పో పో పో! నీ**
**బిరుదింక గాన నయ్యెడి**
**మెరిసెడు రేనాటి జొన్న మెతుకులు తినుమా!**

అంటూ, విషం కంటె చేదైన రేనాటి జొన్న మెతుకులు తినమనటం సవాళ్లు గాక మరేమిటి? అలాగే - మరో సందర్భంలో-

**పుల్ల సరోజ నేత్ర! యల పూతన రక్కసి చేదు ద్రావి నా**
**డల్ల దవాగ్ని మ్రింగితి నటించను నిక్కెద వేల? తింత్రిణీ**
**పల్లవ యుక్తమౌనుడుకు బచ్చలి శాకము జొన్న కూటితో**
**మెల్లన యొక్క ముద్ద దిగమ్రింగుము నీ పస కాననయ్యెడిన్!!**

అంటూ, పూనత చనుబాల విషాణ్ని మింగానని నిక్కటం కాదు, దమ్ముంటే చింతచివురు, బచ్చలాకుతో చేసిన ఈ కూర కలుపుకుని ఓ జొన్న ముద్ద మింగు! నీ పస బైట పడుతుందని విష సర్ప మర్దనుడైన కృష్ణుణ్ని కూడా సవాలు చేశాడు గదా!

మదన గోపాల శతకంలో కవి, అ హరి నెలా బెదిరిస్తున్నాడో మచ్చుకీ రెండు పద్యాల్లో చూడండి:-

**హరి! నీ వనాకారి వాలి పరాచారి**
**కూతురు వ్యభిచారి కొడుకు జారి**
**అమ్మ నిర్దయకారి అబ్బ సంకిలికారి**
**అత్త పరాధారి అక్క మారి**
**మరద లశుభచారి మనుమడు జడదారి**
**మరిది క్షీణాకారి మామ క్షారి**
**వదినె నిర్దయకారి వాజి పక్ష్యాకారి**
**భటుడు మర్కట రూపి పడక కహరి**
**చూడు నీ మర్మమెల్ల నే నాడు వాడ**
**నేడు నన్నేలి సిగ్గు కాపాడు కొనుము**
**సరస దరహాస! ద్వారకాపుర నివాస!**
**మదన గోపాల! రాధికా హృదయలోల!!**

ఈ పద్యంలో పై నుండి ఒక్కొక్క పాదానికి అన్వయించుకుంటూ శ్రీహరి కుటుంబ సభ్యులైన లక్ష్మి (ఆలి), గంగ(కూతురు), మన్మథుడు, కైకేయి, వసుదేవుడు, భూదేవి, మాయ, ఊర్మిళ, నారదుడు, చంద్రుడు, సముద్రుడు, జ్యేష్ఠాదేవి, గరుత్మంతుడు, ఆంజనేయుడు, శేషువుల్ని కవి ఎంత దరిద్రంగా, భ్రష్టుగా చెప్పుకుంటూ వచ్చి ఆకారంలేని హరి దరిద్రాన్నెంత మార్మికంగా గుర్తించి యిబ్బంది పెట్టాడో గుర్తించండి.

**తొమ్మండ్రు మొగుల నెత్తుకపోయె కోడలు**
**చెల్లెలు సన్యాసి జేసుకొనియె**
**అత్త భూవరుల నెయ్యము మీరజెందెను**
**కూతురు పదకొండ్ర గూడుకొనియె**
**మరదలొక్కతె మూరు మనువు గట్టుకుపోయె**
**నిల్లాలు పొరుగిండ్ల కేగుదెంచె**



వదినెగారును పల్కువావితో వర్తించె
మేనత్త భానుని మీద వలచె
వావు లిట్టట్లు జేసిన వన్నెకాడ!
తగవు రావయ్య! నీ జాణతనము మాని
సరస దరహాస! ద్వారకాపుర నివాస!
మదన గోపాల! రాధికా హృదయలోల!!

ఇందులో సరస్వతి, సుభద్ర, భూదేవి, గంగ, లక్ష్మి, జ్యేష్ఠ, కుంతి మొదలైన వారి వావి వరుసలెంత దరిద్రంగా చిత్రితమయ్యాయో గమనించండి.

దేవతలకి కూడా కుటుంబ కలహ బాధ ఉంది. శివుడు విషాన్నెందుకు త్రాగాడో ఓ కవి యిలా చెప్తున్నాడు:-

అత్తుం వాంఛతి వాహనం గణపతే రాఖుం క్షుధార్తః ఫణీ
తంచ క్రౌంచపతేః శిఖీ చ గిరిజాసింహోపి నాగాననం
గౌరీ జహ్నుసుతా మసూయతి కలానాథం చ ఫాలానలః
నిర్విణ్ణ స్స పపౌ కుటుంబ కలహా దీశో పి హాలాహలమ్!!

వినాయకుని వాహనమైన ఎలుకని పాము, ఆ పాముని కుమారస్వామి వాహనమైన నెమలి చంపి తినాలనుకుంటున్నాయి. పార్వతి వాహనమైన సింహం గణపతి ఏనుగు ముఖాన్ని చంపచూస్తూ వుంది. పార్వతి గంగ మీద, నొసటి కంటి మంట తలమీది చంద్రుని మీద అసూయతో మండి పడుతున్నాయి. ఒకే కుటుంబంలోని యీ పరస్పర వైరాన్ని చూసి బాధతో శివుడు విషాన్ని త్రాగేశాడట!

పూరీక్షేత్రంలో శ్రీ మహావిష్ణువైన జగన్నాథునిది దారు (కొయ్య, చెక్క) విగ్రహం. తన యింటి పరిస్థితులు తల్చుకుని, తల్చుకుని జగన్నాథుడైన మురారి అలా కొయ్యబారి పోయాడని యీ శ్లోకం తెలుపుతూ వుంది. చూడండి.

ఏకాభార్యా ప్రకృతి ముఖరా చంచలా చ ద్వితీయా
పుత్ర స్త్వేకో భువన విజయీ మన్మథో దుర్నివారః
శేషశ్శయ్యా శయనముదధౌ వాహనం పన్నగారిః
స్మారం స్మారం స్వగృహ చరితం దారుభూతో మురారిః!!

తన యిద్దరు భార్యల్లో పెద్దామె జ్యేష్ఠ వాచాల, చిన్నామె లక్ష్మి నిలకడ లేని చంచల. భువనాల్ని జయించే కొడుకు మన్మథుడెదురులేని వాడు మాట వినడు. తన పక్క పాము కాగా పడకటిల్లు సముద్రం, వాహనం పక్షి. ఇల్లు ఇలా వుంటే యెంత చిరాగ్గా వుంటుంది? నారాయణుడిది తలచుకొని, తలచుకొని యేమీ చేయలేక కొయ్యబారి పోయాడట! "దారుభూతో మురారిః" అని నిద్రిస్తున్న తనను తన మేనమామ తిడితే చిరాగ్గా లేచి సంస్కృత కవి మురారి ఈ శ్లోకం చెప్పి తనను తాను సమర్థించుకున్నాడని చెప్తారు. సరే -

సుమారు పాతికేళ్ళ క్రితం తాను ఎం.ఏ. చదువుతుండగా సేకరించిన కొన్ని చమత్కార పద్యాలు, శ్లోకాలూ నా సోదరి చి॥విమల తెచ్చి నాకు చూపించింది. వాటిలో ప్రస్తుతానికి పనికి వచ్చే రెండు శ్లోకాలు మీ ముందుంచుతున్నాను. చూడండి:

హలమట బలస్య, ఏకోనడ్వాన్ హరస్య న లాంగలం
క్రమ పరిమితాభూమి ర్విష్ణోః నగౌర్నచ లాంగలం
ప్లవహతి కృషిః నాద్యాప్యేషాం ద్వితీయం గవం వినా
జగతి సకలే నే దృగ్ దృష్టం దరిద్ర కుటుంబకమ్!!

బలరాముడికి నాగలి వుంది. శివుడికి ఎద్దు వుంది గానీ నాగలి లేదు. విష్ణువుకి పరిమితమైన మూడడుగుల భూమి వుంది గానీ ఎద్దూ గానీ నాగలి గానీ లేవు. రెండో ఎద్దు లేకుండా వ్యవసాయమెలా సాగుతుంది? ఈ జగత్తులో ఇంత దరిద్ర కుటుంబమెక్కడా కనిపించదని భావం.

ఈ దరిద్రానికొక విరుగుడు సూచిస్తూ ఆశీః పూర్వకంగా సాగిన యీ శ్లోకాన్ని చూడండి:

రామాద్యాచయ మేదినీం ధనపతేర్బీజం బలాల్లాంగలం
ప్రేతేశాన్మహిషం తవాస్తి వృషభం హలం త్రిశూలం కురు
శక్తా హం తవచాన్నదాన కరణే గోరక్షణే షణ్ముఖః
ఖిన్నాహం హర! భిక్షయా కురుకృషింగౌరీ వచః పాతువః!!

ఓయి హరా! నువ్వు ముష్టెత్తుకోవటం నాకు బాధగా వుంది. రాజుల్ని జయించిన పరశురాముని భూమి, కుబేరుని విత్తనాలు, బలరాముణ్ని నాగలి, నీ దగ్గర ఎద్దు వుంది కాబట్టి యముణ్ని దున్నపోతు అడిగి, నీ త్రిశూలాన్ని కాజగా చేసి వ్యవసాయం చేసి పండించి, నువ్వే నీ శక్తి కొలది అన్న దానం చెయ్యి - అనే పార్వతీదేవి వచనం మిమ్మల్ని కాపాడుగాక! అని శ్లోక తాత్పర్యం.

దేవతలకన్నీ బాధలూ, గొడవలే. వాళ్లని నల్లులు కూడా కుట్టేస్తూ వుంటాయి. ఆ బాధ పడలేకే - శివుడద్రిని నివసించుట. రవిచంద్రులు మింటనుంట, రాజీవాక్షుం డవిరళముగ శేషునిపై పవళించుట! అని ఓ చాటు పద్యం చెప్పింది. దేవతల్లో చాలా మంది పద్మాల వంటి పువ్వుల మీద వుండటం కూడా నల్లిబాధ పడలేకనే అన్నారు. వాళ్లకి వుండే వస్త్రాలు కూడా రెండే రెండు. శుక్లాంబరమో, పీతాంబరమో! రెండూ లేకపోతే దిగంబరమే! ఇదంతా చాకివాని తోడ జగడాలు పడలేక అని సమర్థించారు గానీ అంతకుమించి వాళ్లకు బట్టలున్నట్లు ఏ దాఖలాలు లేవు. ఇంక, ఏ కుబేరుడు లాంటి ధనవంతునికో విమానాలుంటే వున్నాయేమో గానీ రమారమి దేవతలందరి వాహనాలూ పక్షులు, జంతువులే గదా! ఇదే చాలు వాళ్ల దరిద్రాన్ని సూచించటానికి. ఇదంతా మన చర్మచక్షువులతో ఏవేవో చిత్రాలు చూసి అర్థం చేసుకుంటే కనిపించే మాయా దృశ్య చమత్కారం మాత్రమే.

మన దేవతల అసలు స్వరూప స్వభావాలు గానీ, వాళ్ళ నివాసాలు గానీ, ఆయుధ వాహనాది సంపత్తులు గానీ, సంబంధ బాంధవ్యాలు గానీ అంత తేలిగ్గా అర్థమయ్యేటంత విషయాలు కావు. వేదశాస్త్రోపనిషత్పురాణాలు నిదానాది విద్యలు జటిల సాంకేతిక పదజాలంతో చెప్తున్నా తెలియబడని నిగూఢ రహస్యాలవి. అదొక జ్ఞానోపాసన. ఆ ఉపాసనా బలంతోనే ఏ భావ దరిద్రానికైనా విముక్తి. అటువంటి జ్ఞానాన్ని వర్ధించే వరకు ఇటువంటి వ్యాసాలు విస్తళ్లు మాత్రమే అని గ్రహించటం మంచిది! ■



# పత్రికా చరిత్రలో ఓ అరుదైన సంఘటన

## ఒక పత్రిక మరొక పత్రికను మెచ్చుకోవడమా!?

'బైయింగ్ బుక్స్!? బార్బేరియస్" అని ముళ్ళపూడి వారి గిరీశం లెక్చరిచ్చినట్లు ఇది పుస్తకాలు కొనడం కన్నా అన్యాయం; కన్యాశుల్కానికి కన్నకూతుర్ని అమ్ముకొనడం కన్నా అమానుషం' అని వాపోయేరోజుల్లో 'ఇది పత్రికా సంప్రదాయానికే విరుద్ధం' అని గుండెలు బాదుకునే వాతావరణంలో- ఒక పత్రికను మరొక పత్రికను మెచ్చుకోవడమా!?

**ఔను... నిజమే.... ఆంధ్రజ్యోతి దినపత్రిక ఆ సాహసానికి పూనుకుంది. కొత్త ఒరవడికి శ్రీకారం చుట్టింది. సత్సంప్రదాయానికి పట్టం కట్టింది. ఆ సత్కారానికి పాత్రత సంపాదించుకున్నందుకు 'హాసం' గర్విస్తున్నది.**

**ఆంధ్రజ్యోతి దినపత్రిక హైదరాబాద్ ఎడిషన్ ప్రతీరోజూ సిటీలైఫ్ (ఆదాబ్ హైదరాబాద్) అనే 4 పేజీల అనుబంధాన్ని వెలువరిస్తోంది.**

సాహిత్యానికి, కళలకు పెద్దపీట వేసే ఆంధ్రజ్యోతి ఈ సిటిలైఫ్‌ను ఆధునిక జీవనసరళికి అనుగుణంగా మలిచారు. సక్సెస్‌స్టోరీ అనే పేర వాణిజ్య రంగంలో విజయాలు సాధించిన ప్రాజెక్టుల గురించి, సంస్థల గురించి పరిచయం చేయడం జరుగుతూంటుంది.

సోమవారం 19 మే, 2003 నాటి ఆంధ్రజ్యోతి సిటిలైఫ్ 'సక్సెస్‌స్టోరీ' కాలమ్ క్రింద 'హాసం' విజయగాథ చోటు చేసుకుంది. శాంతా బయోటెక్నిక్స్ అధినేత వరప్రసాద్, తన చిన్ననాటి స్నేహితుడు బ్యాంక్ ఆఫీసర్ ఎమ్బియస్ ప్రసాద్‌తో కలిసి సీనియర్ జర్నలిస్టు, మ్యూజికాలజిస్టు రాజాను ఆహ్వానించి 'హాసం' ప్రాజెక్టును ఆరంభించిన దగ్గర్నుంచి, లాభాపేక్ష లేకుండా ప్రారంభించి లాభాలబాట పట్టిన ప్రస్థానం దాకా 'హాసం' కథను సూక్ష్మంగా అక్షరబద్ధం చేశారు 'ఆన్‌లైన్ ప్రత్యేక ప్రతినిధి'.

'హాసా'నికి సారథ్యం వహిస్తున్న ముగ్గురి నేపథ్యంతోబాటు, వారి అభిరుచులు, ఆదర్శాలు, వర్క్‌స్టయిల్ కూడా ముచ్చటిస్తూ వారి శ్రమను, శ్రద్ధను గుర్తించి అభినందించింది ఆంధ్రజ్యోతి. 'క్రమశిక్షణ, విషయజ్ఞానం ఉంటే పత్రికలు పదికాలాలు బతుకుతాయని రుజువు చేస్తున్నది' అంటూ ఆశీర్వదించింది.

'హాసం' ప్రచురణ మొదలుపెట్టిన దగ్గరనుండి పాఠకుల నుండి మంచి స్పందన వస్తున్నా అది పత్రిక వైవిధ్యం వల్ల వస్తున్నదని సర్దిచెప్పుకోవచ్చు. కాని పత్రికారంగంలో తలపండిన - ఎన్నో కొత్త శీర్షికలు ప్రవేశపెట్టి తెలుగు పత్రికా రంగాన్నే మలుపుతిప్పిన - 'ఆంధ్రజ్యోతి' నుండి ప్రశంస లభించడం వేరే విషయం. అరమరికలు లేకుండా, సంకోచాలుపెట్టుకో కుండా సుహృద్భావంతో వ్యవహరించి సత్సంప్రదాయాన్ని నెలకొల్పిన 'ఆంధ్రజ్యోతి' సంపాదక వర్గానికి, యాజమాన్యానికి 'హాసం' కృతజ్ఞతలు తెలుపుకుంటున్నది.

ఆంధ్రజ్యోతి దినపత్రిక మే 19, 2003 హైదరాబాద్ ఎడిషన్ సిటీలైఫ్‌లో 'హాసం'పై ప్రచురితమైన రిపోర్టును 'హాసం' అభిమాన పాఠకుల కోసం దిగువన పొందుపరుస్తున్నాం.

## హాస్యం, సంగీతం: దివ్యౌషధం

సక్సెస్ స్టోరీ

ఆన్‌లైన్ ప్రత్యేక ప్రతినిధి

ఆయన ఓ మందుల తయారీ సంస్థకు యజమాని. శాన్‌వాక్ పేరిట హెపటైటిస్ బి వ్యాక్సిన్‌ను దేశవ్యాప్తంగా అందుబాటులోకి తెచ్చిన ఘనత ఆయనది. కేన్సర్ నివారణలో శాన్‌ఫెరాన్‌తో ఆశారేఖలు ఆవిష్కరించిందీ ఆయనే. శాంతాబయోటెక్నిక్స్ నుంచి ఔషధాలు చాలా వచ్చాయి. కానీ వర ప్రసాద్ మాత్రం అన్నిటికన్నా దివ్యౌషధాన్ని ఓటిసి ప్రోడక్టుగా అందిస్తున్నారు. దాని పేరు హాస్యం సంగీతం. నవ్వొక దివ్యౌషధమని, సంగీతం సర్వరోగనివారిణి అని నమ్మే యమ్బీయస్ ప్రసాద్ అనే చిన్ననాటి స్నేహితుడితో కలిసి పాటల పందిళ్లు వేసిన నవ్వుల లతలు అల్లించే రాజాని పిలిచి హాసం అనే పక్షపత్రికను ప్రారంభించారు. వారికి ఆ తర్వాత ఎప్పుడో తెలిసిందట. ఈ తరహాలో కేవలం హాస్యం, సంగీతం మాత్రమే విషయాలుగా భారతదేశంలో వెలువడే ఏకైక పత్రిక తమదేనని. తెలుగుటీవీ ప్రజల సమయాన్నీ, హృదయాన్నీ దండగ చేస్తున్న రోజుల్లో, పత్రికలన్నీ కట్టలు కట్టుకుని గోడౌన్‌లకు తరలి వెళ్లిపోతున్న తరుణంలో ఒక పత్రిక- అదీ వ్యాపార మసాలాలు లేకుండా కేవలం అభిరుచుల మీదే నమ్మకం పెట్టుకుని అందరు పాఠకులకోసం కాక కొందరు ప్రత్యేకాసక్తులు ఉన్నవారిని ఉద్దేశించి వెలువరచడం సాటి వ్యాపారవేత్తలకు వెర్రితనమనిపించింది. కానీ పాఠకులు హాసాన్ని అక్కున చేర్చుకున్న తీరు పెక్కుమందిని ఆశ్చర్యపరచింది. 'మేం దీన్ని లాభాలకోసం ప్రారంభించలేదు. కేవలం మా అభిరుచులను సంతృప్తి పరచడం కోసం, తెలుగులో ఈ అంశాలలో ఉన్న లోటును పూడ్చడం కోసం ఆర్భాటాలు లేకుండా ప్రారంభించాం' అంటారు హాసం పబ్లిషర్, శాంతా బయోటెక్ అధినేత వరప్రసాద్. ఆయనే కొద్ది రోజుల క్రితమే తమ సంస్థ రూపొందించిన శాన్‌ఫెరాన్‌కు గానూ వరుసగా రెండవసారి ఎక్సలెన్స్ అవార్డు అందుకున్నారు. శుక్రవారం నాడే నగరంలో జరిగిన ఒక కార్యక్రమంలో ప్రజ్ఞాభారతి అవార్డు కూడా అందుకున్నారు. 'నాలో సహజంగా ఉన్న సంగీతాభిమానమూ, హాస్యప్రియత్వమూ ఈ పత్రికను ప్రారంభించేందుకు పురికొల్పాయ'ంటూ నేపథ్యాన్ని పరిచయం చేస్తారాయన. ఆయన చదువుకున్నది ఇంజనీరింగ్, ఆపై డిఫెన్స్‌లో కొంతకాలం రీసెర్చ్ అండ్ డెవలప్‌మెంట్ విభాగంలో ఉద్యోగబాధ్యతలు. అనంతరం కొంతకాలం పాటూ బ్యాటరీల ఉత్పాదన. చివరకు రాష్ట్రంలోని అగ్రశ్రేణి వాణిజ్యవేత్తలలో ఒకరిగా. అదీ ఆయన ప్రయాణం. ఇక



హాసం సారథులు రాజ(ఎడిటర్), వరప్రసాద్(పబ్లిషర్), ఎంబిఎస్ ప్రసాద్(మేనేజింగ్ ఎడిటర్)

మేనేజింగ్ ఎడిటర్ యమ్బీయస్ ప్రసాద్. తెల్లారిలేస్తే డెబిట్లూ, క్రెడిట్ల జీవితం. చేసేది బ్యాంకు ఉద్యోగమైనా ఖాళీ దొరికితే కలం ఝుళిపించి వ్యాసాలూ కథలూ రాయడం ఆయన ఇష్టవ్యాపకం. ఇప్పుడు ఆ వ్యాపకమే వృత్తిగా మారి హాసం చిందిస్తోంది. ముళ్లపూడి సాహితీ సర్వస్వం పుస్తకాలకు సంపాదకత్వం వహించిన గౌరవం దక్కించుకున్న మనిషి యమ్బీయస్. తెలుగులోనూ ఇంగ్లీషులో ఏక కాలంలో ఫ్రీలాన్స్ జర్నలిస్టుగా పనిచేసిన అనుభవాన్ని ఆయన ఈ పత్రికలో తన పెట్టుబడిగా పెట్టారు.

హాసం సంపాదకుడు రాజాను వారపక్షమాస పత్రికల పాఠకులకు పరిచయం చేయాల్సిన పనేలేదు. ఓ ప్రముఖ వారపత్రికలో సకలాంశాలతో ఆయన నడిపిన సెంటర్‌స్ప్రెడ్, ఆపాతమధురం వ్యాసాల ధారావాహికం తెలుగుపాటలతోనూ, పాటల, సంగీత సాహిత్యాలతోనూ ఆయనకున్న సన్నిహిత పరిచయాన్ని ప్రతిఫలిస్తుంది.ఈ ముగ్గురి కలయికలో విరిసిన హాసం సమకాలీన చిన్నపత్రికల చరిత్రలో రెపరెపలాడిన ఓ విజయకేతనం. 'మాకెవరూ అసిస్టెంట్లు లేరు మేమిద్దరమే. అన్నీ రాసుకుంటాం. రాయించుకుంటాం. చూసుకుంటాం' అని చెప్పారు రాజా. 'పాపులర్ టేస్టునీ, అభిరుచి కలిపేందుకు మేమిద్దరం కలిశాం' అని జోడించారు యమ్బీయస్ ప్రసాద్. పిజి ఉడ్‌హౌస్ రచనల్ని తెలుగు చేసిన ప్రసాద్ వద్ద సాహిత్యరంగంలోనూ, ఇతర విశేషాలలోనూ మంచి సేకరణ ఉంది. ఇక పాటల విషయానికి వస్తే రాజా వద్ద ఏ పాటైనా దొరుకుతుంది. ఆంధ్రదేశంలో అరచేతి వేళ్లపై లెక్కించగలిగినంతమంది మాత్రమే అత్యంత పాతపాటలను సేకరించిన వారు ఉన్నారు. వారందరితోనూ రాజాకు నిత్య సంబంధం ఉంది. 'ఈ పత్రిక పెట్టేటపుడు, దీని విషయప్రాధాన్యాన్ని చూసి చాలామంది, ఇంత కంటెంట్ ఎక్కడ తెస్తారు, ఎన్నాళ్లు నడుపుతారు అని ఆశ్చర్యపోయారు' కానీ మా వద్ద ఎళ్ల తరబడి ప్రచురించినా తరగనంత మెటీరియల్ ఉంది' అని సగర్వంగా చెబుతారు రాజా. 'తెలుగులో ఒకప్పుడు విస్తృతంగా రాసిన కాలమిస్టులు ఇప్పటి పత్రికల ధోరణి చూసి కలం పక్కన పెట్టి చాలాకాలం అయింది. కానీ అటువంటి వారంతా మా పత్రికను చూసి ముగ్ధులై మాకు రాస్తున్నారు. బాపు గారు ఇటీవల ఆంధ్రజ్యోతి ఇరవైవారాల విశేష సంచికకు రాసిన తరువాత మా పత్రికకే ప్రత్యేకంగా రాశార'ని వెల్లడించారు రాజా. వివిఎకె రంగారావు వంటి వారి కృషికి ఇది కొనసాగింపు. నిజానికి తెలుగు సినిమా పాటలలో పత్రికలలో వచ్చే ప్రసిద్ధ కవులకు సాటిరాగల ఇమేజీలూ, పదసంపదా ఉన్నాయి. వారు సంకలనాలు వేసుకుంటారు. అవి సాహిత్యంలో రికార్డు అవుతాయి. కానీ సినీకవుల గీతాలు ఉమ్మడిగా దొరకడం ఈ రోజుల్లో కష్టమైపోతున్నది. ఒకప్పుడు పాటల పుస్తకాలను నిర్మాతలే వెలువరించే సంప్రదాయం ఉండేది. కానీ ఇప్పుడు ఆ బాధ్యతను హాసం తీసుకుంది. ప్రతి సంచికలోనూ రెండు సినిమాల పాటలను పుస్తకరూపంలో అందిస్తోంది. ఒక పాత హిందీపాటను పరిచయం చేస్తున్నది. ఒకపాత సినిమాలోని పాటలన్నిటినీ సంగీత సాహిత్యపరంగా విశ్లేషిస్తున్నది. గాయకుల జీవిత కథలనూ, ఆత్మకథలనూ ధారావాహికంగా ప్రచురిస్తున్నది. లతా, కిషోర్‌వంటి హిందీగాయకుల జీవితాలలోని ఘట్టాలను కూడా



తెలుగుపాఠకులకు అందుబాటులోకి తెచ్చింది. వివిధ రాగాలను పాటల ఉదాహరణతో సహా పరిచయం చేస్తున్నది. నిజానికి తెలుగులో నలభైల వయసులో ఉన్నవారికి ప్రత్యేకించి మేగజైన్లు లేవు. ఇది ఆ కొరత తీరుస్తున్నది. పెద్దవారు చదువుకోడానికి వీలుగా ఫాంట్‌సైజు నుంచి, విషయం తిరిగి క్లుప్తంగా రాయడం వరకూ అణువణువూ శ్రద్ధ తీసుకుంటున్నారు. మనం చిన్నతనంలో చదివిన వెండితెర నవలలు ఇప్పుడు హాసంలో ప్రతి సన్నివేశానికీ చెందిన స్టిల్‌తో సహా ప్రచురితమవుతున్నది. 'సామాన్యుడికి అందుబాటులో లేని కళ సంకుచితమైపోతుంది' అన్న ఆత్రేయ మాటల స్ఫూర్తితో తాము సినిమా, హాస్యం కళలను సామాన్యుల దరికి చేర్చే పని తలపెట్టామని నిర్వాహకులు చెప్పారు. బాపు రమణలే తమకు స్ఫూర్తిదాతలని చెప్పే హాసం సంపాదకవర్గం అక్షరాలా అశ్లీలతకు తావులేని ధైర్యంగా టీపాయ్ మీద పెట్టగలిగిన పత్రికను అందిస్తున్నారు. ఈ పత్రిక పాతకాపీలకు ఉన్న డిమాండే ఇది పొందిన ఆదరణకు గుర్తు. హాసం సంపాదకుల ద్వారా కొందరి చిరునామా సేకరించి హెచ్ఎంవి వంటి సంస్థలు అలనాటి ఆణిముత్యాలను కేసెట్‌ల ద్వారా అందుబాటులోకి తెచ్చాయని, అనేక కాంబినేషన్లను రూపొందించి తిరిగి పాత పాటలకు డిమాండ్ పెంచడంలో హాసం పాత్ర ముఖ్యమైనదని సంపాదకులు చెప్పారు. పాఠకులే స్వయంగా క్లబ్బులు ఏర్పరుచుకుని సంపాదక వర్గాలను పిలిచి అభిరుచులు పంచుకుంటున్నారు. ఆడియో రంగం సినిమాకు సమాంతరంగా ఒక పరిశ్రమగా అవతరించిన రోజుల్లో పరిశ్రమ వర్గాలు కూడా ఈ పత్రికను మన్నించి అక్కున చేర్చుకున్నాయి. సహాయ సహకారాలు అందిస్తున్నాయి. విమర్శను వినమ్రంగా స్వీకరిస్తున్నాయి. లాభాపేక్ష లేకుండా ప్రారంభమైన ఓ పత్రిక లాభాలబాటలో నడవడం మిగిలినవారికి ధైర్యాన్నిస్తున్నది. క్రమశిక్షణ విషయజ్ఞానం ఉంటే పత్రికలు పదికాలాలు బతుకుతాయని రుజువు చేస్తున్నది.



బస్టాండులో కొత్తగా పరిచయమైన యువతితో ఇంకా చనువు పెంచుకోడానికి
"నీ టెలిఫోన్ నెంబర్ ఇస్తావా! అప్పుడప్పుడు మాట్లాడుకోవచ్చు" అని అడిగాడు ఒకతను.
"డైరెక్టరీలో చూసుకోవచ్చు గదా"
"సరే అయితే... నీ పేరు చెప్పు"
"అది కూడా డైరెక్టరీలోనే ఉంటుంది గదా!" అందామె బస్సెక్కుతూ -



"ఏమండీ. ఇవాళ బజార్లో ఒకడు నన్ను గట్టిగా వాటేనుకోవాలని చూశాడండీ!"
"చెంప పగలకొట్టకపోయావా! వాడి నేరానికి అదే శిక్ష"
"నేరం చెయ్యకుండానే శిక్షించడం తప్పుగదండీ! అందుకుని బాగా వాటేసుకోనిచ్చి ఆ తర్వాత చెంపమీద ఒక్కటిచ్చుకున్నాను"



కోర్టులో ఒక లాయరు ఒక చదువురాని సాక్షిని క్రాసెగ్జామిన్ చేస్తున్నాడు. చదువురాని మనిషి కదా తికమక పెట్టొచ్చనని పెద్ద గొంతుతో అడుగుతున్నాడు. ఆమె చాలా నిమ్మళంగా సమాధానాలు చెపుతోంది.
"నువ్వేమీ చదువుకోలేదంటావు. ఇంత తెలివిగా జవాబులెలా చెపుతున్నావు" అన్నాడు లాయరు.
"మీ తలతిక్క ప్రశ్నలకు జవాబు చెప్పడానికి చదువుకోవాలి గూడానా సారూ!" అందామె అమాయకంగా.

"ఆ పేషంటుకు పల్స్ రేటు చూడు" అన్నాడు డాక్టర్ నర్సుతో
నర్సు పల్స్ రేట్ చూసి డాక్టరుకు చెప్పింది.
ఓ పది బీట్లు తగ్గించి కేస్ షీట్‌లో రాసుకున్నాడు డాక్టరు.
"అదేమిటి సార్. తప్పు నోట్ చేశారు" అడిగింది నర్సు.
"అందమైన కుర్ర నర్స్ చెయ్యి పట్టుకుంటే ఎవరికైనా పల్స్ రేటు పెరుగుతుంది. అదంతా లెక్కలోకి తీసుకుంటామా ఏమిటి" అన్నాడు డాక్టర్.





"నేనొట్టి బుద్ధి తక్కువ వెధవను గాబట్టి నిన్ను చేసుకున్నాను"
"నిజమే. అప్పుడా సంగతి నేనూ గమనించలేదు. ఇప్పుడవన్నీ గుర్తు చేసుకొని ఏంలాభం! నాలాగే మీరు ఖర్మనుకొని ఎడ్జస్టయిపోండి అంతే...!

**ఈ జోక్‌లను పంపినవారు - సి.హెచ్.వి.బృందావనరావు, విజయవాడ.**

ఓ జమిందారు ఇంటికి ఓ వంటవాడు వచ్చాడు. పని కావాలన్నాడు.
"నీకు వినయం, పెద్దల మాట మీద గౌరవం అన్నీ ఉంటేనే పని ఇస్తాను." అన్నాడు జమిందారు.
"అవన్నీ నాకు పుష్కలంగా ఉన్నాయండి"
"సరే అయితే చేరు"
సరేనని చేరాడు ఆ వంటవాడు.
మధ్యాహ్నం అయింది. జమిందారు
"ఏమోయ్! వంట పూర్తయిందా...!
"ఓ... అయ్యిందండి."
"త్వరగా వడ్డించు... బాగా ఆకలిగా వుంది"
"క్షమించాలి. అయిపోయిందండి"
"అదేమిటి? మేము తినకుండానే.."
"అవునండి. తాను తినగా మిగిలినదే ఇతరులకు ఇంత పెట్టమన్నారు పెద్దలు. నేను అలానే చేసాను. మీకు మిగల్లేదు" చెప్పాడు ఆ వంటవాడు వినయంగా.



"డాడీ! మా రిజల్ట్స్ వచ్చాయి"
"గుడ్. పాసయ్యావన్నమాట..."
"అరే! ఎలా తెలుసుకున్నారు?"
"సింపుల్. అది పెద్ద బ్రహ్మవిద్యేం గాదు. తప్పి ఉంటే నువ్వు ఈపాటికి ఇంట్లోనుండి పారిపోయి ఉండేవాడివిగా"





"మా డాడీకు షటిల్ ఆడటమంటే ఇష్టం. మా మమ్మీకు క్యారమ్స్ ఆడటమంటే ఇష్టం"
"మరి... నీకు..."
"వాళ్ళిద్దరూ కలిసి కీచులాడటం..."

**ఈ జోక్‌లను పంపినవారు : బి.వి.ఎస్.బాబు, తెనాలి.**

హ్యూమర్ బాక్స్

ఓసారి బ్రహ్మదేవుడికి, ఒక వ్యాపారికి తగువొచ్చింది.
వ్యాపారి మీద కత్తి విసిరాడు బ్రహ్మ
తిరిగి ఆ కత్తే బ్రహ్మ మీదకు విసిరేశాడు వ్యాపారి
ఈసారి గద విసిరాడు బ్రహ్మ
ఆ గదే తిరిగి విసిరేశాడు వ్యాపారి
యుద్ధం హోరాహోరీగా కొనసాగుతోంది.
నారదుడు ఈ తతంగమంతా గమనించి
"పిచ్చి తండ్రీ.. అతడు వ్యాపారి. కానీ పెట్టుబడి లేకుండా నీ ఆయుధాలు నీమీదే ప్రయోగిస్తున్నాడు ఈసారి ఇది ప్రయోగించు" అంటూ చెవిలో ఆ విషయం చెప్పాడు.
వెంటనే బ్రహ్మ రూపాయి నాణెంతో కొట్టాడు.
వ్యాపారి ఓడిపోయానని చెప్పి ఆ రూపాయిని పెట్టెలో వేసుకున్నాడు.



**ఈ జోక్‌ను పంపినవారు - ఐ.వి.మణి, గుమ్మలక్ష్మీపురం (విజయనగరం జిల్లా)**

బరువు తగ్గడానికి మీ ఆవిడ నానా తంటాలు పడుతున్నట్లుంది... ఏమైనా తగ్గిందా"
"బాగానే తగ్గిందండి నా పర్సు బరువు"



"మీ ఫైనాన్సు కంపెనీ పేరుని బోర్డుకు రెండు వైపులా వ్రాయమంటారెందుకు"
"రేపు బోర్డు తిప్పేసామని పేపర్‌వాళ్ళు వ్రాయకూడదని"



**ఈ జోక్‌లను పంపినవారు - ఎం.శిరీష, చిత్తూరు.**



"సినిమా మధ్యలో కరెంటు పోయి పిక్చరు ఆగిపోయిందని గోల చేస్తుంటే మీరేంటి ఇంత ఆనందంగా 'భలే భలే' అంటూ గంతులేస్తున్నారు?..."
"నేను వచ్చేటప్పుడు ఇస్త్రీపెట్టె ప్లగ్ ఆఫ్ చేయడం మరచిపోయాన్లే!"

"డెలివరీకి ముందు నేను 'అమాయకుడు' సినిమా చూసొచ్చాను. అందుకే మా అబ్బాయి అంత అమాయకంగా ఉంటాడు."
"నేను కూడా డెలివరీకి ముందు 'లవ-కుశ' సినిమా చూశాను. నాకు కవలలు పుట్టింది అందుకేనేమో...?"
ఇది విన్న మూడో ఆమె ఓరి భగవంతుడా అంటూ శోకాలు మొదలుపెట్టింది...
ఏంటని అడిగితే "నేను ఇవాళ 'ఆలీబాబా నలభై దొంగలు' చూసి వచ్చాను. వచ్చేవారమే నాకు డెలివరీ... నేనేం చేతున్రో దేముడా..." అంటూ చెప్పి తిరిగి శోకాలు లంకించుకుందా మూడో ఆమె.



అప్పుకోసం వచ్చిన రైతుతో :
బ్యాంకు మేనేజరు : తాకట్టుగా ఏం పెడతారు?
రైతు : గేదెలు
మేనేజరు : ఎన్ని వున్నాయి?
రైతు : పది
సరేనని లోన్ శాంక్షన్ చేశాడు మేనేజరు. తర్వాత ఆ అప్పు ఆ రైతు తీర్చేశాడు కూడా.
ఇంకొన్నాళ్ళకి ఆ రైతుకి లాటరీలో పది లక్షలు వచ్చాయి. ఆ మేనేజరు వచ్చి ఆ డబ్బుని బ్యాంకులో డిపాజిట్‌గా పెట్టమని బ్రతిమాలాడు.
"మీ వద్ద ఎన్ని గేదెలు వున్నాయి అది చెప్పండి ముందు" అన్నాడా రైతు.



యజమాని తన నౌకరుకు పోస్టు చేసేముందు స్టాంపు అంటించాలని చెప్పి ఒక కవరుని, అందుకు కావలసిన డబ్బుకి చిల్లర లేక వంద రూపాయల నోటు ఇచ్చి పంపాడు. అతను తిరిగి వచ్చి ఇచ్చిన డబ్బుని యధాతథంగా యజమానికి తిప్పి ఇచ్చేసాడు.
"ఇదేంటి... కవరు పోస్ట్ చెయ్యలేదా?"
"చేశానండి"
"మరి స్టాంపు కొనడానికి చిల్లర లేకపోతే నీ దగ్గర డబ్బు ఖర్చు పెట్టావా...? ఈ నోటు మార్చి తీసుకోలేకపోయావా?"
"అదేం లేదండి! అక్కడ నన్నెవరు చూడడం లేదండీ అనవసరం ఖర్చు ఎందుకని స్టాంపు అంటించకుండా కవరును పోస్టులో పడేసా!"



"త్వరగా భోజనం వడ్డించవే ఆఫీసుకు టైం అవుతున్నది."
"సగమే ఉడికిందండి."
"అయితే ఉడికిన ఆ సగం నాకు పెట్టు. మిగిలిన సగం నువ్వు తాపీగా ఉడకపెట్టుకుని తిను."



హోటల్లో ఒకతను టిఫిను తిన్నాక వెయిటర్‌కి ఒక రూపాయి టిప్పు ఇచ్చాడు.
వెయిటరు : మీరు ఒక్క రూపాయి ఇచ్చి నన్ను అవమానించారు సర్!
ఆసామి : సరే! ఇంకో రూపాయి ఇచ్చి మళ్ళీ అవమానించలేను" అంటూ మొదటి రూపాయిని కూడా వెనక్కు తీసేసుకున్నాడు.



**ఈ జోక్‌లను పంపినవారు - జి.బి.లక్ష్మి, హైదరాబాద్.**





# అర్థం చేసుకుందాం ఆస్వాదిద్దాం

| | |
|---|---|
| చిత్రం | : అభిమాన్ (1973) |
| రచన | : మజ్రూహ్ సుల్తాన్‌పురి |
| సంగీతం | : ఎస్.డి.బర్మన్ |
| అభినయం | : జయ బాధురి, అమితాబ్ బచ్చన్, బిందు, అస్రానీ |
| గానం | : లతా మంగేష్కర్ |

పియాబినా...
పియాబినా, పియా బినా బిసియా
బాజె న, బాజె న, బాజెన
పియా బినా...
పియా ఐసే రూఠే కి హోఠోం సే మేరే సంగీత్ రూఠా (2)
కభీ జబ్ మైఁ గావూఁ లగే మేరే మన్ కా హర్ గీత్ ఝూఠా
ఐసే బిఛ్‌డే హో ఓ ఓ ఓ ఐసే బిఛడే మోసే రసియా ॥పియా బినా॥
తుమ్హారీ సదా బిన్ నహీఁ ఏక్ సూనీ మోరీ నగరియా (2)
కి చుప్ హై పపీహా, మయుర్ బోల్ భూలే బన్ మేఁ సవఁరియా
దిన్ హై సూనా ఆ ఆ ఆ ఆ దిన్ హై సూనా, సూనీ రతియా ॥పియా బినా॥





ఐదు దశాబ్దాలకు పైగా ఎన్నో చిత్రాలలోని పాటలకు తన పదాలతో ప్రాణ ప్రతిష్ట చేసిన పదేంద్రజాలికులు మజ్రూహ్ సుల్తాన్‌పురి. 1949లో ఎ.ఆర్.కర్దార్ తీసిన 'షాజహాన్' చిత్రం నుంచి 2000లో వచ్చిన 'క్యా కెహనా' వరకు ఆయన 330 పైచిలుకు చిత్రాలకు 8000కు పైగా పాటలు వ్రాశారు. 'షాజహాన్'లో అమర గాయకుడు కె.ఎల్.సైగల్ పాడిన 'జబ్ దిల్ హీ టూట్ గయా' పాట మజ్రూహ్ సాబ్ వ్రాసినదే. ఎటువంటి పాట వ్రాసినా సన్నివేశానికి సరిపోయేటట్టు వ్రాయటమే కానీ లేనిపోని భేషజాలకు పోయేవారు కాదు. విషాద గీతాలు, విరహ గీతాలు, ప్రేమ గీతాలు, వేదాంత గీతాలు, సరదా పాటలు, క్యాబరే పాటలు - ఇలా అన్ని రకాల పాటలు వ్రాశారు. ఆయన పాటల నుంచి కొన్నిటిని పేర్కొనటం కష్టమే అయినా మచ్చుకి కొన్ని - 'మానా జనాబ్ నే పుకారా నహీఁ' (పేయింగ్ గెస్ట్), 'హమ్ హైఁ రాహీ ప్యార్ కే' (నౌ దో గ్యారా), 'జల్ తే హై జిస్‌కే లియే' (సుజాతా), 'బైయాఁ నా ధరో' (దస్తక్), 'ఆజా ఆజా మైఁ హూఁ ప్యార్ తేరా' (తీస్రీ మంజిల్), 'చురాలియా హై తుమ్‌నే జో దిల్ కో' (యాదోఁ కీ బారాత్), 'పియా తూ అబ్ తో ఆజా' (కార్వాన్), 'ఎక్ దిన్ బిక్ జాయేగా మాటీ కీ మోల్' (ధరమ్ కరమ్), 'పాపా కెహ్‌తే హైఁ' (కయామత్ సే కయామత్ తక్), 'పెహలీ నషా' (జో జీతా వహీ సికందర్), 'రాజా కో రానీ సే ప్యార్ హో గయా' (అకేలే హమ్ అకేలే తుమ్).

మజ్రూహ్ సుల్తాన్‌పురి అసలు పేరు అస్రార్ హసన్‌ఖాన్. ఆయన 1919 అక్టోబర్ 1న ఉత్తరప్రదేశ్‌లోని సుల్తాన్‌పుర్‌లో జన్మించారు. చిన్నతనంలోనే ఉర్దూ, పర్షియన్, అరబిక్ భాషలను అభ్యసించారు. తర్వాత లక్నోలోని యునానీ కాలేజ్‌లో వైద్యవిద్య అభ్యసించి ఒక సంవత్సరం ప్రాక్టీస్ కూడా చేశారు. కానీ కవిత్వంలో ఉన్న అభిరుచి కారణంగా వైద్యవృత్తి వదిలి జాతీయవాద కవుల సంఘంలో చేరారు. స్వాతంత్ర్యపోరాటంలో అరెస్టు అయ్యారు. స్వాతంత్ర్యం వచ్చాక మజ్రూహ్ సుల్తాన్‌పురి పేరుతో చిత్రరంగ ప్రవేశం చేశారు. మెహబూబ్, నాసిర్ హుసేన్ చిత్రాలకు మజ్రూహ్ తప్ప వేరెవరూ పాటలు రాసేవారు కాదు. రాజశ్రీ ప్రొడక్షన్స్ వారు తీసిన 'దోస్తీ' చిత్రానికి మజ్రూహ్ సాహబ్‌కు ఎన్నో అవార్డులు వచ్చాయి. చిత్రరంగానికి ఆయన అందించిన సేవలకు గాను ఆయనకు 1993 సంవత్సరపు దాదాసాహబ్ ఫాల్కే అవార్డు లభించింది. ఈ అవార్డు అందుకున్న తొలి గీత రచయితగా ఆయన చరిత్రకెక్కారు.

సంగీత దర్శకులలో చాలా మంది వారి కెరియర్ ప్రారంభదశలో మజ్రూహ్ సాబ్‌తో కలిసి పనిచేసి విజయాన్ని చవిచూసారు. ఒ.పి.నయ్యర్ 'ఆర్‌పార్'తో, ఖయ్యామ్ 'ఫుట్‌పాత్'తో, లక్ష్మీకాంత్ - ప్యారేలాల్ 'దోస్తీ'తో, ఆర్.డి.బర్మన్ 'తీస్రీమంజిల్'తో, రాజేష్ రోషన్ 'కుఁవారా బాప్'తో, ఆనంద్ - మిలింద్ 'కయామత్ సే కయామత్ తక్'తో, జతిన్ - లలిత్ 'యారా దిల్‌దారా'తో, తుషార్ భాటియా 'అందాజ్ అప్నా అప్నా'తో విజయాన్ని సొంతం చేసుకున్నారు. ఇక సీనియర్ సంగీత దర్శకుడైన ఎస్.డి.బర్మన్‌తో మజ్రూహ్‌సాబ్ కాంబినేషన్ గురించి వేరే చెప్పాలా? 'చల్తీకా నామ్ గాడీ', 'పెయింగ్ గెస్ట్', 'కాలాపానీ', 'సుజాతా', 'అభిమాన్' చిత్రాలతో ఈ కాంబినేషన్ సూపర్ హిట్ పాటలను అందించింది. 'అభిమాన్' చిత్రం విడుదలయ్యే సమయానికి ఎస్.డి.బర్మన్‌కు 67 ఏళ్ళు! అదే



సంవత్సరం (1973) అనురాగ్, జుగ్ను చిత్రాలకు కూడా చక్కని సంగీతం అందించి తనకు తానే సాటి అనిపించుకున్నారు సచిన్‌దా.

'అభిమాన్' లో నాయికా నాయకులిద్దరూ గాయకులు కావటంతో సంగీతానికి అధిక ప్రాధాన్యత ఇచ్చారు. ప్రతి పాట సందర్భాన్ని గురించి ఎంతోకొంత చెప్పే పాటే. స్టేజి మీద పాడినట్టున్నా కథాపరంగా కూడా బలమున్న పాటలే అన్నీ. ఈ విధంగా పాటలు రాబట్టుకుని చక్కని చిత్రాన్ని రూపొందించారు దర్శకుడు హృషికేశ్ ముఖర్జీ. పురుషుడిననే అహంకారంతో తన భార్య విజయాన్ని చూసి అసూయపడి తన జీవితంతో పాటు తన భార్య జీవితాన్ని కూడా నరకప్రాయం చేసుకున్న ఒక గాయకుడి కథ ఇది. సుబీర్ అనే గాయకుడు తన పిన్ని ఊరికి వెళ్లినపుడు ఉమ అనే అమ్మాయితో పరిచయమవుతుంది. ఆమె తన తండ్రి దగ్గర శాస్త్రీయ సంగీతం నేర్చుకుని, ఆత్మానందాన్ని ఇచ్చేదే నిజమైన సంగీతమని నమ్మే అమ్మాయి. సుబీర్, ఉమల పెళ్ళి అయిన తర్వాత అతను ఆమెను తనతో పాడటానికి ఒప్పిస్తాడు. ఆమె అతనికన్నా బాగా పాడుతుండటంతో ఆమెకు మంచి పేరు ప్రఖ్యాతులు వస్తాయి. ఆమె వద్దంటున్నా సోలో పాటలు పాడటానికి కూడా ఒప్పిస్తాడు. ఆమె పారితోషికం అతనికన్న ఎక్కువ అవుతుంది. దీనితో అతనిలో అసూయ పెరుగుతుంది. ఆమెకు దూరంగా తన స్నేహితురాలి ఇంట్లో ఎక్కువ సమయం గడుపుతూ ఉంటాడు. ఉమ పాడటం మానేస్తానని అనటంతో అతని అహం దెబ్బతింటుంది. కోపంలో 'నీ అవసరం నాకు లేద'ని అంటాడు. అభిమానవంతురాలైన ఉమ అవమానం భరించలేక పుట్టింటికి వెళ్ళిపోతుంది. ఆమె గర్భవతి అని తెలిసిన తర్వాత కూడా అతను అహం అడ్డువచ్చి ఆమెను నిర్లక్ష్యం చేస్తాడు. దిగులుతో ఉమకు గర్భస్రావం అవుతుంది. వాస్తవంలోకి వచ్చిన సుబీర్ ఉమను ఇంటికి తీసుకువస్తాడు. కానీ ఉమ తన మనసుకి అయిన గాయం నుంచి కోలుకోలేకపోతుంది. చివరికి తన భర్తకు తన మీద ప్రేమ ఉందని నమ్మకం కలిగాక మామూలు మనిషి అవుతుంది.

తన భర్త తనకు దూరమవుతున్నాడని అర్థం అయినపుడు ఉమ పాడే పాట 'పియాబినా'. రేడియోలో పాడే పాటే అయినా సందర్భోచితంగా ఆమె బాధను తెలిపే పాట.

'పియా' అంటే ప్రియుడు, భర్త. బసియా అంటే 'బన్సీ'కి మరో రూపం. 'వంశీ' నుంచి పుట్టిన మాటే 'బన్సీ'. వేణువు, మురళి అని అర్థం.

**'స్వామి లేక, స్వామిలేక మురళి పలుకదు, పలుకదు, పలుకదు'**



ఉత్తరాదిన కృష్ణ సంగీతానికి, మురళికి ఎంతో ప్రాముఖ్యం ఉంది. మురళీనాదం రాధాకృష్ణుల ప్రేమకు సంకేతం. తన భర్త దూరమవటంతో తనకు ప్రేమ కరువైందని ఆమె వాపోతోంది. ప్రేమకు, సంగీతానికి ఉన్న అనుబంధాన్ని చాటే 'డాక్టర్ చక్రవర్తి'లోని 'నీవులేక వీణ పలుకలేనన్నది' పాటను ఈ సందర్భంగా గుర్తుచేసుకోక తప్పదు. ప్రేమ, సంగీతం రెండూ అలౌకికానందాన్ని కలిగించేవే కదా.

రూఠ్‌నా అంటే అలగటం. హోఠ్ అంటే పెదవులు. గానా అంటే పాడటం. ఝూఠా అంటే అసత్యం. ఇక్కడ 'మనస్ఫూర్తిగా కానిది', 'భావం లేనిది' అనే అర్థం వస్తుంది. బిఛడ్‌నా అంటే దూరమవటం. రసియా అంటే సఖుడు, ప్రియుడు.

**'ఇంతగా అలిగారు స్వామి.....**
**నా పెదవులపై సంగీతమే అలిగింది**
ఎపుడైనా నే పాడినా నా హృదయపు ప్రతి గీతం భావం లేక పలికింది ఇలా దూరమయారు స్వామి'

సంగీతాన్ని దైవంగా భావించే ఆమె, తన భర్త కినుక వహిస్తే ఆ దైవమే తనకు దూరమయినట్టు భావిస్తోంది. భర్తకు దూరమయి తాను పాడే పాటలు పైపై పాటలే గానీ మనసు లోతుల్లోంచి వచ్చినవి కావని, భావరహితంగా వచ్చేవే అని బాధపడుతోంది. భర్త దూరమవటంతో ఆమెకు సంగీతమే దూరమయింది.

నదా అంటే పిలువు. సూనీ అంటే బోసిపోయినది, చిన్నబోయినది. నగరియా అంటే నగరానికి వాడే పదం. ఇక్కడ లోకం అనే అర్థం వస్తుంది. పపీహా అంటే ఒక రకం పక్షి. కోయిల అనుకోవచ్చు. మయూర్ అంటే నెమలి. బోల్ అంటే పలుకులు. 'బన్' అంటే 'వన్'కి మరో రూపం. వనం అని అర్థం. సవఁరియా అంటే సఖుడు, ప్రియుడు. రతియా అంటే రాత్‌కి మరో పదం. రేయి అని అర్థం.

**'నీ పిలువు లేక నా లోకమొకటే కాదు బోసిపోయింది**
**కోయిల కూడా మూగవోయింది, వనాన నెమలి పలుకులు మరచింది**
**వగలు చిన్నబోయింది, రేయి చిన్నబోయింది'**

అతని పలకరింపు లేక ఆమె మనసు ఎలాగూ మూగవోయింది. బయటి ప్రపంచం కూడా మూగబోయినట్టు అనిపిస్తోంది. సృష్టిలోని అణువణువూ సంగీత మయమే అని నమ్మే ఆమెకు కోయిల మూగబోయినట్టు, నెమలి పలుకులు మరచినట్టు అనిపిస్తోంది. సాధారణంగా నెమలి నృత్యాన్ని విశేషంగా చెప్పుకుంటారు. కానీ ఇక్కడ ఆమె చుట్టూ నిశ్శబ్దపు తెర పేరుకుంటోందని తెలపటానికి 'నెమలి పలుకు' అనే ప్రయోగం చేశారనిపిస్తుంది. పగలు, రేయి వస్తూ పోతూ ఉన్నా నిస్సారంగా గడిచిపోతున్నాయి ఆమెకు.



శాస్త్రీయ పద్ధతికి దగ్గరగా ఉండే ఈ విరహగీతాన్ని లతామంగేష్కర్ అద్భుతంగా పాడారు. ఆర్.డి.బర్మన్ 'ఘర్' చిత్రానికి స్వరపరచిన 'తేరే బినా జియా జాయె నా' పాటలో కూడా ఈ పాట ఛాయలు కనిపిస్తాయి. ఆ పాటను కూడా లతాయే పాడారు.

**-పి.వి.సత్యనారాయణరాజు**



# అంతేరా... బామ్మర్ది



ఆదివిష్ణు



## జరిగిన కథ

భాగ్యనగరంలోని ప్రముఖ పారిశ్రామికవేత్త బసవరాజు, జానకిల కూతురు ఉమ. కొడుకు మురళి. ఉమ, వేణుని ప్రేమిస్తోంది. వేణుకు నాగపూర్లో ఉద్యోగం వచ్చినా ఉమను విడిచి వెళ్లడం ఇష్టం లేక ఉద్యోగానికి వెళ్లనంటాడు. అతని బావ రంగనాథం తన బాల్యమిత్రుడు బసవరాజు కంపెనీలో ఉద్యోగం వేయిస్తానని హామీ ఇస్తాడు. తనే స్వయంగా వెళ్లి బసవరాజును కలిసి బావమరిది ఉద్యోగం కై అడుగుతానంటాడు. ఈ లోపుల బసవరాజు పేపర్లో వార్తలు చదివి ఖంగారుపడి బావమరిదికై ఉద్యోగాలకోసం వచ్చే ఫ్రెండ్స్‌ను కలవకూడదని నిశ్చయించుకుంటాడు. అందుకే అతన్ని కలవడానికి వచ్చిన రంగనాథాన్ని చూడ నిరాకరిస్తాడు



(ఇక చదవండి)

బస్టాపులో బల్లమీద కూచున్న రంగనాథాన్ని ఒక పెద్ద మనిషి ఎంతో మర్యాద పూర్వకంగా పలకరించేడు -

''అయ్యా! తొమ్మిదో నెంబరు బస్సు ఎప్పుడొస్తుందంటారు?''

ఆ పెద్ద మనిషిని రంగనాథం ఎగాదిగా చూస్తో-

"తొమ్మిదో నెంబరు బస్సు?" అన్నాడు తాపీగా

"అవునండి!"

"ఎప్పుడొస్తుంది?" అని కూడా తాపీగానే అన్నాడు.

"అంతేనండి!"

"వెళ్లి కంట్రోలర్ని అడుగు!" అని విసుగ్గా అన్నాడు.

"కంట్రోలరా? అతనెక్కడ వుంటాడో?"

రంగనాథం ఇక ఓర్చుకోలేకపోయేడు. అంచేత తన ధోరణిలో నిప్పులు తొక్కడం ప్రారంభించేడు -

"ఏమిటయ్యా? అసలేమిటి నీ ఉద్దేశం? వాడెవడో మేస్టారూ అని పలకరించి నన్ను బడి పంతుల్ని చేసేడు! నువ్వేమో ఆర్టీసీ బస్సు గురించీ, కంట్రోలరు గురించీ అడిగి నన్ను మూటలు మోసే మేస్త్రీని చేస్తున్నావ్? దేనికైనా కామన్‌సెన్సంటూ ఒకటి అఘోరించాలి!"

"ఎందుకండీ అట్లా వేడెక్కిపోతారు? తొమ్మిదో నెంబరు బస్సెప్పుడొస్తుందని అడిగేను. తెలుస్తే చెప్పండి! లేకపోతే - తెలీదని చెప్పండి! ఎందుకంత ఎక్కువగా మాట్లాడతారు?"

"అంతే! మా వరసంతే! చిన్నప్పుడు మాకు మా పెద్దవాళ్లు వస ఎక్కువగా పోసేరు! అంచేత - డబ్బాలో రాళ్లేసి గిలకరించినట్టు - కర్త, కర్మ, క్రియల్లేకుండా - లొడలొడా వాగేస్తుంటాం! వాగ్గేయకారులం! తప్పొరైటో మాకు తెలీదు! మాట బాగుంది కనక వాడేను. వదిలెయ్! తొమ్మిదో నెంబరు బస్సెప్పుడొస్తుందో లెక్చర్లు దంచుతాం. కంట్రోలర్ ఎక్కడుంటాడో వాడి డ్యూటీ ఏమిటో గంటలకొద్దీ మాటాడతాం! మేమంతే! నోరు విప్పితే కంకర్రాళ్లే! వెళ్లిపోతావేం? ఆగు! ఇంట్రడక్షన్ పూర్తయింది! చెప్పాల్సింది యింకా చాలా వుంది! నిన్నే!"

ఆ పెద్ద మనిషి అప్పటికే వెళ్లిపోయేడు. రంగనాథం మాత్రం యింకా గొణుక్కుంటూనే వున్నాడు-

"తొమ్మిదో నెంబరు బస్సుట! తొమ్మిదో నెంబరు! అదొక దిక్కుమాలిన బస్సు! దానికో నెంబరు!"

రంగనాథానికి బాగా తెలిసిన మనిషే. పేరు కృష్ణమూర్తి. ఈ మధ్య కాలంలో వాళ్లిద్దరూ కలుసుకోలేదు. చాలా కాలానికి కనిపించడంతో - అప్పుడే అక్కడికి వచ్చిన కృష్ణమూర్తి రంగనాథాన్ని చూస్తూ ఆనందంగా అన్నాడు -

"నమస్కారం రంగనాథం గారూ? బహుకాల దర్శనం!"

రంగనాథం కృష్ణమూర్తిని చూచేడు. ఏమీ మాటాడలేదు.

"బావున్నారా?" అన్నాడు కృష్ణమూర్తి.

ఆ మాటతో రెచ్చిపోయి రంగనాథం -

"బాగోడమా? మేమెందుకు బావుంటాం? ఎక్కేంగా రోడ్డు! చూనన్తా అడుగుతావేం? మేము బాగుండం! అడుక్కుతింటాం! అమ్మా మాదాకబళం తల్లీ అంటూ ఇల్లిల్లూ తిరిగి అడుక్కుతింటూ బతుకుతాం!"




"అయ్యో! అవేం మాటలండీ! వంటో బాగోలేదా?"

''ఏమి బావుంటుంది? అన్నలు బావుండదు! సమస్తమైన రోగాలూ ఒకేసారి తగులుకున్నాయి గదా! ఆస్పత్రుల చుట్టూ తిరుగుతున్నాం! వాళ్లిచ్చే రంగునీళ్లు లెక్క ప్రకారం మూడు పూటలా మింగుతూ బతికేస్తున్నాం! వంటో బాగోలేదా!?"

కృష్ణమూర్తి రంగనాథం వరనకి ఆశ్చర్యపోతూ - సంభాషణ పొడిగించడం మంచిది కాదనే ఉద్దేశంతో వెళ్లిపోతున్నాడు. వెళ్లిపోతున్న కృష్ణమూర్తిని రంగనాథం విసుక్కుంటున్నాడు -

''పలకరించడవెందుకూ? పారిపోవడమెందుకు? ఆ బసివిగాడేమో మమ్మల్ని తరిమి తరిమి కొట్టేందుకు గుమ్మం దగ్గిర మనుషుల్ని పెట్టేడా? ఊళ్లో జనం మమ్మల్ని పలకరించి పారిపోతుంటారా? అంతేమరి! మమ్మల్ని చూస్తే అందరికీ అలుసే! అలుసు!"

అని అందుబాటులో వున్న ఇనప స్థంభాన్ని కాలితో గట్టిగా తన్నేడు! కాలు పచ్చడయింది!

"ఆహా!" అనుకున్నాడు ఆనందంగా!

బసవరాజు -

తన ఆఫీసు గదిలో కిటికీ దగ్గిర నిలబడ్డాడు!

అక్కడ నిలబడి వీధిలోకి చూస్తూ దీర్ఘాలోచనలో మునిగిపోయేడు! ఆ గదిలోకి వచ్చిన పాణి - యజమానిని ఆ స్థితిలో చూడగానే షాకు తిన్నాడు. అతని గుండె తరుక్కుపోయింది!

కొంచెం విషాదంగా పలకరించేడు -

"సార్?"

ఆ పిలుపు విన్న బసవరాజు పాణి వేపు నీరసంగా చూసేడు.

"తమరు అదో మాదిరి వున్నారు సార్!"

"నేనంతె మాస్టర్ పాణి! నాకు విచారం ఎక్కువయినప్పుడు ఇల్లాగే వుంటాను. కిటికీలకు అతుక్కుపోతా!"

"చాలా మంచి అలవాటు సార్! విచారానికి కిటికీ సరైన సింబల్ సర్!"

"మిస్టర్ పాణీ!" కిటికీ వదిలి వచ్చేస్తూ అన్నాడు బసవరాజు

"యస్సర్!" అన్నాడు పాణి.



"సినిమాలు చూడడం మానెయ్!"
"ఇంక చూడను సార్!"
"కిటికీలున్న సినిమాలను అస్సలు చూడొద్దు!"
"ఇకముందు ఆ పని మీదే వుంటాను సార్!"
"జీవితాలను చూడటం నేర్చుకో!"
"తప్పకుండా సార్!"
"అసలు నువ్వు ఆ మాయదారి మళయాళం వార్త చదవకపోతే బావుండేదేమో?"
"ఇకముందు ఏ వార్తలూ చదవను సార్!"
"చదవకపోతే నేను జాగ్రత్త పడటం ఎట్లా? అంచేత చదవాలి!"
"అల్లాగే సార్"
"నేను వద్దన్నా నువ్వు చదవాలి!"
"తప్పకుండా చదువుతాను సార్!"
"అది నీ డ్యూటీ!"
"అంతేగదా సార్!"
"కాకపోతే సింగినాదాన్ని బాధ పెట్టినందుకు చింతగావుందంతె!"
"క్వయిట్ నేచురల్ సార్!"
"సింగినాదం ఎవడనుకున్నావ్?"
"మీ ఫ్రెండు సార్! ప్రాణమిత్రుడు!"
"అంతేకాదు మిస్టర్ పాణీ! విద్యాదాత కూడా!"
"మీకు ట్యూషన్లవీ చెప్పేవాడా సార్!"
"ఊహూ!"
"మరి విద్యాదాత అని బిరుదిచ్చేరు!"
"అవును! వాడి లెక్కల పేపరు కాపీ కొట్టి యసల్సీ పాసయ్యేను!"
"ఓహో! అట్లా వచ్చేరా?"
"అప్పట్లో అట్లాగే వచ్చేవాడిని పాణీ! లెక్కల పేపరు కాపీ కొట్టడమే కాదు! వాడి చేత లవ్‌లెటర్స్ రాయించుకున్నాను! ఆ లెటర్స్‌లో మహత్తరమైన పొయిట్రీ గుప్పించేవాడు. అది నా సొంత కవిత్వమని మురిసిపోయి - జానకి నన్ను పెళ్లి చేసుకుంది!"
"ఆహా! ఇది మీ జీవితంలో మరపురాని మధురమైన మలుపుసార్! ఈ రహస్యం మేడమ్ గారికి యింత వరకు తెలీదా సార్?"
"ఇప్పుడేమో గానీ - మా పెళ్లయిన కొత్త రోజుల్లో తెలిసుంటే విడాకులిచ్చేది!"
"గొప్ప ప్రమాదం తొలిగిపోయింది సార్?"
"జానకితో నా పెళ్లి జరగడం మూలంగానే - అత్తవారి పెట్టుబడితో ఇంత పెద్ద వాడినయ్యేను! ఇప్పుడు చెప్పు మిస్టర్ పాణీ! జానకితో నా పెళ్లి కాకపోతే - నేనీ స్థితికి ఎదిగి వుండేవాడినా?"
"డిఫనిట్‌గా ఎదిగి వుండేవారు కాదు!"
ఏ స్థితిలో వుండేవాడిని?"
"గొప్ప దుస్థితిలో వుండేవారు సార్! నాకు అసిస్టెంట్‌గా పనిచేసేవారు!"
"చూసేవా? ఎంత డేంజరు తప్పిపోయిందో?"
"అంతేసార్! అదృష్టవంతులకు డేంజర్లు ఆ విధంగానే తప్పిపోతుంటాయ్ సార్!"
"ఇప్పుడు చెప్పు మిస్టర్ పాణీ!"
"అడగండి సార్!"
"నన్నింత పెద్ద వాడ్ని చేసిన సింగినాదానికి - థేంక్‌ఫుల్‌గా వుండవలసిందిపోయి - గెటవుట్ అని నీ చేత గెంటించడం - తప్పారైటా?"
"ఖచ్చితంగా తప్పే సార్! కానీ సర్! నేను చదివిన మలయాళ వార్త అట్లా వున్నప్పుడు ఎవరైనా మీలాగే చేస్తారు సార్!"
"ఇప్పుడు! ఇప్పుడు నేనేం చేయాలి?... ఏం చేస్తే బావుంటుంది? అచ్చెప్పు నాకు"
"తప్పకుండా చెబుతాను సర్! కాకపోతే కొంచెం టైం కావాలి సర్!"
"ఎన్నాళ్లు కావాలి?"
"ఎన్నాళ్లో అక్కర్లేదు సార్! కొన్ని నిమిషాలు చాలు సార్!"
"ఓ.కె! గంట టైమిస్తున్నాను! గంట తర్వాత చెప్పు!"
"తప్పకుండా సార్!"
-సరిగ్గా ఇదే వేళకి...
రంగనాథమింటో -
రంగనాథం గృహ ప్రవేశం చేస్తున్నాడు. మనిషి బాగా నలిగిపోయి వున్నాడు. జుత్తు రేగిపోయి వుంది!
అతన్ని చూడగానే అక్కాతమ్ముళ్లిద్దరూ కీడు శంకించేరు!
అన్నపూర్ణ భర్తని ఆత్రంగా అడిగింది -
"అట్లావున్నారేమిటండీ? ఏం జరిగిందీ?"
రంగనాథం సమాధానం చెప్పకుండా - అందుబాటులో వున్న స్టూలుని గట్టిగా కాల్తో తన్నేడు! ఇనపస్తంభాన్ని తన్నిన కాల్తోనే ఇంటో స్టూలుని కూడా తన్నేసేడు!
అన్నపూర్ణ భయపడుతూ అడిగింది -
"బసవరాజు గార్ని కలుసుకున్నారా?"
రంగనాథం కోపంతో ఊగిపోతూ అరిచేడు -
"చంపుతా! ఇకముందు ఆ పేరు ఈ ఇంటో వినిపిస్తే - మిమ్మల్ని కిరసనాయిలు పోసి తగలెడతా!"
వేణు కలగజేసుకున్నాడు-
"అసలేం జరిగింది బావా?"
"ఏం జరిగిందా?"
అని అటూ ఇటూ చూసి - అక్కడున్న బిందెను అమాంతం ఎత్తేసి - దాన్ని నేల మీద కొట్టి అన్నాడు -
"ఇది... ఇదే జరిగింది!"
"ఇప్పుడాయన్నేమీ అడక్కురా వేణూ! కోపమ్మీద వున్నారు!"
"అవునే! ఇంటా బయటా యావన్మందికీ నా కోపమే కనిపిస్తుంది! నాకు జరిగిన అవమానం - "






అని వంటి మీదున్న చొక్కాని చింపేసుకుంటున్నాడు. వేణు ఖంగారు పడ్డాడు. ఖంగారుగానే అన్నాడు.

"బావా! కొంచెం శాంతించు!"

"శాంతించడాల్లేవు! అసలిదంతా నీ వల్లే జరిగింది! నీకు ఉద్యోగం అడగడానికి వెళ్ళి - ఆ బసివిగాడి చేత ఛీ కొట్టించుకుని!"

వేణు షాకు తిన్నాడు -

"నాకు ఉద్యోగం యివ్వనన్నాడా!"

"అది నాకేం తెలుసు?"

"బావా?"

"అవు(నా! అసలు నన్ను వాడి గదిలోకి రానిస్తేనా? బయట నించోమని ఆర్డరేసి గెటవుట్ అని ఖబురు పెట్టేడు! పిచ్చి వెధవలా తిరిగొచ్చేసేను! చాలా?" అని గబగబా తన గదిలోకి వెళ్లిపోయి - ఢామ్మని తలుపులు మూసుకున్నాడు!

అక్కా తమ్ముళ్లిద్దరూ మొహమొహాలు చూసుకుంటున్నారు!

బసవరాజు ఆఫీసు.

పాణి కిటికీ దగ్గిర నిలబడి వున్నాడు.

బసవరాజు తన సీట్లో కూచుని వున్నాడు.

బసవరాజు వాచీ చూసుకుని -

"మిస్టర్ పాణీ!" అన్నాడు

"యస్సార్!" అని

కిటికీ వదిలి వచ్చి బసవరాజు ముందు వినయంగా నిలబడ్డాడు పాణి!




"నీకిచ్చిన గంట గడువు పూర్తయింది!"

"జస్టిప్పుడే పూర్తయింది సార్!"

"ఏం ఆలోచించేవ్?"

"మీ ఫ్రండింటో ఫోనుందా సార్?"

"వుంది! ఇప్పుడు ఆ ఫోన్తో పనేమిటి?"

"ఫోన్లో పశ్చాత్తాపం పలు విధాల శ్రేయస్కరం సార్!"

"పలు విధాలక్కర్లేదు! ఒక్క విధం చెప్పు చాలు!"

"అవతల పెద్ద మనిషి ఎంత మంట మీదున్నా - మీకు చాలా దూరంగా ఫోన్ దగ్గిరుంటాడు గనక - మీరు చెప్పేది వింటాడే గాని కాలో చెయ్యో విసరలేడు!"

"వెరీ గుడ్! మంచి అయిడియా!"

"థేంక్యూ సర్! నేను ఎప్పుడూ ఆ జాతి అయిడియాలనే యిస్తుంటాను సార్! అది నా వీక్నెస్సు!"

"ఇచ్చే అయిడియా లేటుగా యిచ్చేవ్!"

"అడిగిన వెంటనే అయిడియా తట్టదు సార్! అది కూడా నా వీక్నెస్సే!"

"ఇక ముందు ఇల్లాంటి వీక్నెస్సులు రిపీట్ కాకుండా చూసుకో!"

"సర్టెన్లీ సర్!"

"ఇప్పుడే సింగినాదానికి ఫోన్ చేస్తా!"

"ఇప్పుడొద్దు సార్!" అన్నాడు పాణి.

(ఇంకావుంది)

---

# హిందీ సినీ సంగీతంలో మలుపులూ-మజిలీలూ

## 1955

✻ లిరిక్ రెడీగా లేకపోతే ట్యూన్ కట్టననే సంగీత దర్శకుడు సి.రామచంద్ర. ఎస్.ఎమ్. శ్రీరాములు నాయుడు భారీ తారాగణంతో నిర్మించిన 'ఆజాద్' (తెలుగులో 'అగ్గిరాముడు') చిత్రం కోసం మూడువారాలలోనే ట్యూన్స్ సిద్ధంచేయడమే కాకుండా రికార్డు కూడా చేసారు. నౌషాద్తో సహా అప్పటి హిందీ సంగీత దర్శకులందరూ అంత తక్కువ టైమ్లో చేయడం కుదరదని తెగేసి చెప్పిన ఆ సమయంలో సి.రామచంద్ర అంత తక్కువ వ్యవధిలో స్వరపరచి రికార్డు చేయటం అందులోని పాటలు హిట్ కావటం ఓ రికార్డుగా నిలిచిపోయింది. 'కిత్నా హసీన్ హై మౌసమ్...', 'రాధా న బోలే న బోలే...', 'ఓ బలియే చల్ చలియే...', 'అప్లమ్ చప్లమ్...' వంటి గీతాలు సూపర్ హిట్ అయ్యాయి. అంతేకాక 'యాస్మిన్' చిత్రం కోసం చేసిన 'బేచైన్ నజర్...', 'తుమ్ అప్నే యాద్ భీ దిల్ సే భూలా జాతే...' పాటలను అలాగే 'ఇన్సానియాత్' కోసం చేసిన 'ఆశాకే జబ్దీప్ అప్నీ ఛాయా మేఁ...' పాటను ఎవరు మరచిపోగలరు!


సి.రామచంద్ర

## 1956

✻ శంకర్ - జైకిషన్, శైలేంద్ర, హస్రత్ జయపురిల కాంబినేషన్ సూపర్హిట్ అయింది. ఎన్నో అద్భుతమైన గీతాలు వీరి కాంబినేషన్లో రూపుదిద్దుకున్నాయి. శైలేంద్ర, హస్రత్ జయపురిలతో కాక వేరే రచయితలతో పనిచేయడానికి శంకర్-జైకిషన్లు తిరస్కరించే స్థాయిలో అది కొనసాగింది.


శంకర్-జైకిషన్

✻ ముకేష్ స్వయంగా నిర్మించి, సంగీతదర్శకత్వం వహించిన 'అనురాగ్' చిత్రం విడుదల కాలేదు. హీరోగా తనే నటించిన ఈ చిత్రంలో అతను పాడిన 'పల్భర్ కీ హై పెహచాన్', కిసే యాద్ రఖ్నా', లతా గానం చేసిన 'జిస్నే ప్యార్ కియా' పాటలు మంచి హిట్ అయ్యాయి.


రాజ్కపూర్, ముకేష్

✻ 'భాయ్ భాయ్' చిత్రం కోసం లతా పాడిన 'కదర్ జానేనా..' కిశోర్ పాడిన 'మేరానామ్ అబ్దుల్ రహమాన్' అలాగే 'పాకెట్ మార్' చిత్రం కోసం పాడిన 'యే నయీనాయీ ప్రీత్ హై' పాటలకు మదన్ మోహన్ సంగీతాన్నిచ్చేరు.

✻ బి.ఆర్.ఫిలిమ్స్ తొలిచిత్రం 'ఏక్ హీ రస్తా' కోసం హేమంత్కుమార్, మజ్రూహ్ల కాంబినేషన్లో వచ్చిన 'చలీ గోరీ పీ కే మిలన్ కో చలీ' 'సావలీ సలోనీ ఆయే దిన్ బహార్ కే' పాటలు హిట్ అయాయి.

(-వచ్చే సంచికలో మరికొంత)

## జరిగిన కథ

అజయ్ అనే శ్రీమంతుడు, విజయ్ అనే పేదవాడు ఒక ఏడాదిపాటు తమ తమ స్థానాలను మార్చుకోవాలని నిశ్చయించుకుంటారు. అజయ్ స్థానంలో వచ్చిన విజయ్ మేనేజర్ భానోజీకి ముకుతాడు వేసి, అతను కాజేసిన నగలకోసం అతని కూతురు సరళతో ప్రేమ నటిస్తాడు. కానీ ఆమె తనంటే నిజంగా ఇష్టపడుతోందని తెలిసి ప్రేమిస్తాడు. విజయ్ స్థానంలో వచ్చిన అజయ్ చెల్లెలు మీనా కాపురం సరిదిద్దే ప్రయత్నంలో బ్యాంక్‌కు వెళ్ళి తన సంతకాన్నే 'ఫోర్జరీ' చేసి డబ్బు తెస్తాడు.. తోటి మెకానిక్ ప్రకాష్ చెల్లెలు పద్మను ప్రేమిస్తాడు. పద్మ అజయ్‌బాబు ఆఫీసులో పనిచేస్తూంటుంది. మీనా తండ్రి రామదాసు డబ్బు తీసుకుని వియ్యంకుడు పరంధామయ్య వద్దకు వెళతాడు. ఈ లోగా ఫోర్జరీ విషయం బయటపడుతుంది. విచారణలో భాగంగా పోలీసులు పద్మను ప్రశ్నలడిగి వెళతారు. ఆ సమయంలో భానోజీ అక్కడే వున్నాడు.

(ఇక చదవండి)

అన్నపూర్ణావారి

# ఇద్దరు మిత్రులు



సీరియల్ - నవల 18

**రచన : ముళ్ళపూడి వెంకటరమణ**



"ఊఁ...నమ్మి తాళం చెవులు చేతికిచ్చి నందుకు తగిన శాస్తి చేశావు" అన్నాడు భానోజీరావు ఆమె వంక తిరిగి.

"ఏం చేశానండీ. నేనేం తప్పు చెయ్యలేదే" అంది పద్మ ఉండబట్టలేక.

"ఇంకేం చెయ్యాలి. ఆ మాత్రం ఎవరెవరో పొల్చుకోనక్కర్లా. తప్పు చేసింది చాలక ఇంకా కప్పి పుచ్చుకోవాలని చూస్తున్నావా? పైగా మాటకుమాట సమాధానం చెపుతావా?"

"తొందరపడుతున్నారు భానోజీగారూ!"

"ఇంత జరిగినా తొందరపడక నీలాగా నిమ్మకు నీరెత్తినట్టు నిలబడమంటావా? యజమాని ఉప్పుతింటూ వారికే ద్రోహం తలపెడతావా?" అంటూ రెచ్చిపోయాడాయన.

పద్మకి ఓపిక హరించిపోయింది.



"ఉప్పుతింటూ ద్రోహంచేయడం నాచేత గాదు. నీతికీ, నిజాయితీకీ విలువ తెలియని వాళ్ళ దగ్గిర ఉద్యోగం చేయడం నా వల్లకాదు. నమస్తే" అంటూ తాళాలు బల్లమీద పడేసి వెళ్ళిపోయింది పద్మ.

భానోజీగారిని, నువ్వెంత అంటే నువ్వెంత అంటూ ఎదిరించగలిగిన పిల్లనీ, ఈ అపూర్వ సన్నివేశాన్నీ చూసి జన్మ తరించిందని సంబరపడి పోయాడు శేషావతారం.

"ఏమైనా నిజాయితీగల పిల్లే మరి- ఏమంటారు మరీ?" అన్నాడు గుంభనగా.

"నోరుమూసుకో మంటాను" అన్నారు భానోజీగారు సాలోచనగా. ఆయన చెయ్యి యాంత్రికంగా బల్లమీదకు వెళ్ళి తాళాలగుత్తిని అందుకుంది. ఆప్యాయంగా తనలో పొదువుకుంది, గాఢంగా అదుముకుంది...



"హూ ఫీడా విరగడైపోయింది" అన్నారాయన. తాళంచెవులు పైకెత్తి పట్టుకుని కళ్ళారచూసి, "మళ్ళీ ఎన్నాళ్ళకు-" అన్నారు.

"-మన చేతిలోకొచ్చాయి మరీ" అన్నాడు శేషావతారం విధేయత ఉట్టిపడేలా.

జ జ జ జ జ

చేతికొచ్చిన సొమ్ముని పోనివ్వడానికి ప్రాణం ఒప్పదు. పరంధామయ్యగారికి సుతరామూ ఒప్పదు. విజయ్ అరెస్టయ్యాడని తెలియగానే, తన చేతి కొచ్చింది దొంగసొమ్ము అన్న అనుమానం, అదివుంటే ప్రమాదం అన్న భయం బాధించినా, దూరం ఆలోచించి ధైర్యం తెచ్చుకున్నాడు.



ఆయన మాటలధోరణి మాత్రం రామదాను గారు భరించలేక పోయాడు.

"బావగారూ! మావాడిని దొంగ అంటారా?" అన్నాడు దీనంగా.

"దొంగకాక దొరా! నీ కొడుక్కాదూ- పోలిక లెక్కడికి పోతాయి?"

"మాటలు మిగిలారో, ఏదో సామెత జెప్పినట్టు- మర్యాద దక్కదు!" అన్నాడు రామదాసు గారు రోషంతో.

"ఉన్నమాటంటే ఉలుకెందుకయ్యా! ప్లీడరు గుమాస్తాచేసి పార్టీల సొమ్ము కాజెయ్యలా?"

రామదాసుగారేం తక్కువ తినలేదు జాతకాలు పైకి తియ్యడంలో.



"నువ్వు మటుకేం తక్కువ దిన్నావా? గట్లు జరిపి తమ్ముడి పొలం కలుపుకోలా? దిక్కులేని మేనత్త ఆస్తి కాజెయ్యలా?" అన్నాడు.

"దానికి దిక్కులేదు గనుక కాజేశాను ఏఁ?"

"ఏఁటి నాన్నా! ఈ పోట్లాట- అవతల బావ కష్టంలో వుంటేను!" అన్నాడు బుజ్జి సాహసించి.

"బావట, బావ! సిగ్గులేదురా! ఆ దొంగ నీకు బావా? ఈ జెష్ట నీకు పెళ్ళామా?"



రామదాసుగారు చెవులు మూసుకున్నాడు. మీనా తల తిప్పుకుంది.

"అయ్యయ్యో ఎంత ఖర్మండీ, మధ్య మీనాను ఎందుకంటారండీ. అదేం జేసిందీ!" అంటూ అడ్డుపడింది సూరమ్మగారు.

"నోర్ముయ్యవే. ఈ శనంతా దీనివల్లకాదూ. మందో మాకో పెట్టి ఈ సన్యాసిని లొంగదీసుకుంది... ఇప్పుడింట్లో కాలుబెట్టి మనందరికీ అప్రతిష్ట తెచ్చింది."

పాతికేళ్ళ పౌరుషం ఒక్కసారిగా విజృంభించింది- చిరంజీవి భుజంగరావులో.



"నాన్నా ఇన్నాళ్ళూ నన్నేమన్నా సహించాను, మీనాను పల్లెత్తు మాటన్నావంటే నీకు మర్యాద దక్కదు" అన్నాడు కోపంగా.

"హ. పెళ్ళాన్నేలుకోలేని వాజమ్మా , నామాటకెదురు చెప్తావా?" అంటూ అలవాటు ప్రకారం కర్ర తిరగేశాడు పరంధామయ్యగారు.

అమిత సాధువైన రామదాసుగారు హఠాత్తుగా విజృంభించి ఆ కర్ర పట్టుకున్నాడు గట్టిగా. తక్షణం అల్లుడి ధైర్యం పుంజుకుంది."ఊఁ బావను విడిపించాలి. నాడబ్బు నాకివ్వు" అన్నాడు.

"ఏం డబ్బురా?"

"అదే, మీనా తెచ్చిన డబ్బు"

"నే నివ్వనుఫో" అన్నాడు తండ్రి.

"ఎందుకివ్వవ్" అన్నాడు కొడుకు.

"ఒరేయ్, డబ్బు వూసెత్తావా నీ చర్మం ఒలిచేస్తాను" అంటూ అందుకు ఉపక్రమించ బోయి. కర్ర వదలనందువల్ల వియ్యంకుడిని కసిరాడు పరంధామయ్యగారు-

"వదలద్దన్నయా, ఎన్నాళ్లు సాగిస్తాడో ఈ ఆటలు" అంటూ ఆయన ధర్మపత్ని తన అర్ధభాగంపై ఆధిపత్యం వహించి పరంధామయ్య గారి ఎడంచెయ్యి గట్టిగా పట్టుకుంది. వెంటనే బుజ్జి ముందుకు దూకి తండ్రి రొండినున్న తాళం చెవులు తీసుకున్నాడు. కేకలు పెడుతూ విడిపించుకో జూచిన పెద్దాయనని ముగ్గురూ కలిసి-అంతవరకూ బుజ్జి



ఖైదుగా ఉన్న గదిలోకి నెట్టి తలుపుమూసి తాళం వేశారు.

"నాన్నా యిక చల్లగా విశ్రాంతి తీసుకో, జై రామభక్త హనుమాన్" అంటూ ఇనపెట్టెవున్న గదిలోకి లంఘించాడు బుజ్జి. ఆంజనేయుడికి తన బలం సంగతి తెలిసింది.

"శహబాష్ బుజ్జిబాబూ. సామెత జెప్పినట్టు ఇన్నాళ్ళకు నీ భుజబలం అక్కర కొచ్చిందోయ్. అంతా ఆ శ్రీరామచంద్రుడిదయ" అన్నారు రామదాసుగారు.



"ఒరేయ్ బుజ్జిగా, వాళ్ళందరి అనరా చూసుకుని ఇంత పనిచేస్తావురా. ఈ పరంధామయ్య అంటే ఏమనుకున్నావో, ఒక్కొక్కళ్ళనీ డొక్క చీల్చేస్తాను'' అంటూ అరిచారు ఖైదీ పరంధామయ్యగారు చాలా సేపు.

జజజజజ

చాలా రోజుల తరవాత చేతికొచ్చిన తాళాలను ఉపయోగించకపోతే ఎలా అని భానోజీగారు శేషావతారాన్ని వెంటేసుకొని అజయ్‌బాబు ఆఫీస్‌గది శోధించడం మొదలు పెట్టాడు.



తన అనుమతి లేకుండా, తన మాటకి వ్యతిరేకంగాతనకి తెలియకుండా అజయ్‌బాబు పరిష్కరించిన అనేక వ్యవహారాల పత్రాలు కనిపించాయి. తన చెయ్యిజారిపోయిన లక్షల సొంత లాభాలకు అవి కారణాలు. భానోజీగారి కోపం భగ్గుమంది...

"అయ్యా, ఇదేదో ప్రత్యేకంగా సీల్లువేసి బందోబస్తుగా ఉందండి మరి" అంటూ ఒక కవరు అందించాడు హెడ్‌గుమాస్తా.

భానోజీగారు అమితమైన ఉత్సాహంతో ఆ కవరు విప్పి చదివాడు. విభ్రాంతుడై పోయాడు. మళ్ళీ చదివాడు. నమ్మకం కుదరలేదు. శేషావతారానికి చ్చాడు. అజయ్, విజయ్‌లు "జీవితాలు" పరటా యిచ్చుకొంటూ రాసుకున్న ఒప్పందం అది.



"అంతా ఆశ్చర్యంగా ఉందే. ఇది కలా, వైష్ణవ మాయా" అన్నాడు గుమాస్తా.

"కలాకాదు, మాయాకాదు. కళ్ళక్కనిపిస్తున్న సత్యం" అన్నాడు భానోజీగారు. ఆయనకి ఆ సత్యం స్వరూపం క్రమంగా అవగతం అయింది. దొంగెవరో, దొరెవరో బోధపడింది.

"ఇప్పుడు జైల్లో ఉన్నదే అసలు అజయ్‌బాబు. ఇంతకాలం నువ్వు వంగివంగి సలాములు చేస్తున్నది ఈ మోసగాడికి" అన్నాడాయన. తనూ ఆపనే చేశాడన్న బాధ, కోపం ఆయనని చాలా క్షోభపెట్టాయి. కాని వ్యాపారదక్షుడుగా ఈ సమస్యను పరిశీలించినకొద్దీ ఇందులో అందచందాలు, సాధకబాధకాలు కొత్తకొత్త కోణాలలో కనబడసాగాయి.



"ఇంకా ఆలస్యం ఎందుకు పదండి పోలీసు స్టేషన్‌కి. వీడ్ని జెయిల్లో తోయించి మన బాబును

విడిపించుకొద్దాం" అన్నాడు గుమాస్తా.

భానోజీగారునవ్వారు. "ఎందుకూ విడిపించడం? అజయ్‌బాబు అక్కడే జెయిల్లోనే ఉంటాడు."

"అదేమిటండి కాబోయే అల్లుడు మరి?"

"కాబోయేఅల్లుడు-అజయ్‌కాదు-ఇతను... చదువుకున్నవాడు-సమర్థుడు-" అన్నారు భానోజీగారు ప్రత్యక్షరం స్పష్టంగా, తనకి కూడా వినబడేలా ఖచ్చితంగా ఉచ్ఛరిస్తూ, తనని జయించిన వాడిమీద ఆయనకి క్రమంగా గౌరవం పెరగసాగింది.

"అయితే మాత్రం చూస్తూచూస్తూ అమ్మాయిగారిని - దమ్మిడీ ఆస్తిలేని ఈ బికారి చేతుల్లో పెడతారా?" అన్నాడు శేషావతారం - పెట్టరని తనకి తెలిసినా ఆయన నోట ఆయన మాట వినాలన్న ఆశతో.

"విజయ్ బికారి ఎలా అవుతాడు? అమ్మాయి సరళ మనసారా ప్రేమించిన జమాందారు" అన్నాడు భానోజీగారు

*****

అసలు జమీందారు అజయ్‌బాబు జైలులో పచారు చేస్తున్నాడు. తను చేసిన పనిగురించి ఆలోచిస్తూ, దీనివల్ల అప్రతిష్ఠ వచ్చేది తనకు కాదు, విజయ్‌కి గడువుతీరగానే ఇదంతా అతని మీద పడుతుంది బహుశా తనకి ఖైదువేస్తే విడుదల వరకూ తనమీద వుంటుంది.. అతను ఏమంటాడో, ఏమనుకుంటాడో...



"అన్నయ్యా!" అంటూ మీనా పరుగున వచ్చింది.

"మీనా! నువిక్కడికెందు కొచ్చావమ్మా?"

"అన్నయ్యా, ఏమిటిది? ఏం జరిగిందన్నయ్యా!" అంది మీనా ఏడుస్తూ.

"నేనేమీ తప్పుపని చేయ లేదమ్మా, నా మాట నమ్ము. కొన్ని పరిస్థితులవల్ల ఇలాంటి చిక్కులొచ్చాయి."

"ఇంకా ఎందుకు దాస్తావన్నయ్యా. ఏమిటా పరిస్థితులు? నాకు తెలుసు. చెల్లెలి కాపురం నిలబెట్టాలని ఎన్నడూ ఎరుగని దారుణానికి వడిగట్టావు. అన్యాయంగా నా మూలాన జైలు పాలయ్యావు."

అజయ్, కటకటాలలోంచి చెయ్యిజాచి చెల్లెలి కంటనీరు కొనగోట మీటాడు.

"అధైర్యపడకు మీనా! త్వరలో మళ్ళీ వచ్చేస్తాను."

"ఎప్పుడువస్తావన్నయ్యా, శిక్ష అనుభవించడం పూర్తి అయ్యాకా? పరువు, ప్రతిష్ఠ నట్టేట కలిశాకా?"



అజయ్ పెదిమలపై మందహాసం మెరిసింది- ఈ రెండు శిక్షలూ తానూ, విజయ్ పంచుకుంటున్నారని ఈ పిల్లకి తెలీదు...

"వద్దన్నయ్యా, డబ్బుకోసమేగా ఇంతపని చేశావ్! ఆపాడు డబ్బు తెచ్చేశాను. వాళ్ళమొహాన పారేసి వచ్చెయ్యన్నయ్యా!" అంటూ చెంగుచాటు నుంచి నోట్లకట్టలు తీసింది మీనా. అప్రతిభుడై పోయాడు అజయ్.

"మీనా! ఆ డబ్బు తీసుకొచ్చేశావా! ఎంత పొరపాటుచేశావమ్మా!" అన్నాడు బాధగా.

మీనా తలవంచుకుంది.

"నీ మామ మళ్ళీ నిన్ను ఆ గడప తొక్క నిస్తాడా? మీనా! ఇంతకాలం కన్నీళ్ళతోనే కాపురం చేశావు. ఈనాటికి మన కష్టాలు గట్టెక్కి అత్తవారింటికి సలక్షణంగా వెళ్ళగలిగావు. నీ జీవితాన్ని నువ్వే చేతులారా నాశనం చేసుకుంటావా? వద్దమ్మా వద్దు! నా మాట విను డబ్బు తీసుకెళ్ళి వాళ్ళకిచ్చేయ్!"



"ఏమంటున్నావన్నయ్యా, నిన్ను జైలుకి పంపించి శాశ్వతంగా నువ్వు దొంగవనే ముద్ర వేసిన ఈ డబ్బుతో నా కాపురం నిలబెట్టుకోమంటున్నావా? అన్నయ్యను అగాధంలోకి తోసేసి చెల్లెలు సంసారం చక్కబెట్టు కుంటుందనుకున్నావా? ఇంతకాలం నన్ను భరించడమే కాకుండా నా కోసం ఇంత త్యాగం చేసిన నిన్ను నిస్సహాయంగా వదిలేసి యెలా వెళ్ళాలన్నయ్యా?"

అజయ్ నిరుత్తరుడై తల వంచుకున్నాడు. అప్రతిష్ఠను భరిస్తానని అనడానికి తనకి అధికారం లేదు. అది విజయ్ పేరుకి వస్తుంది...అయినా, విజయ్ మాత్రం కాదంటాడా?



"రండమ్మా టైమైపోయింది" అంది పోలీసు కంఠం.

"అన్నయ్యా!" అంది జవాబు కోసం చూస్తున్న చెల్లెలు. అన్నయ్య మాట్లాడలేదు.

"లేదన్నయ్యా! నా అన్నయ్యను నేను దక్కించు కొనేవరకూ మరో విషయమే ఆలోచించను" అంది మీనా.

'రండమ్మా" అంది పోలీసు కంఠం.

"వెళ్ళిరామ్మా. వెళ్ళిరా." అన్నాడు అజయ్.

*****



పిక్నిక్ నుంచి తిరిగివచ్చిన విజయ్ కారు దిగేసరికి శేషావతారం కొంపమునిగినట్టు ఎదురు పరుగెత్తి, "కొంపమునిగింది బాబూ!" అన్నాడు.

"ఏమిటయ్యా! అన్నాడు" విజయ్ నవ్వుకొని.

"మీలాటివాడేవచ్చి చెక్కుమార్చి డబ్బుకొట్టేశాడు. పోలీసులు అరెస్టుకూడా చేశారు" అన్నాడు విశేషావతారం గుడ్లు తిప్పుకుంటూ.



విజయ్ గుండె ఝల్లుమంది. ఎందుకిది జరిగినట్టు? నిజమా అబద్ధమా అని తేల్చుకోలేక పోయాడు. చరచర లోపలికెళ్ళాడు.

"అజయ్‌బాబూ, పద్మ రాజీనామా యిచ్చింది. ఇవిగో తాళం చెవులు" అన్నాడు భానోజీగారు ఎదురై.

-(ఇంకావుంది)

**ఇద్దరు మిత్రులు కలిసినప్పుడు ఎలావుంటారు ? ఏం చేస్తారు? అని టాకీగా, అసలు షాట్‌కు ముందు సహాయ దర్శకుల చేత నటింపజేసి, షూట్ చేసేవారు. కెమెరా ఫిలింలోని చివర ముక్కలు కత్తిరించి, స్టిల్ స్టూడియోలో అర్జెంటుగా డెవలప్ చేసి, ప్రింట్ చేయించి, ఆరీ ఆరని ఆ ప్రింటుని తెచ్చి, సెట్‌లో అందరికీ చూపేవారు కెమెరా అసిస్టెంట్ రామమూర్తి.(ఫిలిం డెవలప్ అయి, ప్రింట్ చూడాలంటే మర్నాటికి గాని కుదరదు.**

**- కె.వి.రావు (స్వామి చిత్రానంద), చెన్నై**



# తెలుగు సినీ గీత కోశం

| నెం. | పాట | చిత్రం పేరు | సం॥ | సంగీత దర్శకుడు | రచన | గానం |
|---|---|---|---|---|---|---|
| 606 | అందాల నీకు సాటి | కన్నకొడుకు | 1961 | ఎస్.పి.కోదండపాణి | రాంచంద్ | సుశీల |
| 607 | జగమంతా జంటలే | కన్నకొడుకు | 1961 | ఎస్.పి.కోదండపాణి | రాంచంద్ | సుశీల |
| 608 | ఝున్‌ఝున్ కింకిణీ చరణ | కన్నకొడుకు | 1961 | ఎస్.పి.కోదండపాణి | కొంగర జగ్గయ్య | ఘంటసాల |
| 609 | మారదులే నా మాట | కన్నకొడుకు | 1961 | ఎస్.పి.కోదండపాణి | ఆరుద్ర | పి.బి.శ్రీనివాస్ |
| 610 | నా మదిలోని కోరికలు | కన్నకొడుకు | 1961 | ఎస్.పి.కోదండపాణి | ఆరుద్ర | పి.బి.శ్రీనివాస్, సుశీల |
| 611 | పూవులు పాపలు | కన్నకొడుకు | 1961 | ఎస్.పి.కోదండపాణి | రాంచంద్ | పి.బి.శ్రీనివాస్ |
| 612 | సమ్మతమేనా చెప్పవే భామా | కన్నకొడుకు | 1961 | ఎస్.పి.కోదండపాణి | వీటూరి | మాధవపెద్ది, స్వర్ణలత |
| 613 | ఈ రేయి హాయి | కన్నకొడుకు | 1961 | ఎస్.పి.కోదండపాణి | రాంచంద్ | పి.బి.శ్రీనివాస్ |
| 614 | ఇదే ఇదే హాయి | కన్నకొడుకు | 1961 | ఎస్.పి.కోదండపాణి | ఆరుద్ర | ఎ.ఎమ్.రాజా, రాణి |
| 615 | విన్నారా రగిలే ఈ బ్రతుకులోని | కన్నకూతురు | 1973 | ఎమ్.రంగారావు | నారపరెడ్డి | సుశీల, వైదేహి, కోరస్ |
| 616 | ఉయ్యాలో ఉయ్యాల | కన్నకూతురు | 1973 | ఎమ్.రంగారావు | నారపరెడ్డి | సుశీల |
| 617 | ఏమి పేరు పెట్టుదాం | కన్నకూతురు | 1973 | ఎమ్.రంగారావు | నారపరెడ్డి | రాణి, కమల గ్రూప్ |
| 618 | బంగారు మోము కల మారే | కర్ణ | 1964 | విశ్వనాథన్, రామ్మూర్తి ఆర్.గోవర్ధన్ | సి.నారాయణరెడ్డి | సుశీల, బృందం |
| 619 | భువిలో దేహం నిలవదు నమ్మరా | కర్ణ | 1964 | విశ్వనాథన్, రామ్మూర్తి ఆర్.గోవర్ధన్ | సి.నారాయణరెడ్డి | సీర్గలి గోవింద రాజన్ |
| 620 | గాలికి కులమేది ఏది నేలకు కులమేది | కర్ణ | 1964 | విశ్వనాథన్, రామ్మూర్తి ఆర్.గోవర్ధన్ | సి.నారాయణరెడ్డి | సుశీల |
| 621 | కన్నులందే కనపడినదే | కర్ణ | 1964 | విశ్వనాథన్, రామ్మూర్తి ఆర్.గోవర్ధన్ | సి.నారాయణరెడ్డి | సుశీల |
| 622 | నీవు నేను వలచితిమి | కర్ణ | 1964 | విశ్వనాథన్, రామ్మూర్తి ఆర్.గోవర్ధన్ | సి.నారాయణరెడ్డి | బాలమురళీ కృష్ణ, సుశీల |
| 623 | పోవమ్మా ఇక పోయిరా | కర్ణ | 1964 | విశ్వనాథన్, రామ్మూర్తి ఆర్.గోవర్ధన్ | సి.నారాయణరెడ్డి | ఎన్. రాజ్యలక్ష్మి |
| 624 | ఎవ్వరికొరకే ఈ రిది గీతి | కర్ణ | 1964 | విశ్వనాథన్, రామ్మూర్తి ఆర్.గోవర్ధన్ | సి.నారాయణరెడ్డి | సుశీల |
| 625 | ఆ గోపాలుడు లీలా వినోదుడు | కోడలు పిల్ల | 1972 | జి.కె.వెంకటేష్ | అనిసెట్టి | ఎస్.జానకి |
| 626 | నన్ను తాకె ఎవరో | కోడలు పిల్ల | 1972 | జి.కె.వెంకటేష్ | ఆరుద్ర | ఎస్.పి.బాలు |
| 627 | ఓ దేవా నా దేవా | కోడలు పిల్ల | 1972 | జి.కె.వెంకటేష్ | అనిసెట్టి | ఎస్.పి.బాలు, ఎల్.ఆర్.ఈశ్వరి |
| 628 | తండ్రినైన ధర్మం కోసము | కోడలు పిల్ల | 1972 | జి.కె.వెంకటేష్ | ఆరుద్ర | ఎస్.పి.బాలు, ఎల్.ఆర్.ఈశ్వరి, సత్యారావు |
| 629 | ఆశలను జల్లినది | కొడుకులు కోడల్లు | | పామర్తి | శ్రీ.శ్రీ | సుశీల |
| 630 | అన్నయ్య చేసిన పనమ్మ | కొడుకులు కోడల్లు | | పామర్తి | శ్రీ.శ్రీ | ఘంటసాల |
| 631 | నే కవిననబోయి | కొడుకులు కోడల్లు | | పామర్తి | శ్రీ.శ్రీ | ఘంటసాల |
| 632 | ఓ భాయి కలం అంతా లోపల చేత | కొడుకులు కోడల్లు | | పామర్తి | శ్రీ.శ్రీ | మాధవపెద్ది, అప్పారావు, పార్వతి |
| 633 | పూవంటి కన్నె పేరడగలేదే | కొడుకులు కోడల్లు | | పామర్తి | శ్రీ.శ్రీ | ఘంటసాల అప్పారావు |
| 634 | తెలియవు దగాలు | కొడుకులు కోడల్లు | | పామర్తి | శ్రీ.శ్రీ | ఘంటసాల, అప్పారావు |
| 635 | హృదయం పులకించింది | కోయంబత్తూరు ఖైది | | కె.వి.మహదేవన్ | ఆరుద్ర | సుశీల |
| 636 | నీ మనసే కోరి రమ్మంది | కోయంబత్తూరు ఖైది | | కె.వి.మహదేవన్ | ఆరుద్ర | ఎస్.పి.బాలు, సుశీల |
| 637 | వలపుల గొనుమా వెన్నెల గొనుమా | కోయంబత్తూరు ఖైది | | కె.వి.మహదేవన్ | ఆరుద్ర | ఎస్.పి.బాలు, సుశీల |
| 638 | వినరా పక్షి వినరా | కోయంబత్తూరు ఖైది | | కె.వి.మహదేవన్ | ఆరుద్ర | ఎస్.పి.బాలు, పిఠాపురం |
| 639 | హే జననీ కృష్ణవేణి | కృష్ణవేణి | 1974 | విజయభాస్కర్ | సి.నారాయణరెడ్డి | పి.బి.శ్రీనివాస్ |
| 640 | కృష్ణవేణి కృష్ణవేణి | కృష్ణవేణి | 1974 | విజయభాస్కర్ | సి.నారాయణరెడ్డి | రామకృష్ణ, పి.సుశీల |
| 641 | లేదమ్మా నీకు తోడు లేదమ్మా | కృష్ణవేణి | 1974 | విజయభాస్కర్ | గోపి | రామకృష్ణ |
| 642 | పదునాలుగేండ్లు | కృష్ణవేణి | 1974 | విజయభాస్కర్ | దాశరథి | సుశీల |
| 643 | సంగీతం మధుర సంగీతం | కృష్ణవేణి | 1974 | విజయభాస్కర్ | ఆరుద్ర | సుశీల |
| 644 | శ్రీశైల మల్లయ్యా | కృష్ణవేణి | 1974 | విజయభాస్కర్ | కొసరాజు | సుశీల, కోరస్ |
| 645 | ఎందుకో నీవు నాతో | కృష్ణవేణి | 1974 | విజయభాస్కర్ | దాశరథి | రామకృష్ణ, సుశీల |
| 646 | గారడి చేసే నీ కనులు | కులదైవం | 1960 | మాస్టర్‌వేణు | సముద్రాల జూ॥ | సుశీల |
| 647 | కోటు బూటు వేసిన బావ వచ్చెదయ్యా | కులదైవం | 1960 | మాస్టర్‌వేణు | కొసరాజు | జమునారాణి |
| 648 | మనసులో ఒకటుంచి మాటడితేను | కులదైవం | 1960 | మాస్టర్‌వేణు | కొసరాజు | చిత్తరంజన్ |
| 649 | పద పదవే వయ్యారి గాలి పటమా | కులదైవం | 1960 | మాస్టర్‌వేణు | కొసరాజు | ఘంటసాల, జమునారాణి |
| 650 | పయనించే ఓ చిలకా | కులదైవం | 1960 | మాస్టర్‌వేణు | సముద్రాల | ఘంటసాల |
| 651 | రావే రావే వయ్యారి ఓ చెలి | కులదైవం | 1960 | మాస్టర్‌వేణు | సముద్రాల జూ॥ | చిత్తరంజన్ |




| నెం. | పాట | చిత్రం పేరు | సం॥ | సంగీత దర్శకుడు | రచన | గానం |
|---|---|---|---|---|---|---|
| 652 | అయ్యయ్యో జేబులో డబ్బులు పోయెనే | కులగోత్రాలు | 1962 | ఎస్.రాజేశ్వరరావు | కొసరాజు | మాధవపెద్ది, పిఠాపురం |
| 653 | చెలికాడు నిన్నే రమ్మనని పిలువ | కులగోత్రాలు | 1962 | ఎస్.రాజేశ్వరరావు | సి.నారాయణరెడ్డి | ఘంటసాల, సుశీల |
| 654 | చిలిపి కనుల తీయని చెలికాడ | కులగోత్రాలు | 1962 | ఎస్.రాజేశ్వరరావు | సి.నారాయణరెడ్డి | ఘంటసాల, సుశీల |
| 655 | మామ శత్రు భయంకర నామ | కులగోత్రాలు | 1962 | ఎస్.రాజేశ్వరరావు | శ్రీశ్రీ | పి.బి.శ్రీనివాస్, మాధవపెద్ది |
| 656 | ఓ వెన్నెల చిన్నదయ కన్నియే | కులగోత్రాలు | 1962 | ఎస్.రాజేశ్వరరావు | దాశరథి | ఘంటసాల, సుశీల |
| 657 | రావయ్యా రావయ్యా మా ఇంటికి | కులగోత్రాలు | 1962 | ఎస్.రాజేశ్వరరావు | కొసరాజు | ఘంటసాల, సుశీల |
| 658 | రావె రావె బాల | కులగోత్రాలు | 1962 | ఎస్.రాజేశ్వరరావు | కొసరాజు | పి.బి.శ్రీనివాస్, జమునారాణి |
| 659 | శక్తి శకుంతల | కులగోత్రాలు | 1962 | ఎస్.రాజేశ్వరరావు | శ్రీశ్రీ | ఘంటసాల, సుశీల, స్వర్ణలత, రామం |
| 660 | వినుము ప్రియా | కులగోత్రాలు | 1962 | ఎస్.రాజేశ్వరరావు | సి.నారాయణరెడ్డి | సుశీల |
| 661 | పిల్లలు దేముడు చల్లనివారే | లేత మనసులు | 1966 | ఎమ్.ఎస్.విశ్వనాథన్ | ఆరుద్ర | సుశీల |
| 662 | అందాల చెలికాడా | లేత మనసులు | 1966 | ఎమ్.ఎస్.విశ్వనాథన్ | దాశరథి | పి.బి.శ్రీనివాస్, సుశీల |
| 663 | అందాల ఓ చిలకా | లేత మనసులు | 1966 | ఎమ్.ఎస్.విశ్వనాథన్ | దాశరథి | పి.బి.శ్రీనివాస్, సుశీల |
| 664 | హలో మేడమ్ సత్యభామా | లేత మనసులు | 1966 | ఎమ్.ఎస్.విశ్వనాథన్ | దాశరథి | పి.బి.శ్రీనివాస్, సుశీల |
| 665 | కోడి ఒక కోనలో | లేత మనసులు | 1966 | ఎమ్.ఎస్.విశ్వనాథన్ | ఆరుద్ర | సుశీల |
| 666 | మక్కువ దీర్చరా మువ్వ గోపాల | లేత మనసులు | 1966 | ఎమ్.ఎస్.విశ్వనాథన్ | క్షేత్రయ్య | సుశీల |
| 667 | ఏ పువ్వులో ఒక చల్లదనం | లేత మనసులు | 1966 | ఎమ్.ఎస్.విశ్వనాథన్ | దాశరథి | పి.బి.శ్రీనివాస్, సుశీల |
| 668 | ఏడుకొండల పైనుండి | లేత మనసులు | 1966 | ఎమ్.ఎస్.విశ్వనాథన్ | దాశరథి | సుశీల |
| 669 | చక చక పనిచెయి | మా దైవము | 1976 | కె.వి.మహదేవన్ | ఆరుద్ర | సుశీల, కోరస్ |
| 670 | ఒక కులం ఒక మతము | మా దైవము | 1976 | కె.వి.మహదేవన్ | రాజశ్రీ | ఎస్.పి.బాలు |
| 671 | ఏదో ఏదో మనసులో | మా దైవము | 1976 | కె.వి.మహదేవన్ | రాజశ్రీ | ఎస్.పి.బాలు, సుశీల |
| 672 | నా జిలిబిలి పలుకుల | మా ఊరి మొనగాళ్ళు | 1972 | సత్యం | వేటూరి | ఎల్.ఆర్.ఈశ్వరి |
| 673 | పెగ్గు వేసుకో | మా ఊరి మొనగాళ్ళు | 1972 | సత్యం | వేటూరి | ఎల్.ఆర్.ఈశ్వరి |
| 674 | పోరా పోబే పోజుగాడా | మా ఊరి మొనగాళ్ళు | 1972 | సత్యం | కొసరాజు | ఎల్.ఆర్.ఈశ్వరి |
| 675 | వారెవ్వా ఈ చిన్నదంటే | మా ఊరి మొనగాళ్ళు | 1972 | సత్యం | దాశరథి | ఎల్.ఆర్.ఈశ్వరి |
| 676 | వెలిగించు కాంతి జ్యోతి | మా ఊరి మొనగాళ్ళు | 1972 | సత్యం | వేటూరి | సుశీల |
| 677 | చిక్కును విప్పవే చినదానా | మదన కామరాజు కథ | 1962 | రాజన్ నాగేంద్ర | జి.కృష్ణమూర్తి | నాగేంద్ర, జిక్కి |
| 678 | జననీ భద్రకాళి (పద్యం) | మదన కామరాజు కథ | 1962 | రాజన్ నాగేంద్ర | జి.కృష్ణమూర్తి | సుశీల |
| 679 | నా కోటి స్వప్నాలు | మదన కామరాజు కథ | 1962 | రాజన్ నాగేంద్ర | జి.కృష్ణమూర్తి | పి.బి.శ్రీనివాస్ |
| 680 | నీలి మేఘ మాలవో | మదన కామరాజు కథ | 1962 | రాజన్ నాగేంద్ర | జి.కృష్ణమూర్తి | పి.బి.శ్రీనివాస్ |
| 681 | నీలి మేఘ మాలవో | మదన కామరాజు కథ | 1962 | రాజన్ నాగేంద్ర | జి.కృష్ణమూర్తి | పి.బి.శ్రీనివాస్, సుశీల |
| 682 | ఓ ప్రియతమా రావే | మదన కామరాజు కథ | 1962 | రాజన్ నాగేంద్ర | జి.కృష్ణమూర్తి | సుశీల |
| 683 | ప్రేమతో సరి అయినది | మదన కామరాజు కథ | 1962 | రాజన్ నాగేంద్ర | జి.కృష్ణమూర్తి | సుశీల |
| 684 | తేలిపోదామా ఈ హాయిలోనా | మదన కామరాజు కథ | 1962 | రాజన్ నాగేంద్ర | జి.కృష్ణమూర్తి | పి.బి.శ్రీనివాస్, సుశీల |
| 685 | కాగినకొద్ది నీరు ఆవిరౌతుంది | మగాడు | 1976 | కె.వి.మహదేవన్ | సి.నారాయణరెడ్డి | ఎస్.పి.బాలు, సుశీల |
| 686 | కొట్టేసిండు బంగారం లాంటి మనసు | మగాడు | 1976 | కె.వి.మహదేవన్ | సి.నారాయణరెడ్డి | సుశీల |
| 687 | నిన్ను కోరుకున్నాను | మగాడు | 1976 | కె.వి.మహదేవన్ | సి.నారాయణరెడ్డి | ఎస్.పి.బాలు, సుశీల |
| 688 | మాణిక్య వీణ | మహాకవి కాళిదాసు | 1960 | పెండ్యాల | దండకము | ఘంటసాల |
| 689 | ఆ మాటంటే ఎందుకు కోపం | మహాకవి కాళిదాసు | 1960 | పెండ్యాల | పింగళి | మాధవపెద్ది |
| 690 | అవునులే మనసు తెలసి మనసాయే | మహాకవి కాళిదాసు | 1960 | పెండ్యాల | పింగళి | సుశీల |
| 691 | ఛాంగుభళా వెలుగు వెలగరా | మహాకవి కాళిదాసు | 1960 | పెండ్యాల | పింగళి | ఘంటసాల |
| 692 | హలా హలా శకుంతలా | మహాకవి కాళిదాసు | 1960 | పెండ్యాల | పింగళి | ఘంటసాల, పి.లీల మొ॥ |
| 693 | జయ జయ జయ శారదా | మహాకవి కాళిదాసు | 1960 | పెండ్యాల | పింగళి | సుశీల |
| 694 | ఈ విపరీత వియోగం | మహాకవి కాళిదాసు | 1960 | పెండ్యాల | పింగళి | పి.లీల |
| 695 | నాలో నయన నన్నాదమంటే | మహాకవి కాళిదాసు | 1960 | పెండ్యాల | పింగళి | ఘంటసాల, గ్రూప్ |
| 696 | నన్ను చూడు నాకావనం చూడు | మహాకవి కాళిదాసు | 1960 | పెండ్యాల | పింగళి | మాధవపెద్ది, బృందం |
| 697 | నీకెట్లుందో కాని పిల్ల నాకు | మహాకవి కాళిదాసు | 1960 | పెండ్యాల | పింగళి | ఘంటసాల |
| 698 | రసిక రాజమణి | మహాకవి కాళిదాసు | 1960 | పెండ్యాల | పింగళి | పి.లీల, రత్నం |
| 699 | శ్రీకరమగు పరిపాలన నీది | మహాకవి కాళిదాసు | 1960 | పెండ్యాల | పింగళి | పి.లీల |
| 700 | ఎందుకు వేసిన వేషమయ్యా | మహాకవి కాళిదాసు | 1960 | పెండ్యాల | పింగళి | సుశీల |

సేకరణ: పున్నమరాజు శేషగిరిరావు, విశాఖపట్నం.

వచ్చే సంచికలో మరికొన్ని

జూన్ 1 యస్వీ కృష్ణారెడ్డి పుట్టినరోజు సందర్భంగా...

# సమర్థుడైన సైనికుడిలా వుంటాను

**- యస్వీ కృష్ణారెడ్డి**



★ అదృష్టం వరించనప్పుడు, అవకాశం చేజారినపుడు 'అరె' అని అందరూ అనుకొంటూ ఉంటారు. నా దృష్టిలో 'అ' అంటే అచ్చి, 'రె' అంటే రెడ్డి(అంటే అచ్చిరెడ్డి గారి పేరు షార్ట్‌కట్‌లోనన్నమాట). అలా ఆ మాట రూపంలో ఎల్లప్పుడూ మీవెంట ఉంటే అచ్చిరెడ్డి గారి వెంట మీరు ఏ రూపంలో ఉంటారు?

✦ నాలోని బలహీనతలు, బలాలు అతనికి తెలుసు. నాకు వచ్చిన పనిని నాకు తెలియక పోయినా ఎంకరేజ్ చేసి చేయిస్తూ ఉంటాడు. నాకు రాని పనిని నేను చేస్తానన్నా వద్దని ఆపుతూ ఉంటాడు. అతను చెప్పినట్లు చేయడానికి నేను సిద్ధంగా ఉంటాను. కనుక ఒక్క మాటలో చెప్పాలంటే సమర్థుడైన సైనికునిలా అతని వెంట ఉంటాననడం సరిపోతుంది.

★ శ్రామికుడు చేతితో ; చిత్రకారుడు చేయి, మేధస్సుతో; కవి చేయి, మేధస్సు, హృదయంతో పనిచేస్తారు. మరి దర్శకుడు ఎలా పనిచేస్తాడు?

✦ దర్శకుడు రథాన్ని నడిపే కృష్ణుడులాంటివాడు. తాను యుద్ధం చేయడు. తానేమి పరుగెత్తడు, తాను రథసారథి కాదు, కట్టిన గుర్రము కాదు, తాను రథానికి శీల కాదు.



సక్సెస్‌ఫుల్ కాంబినేషన్‌లలో కృష్ణారెడ్డి-చంద్రబోస్ కాంబినేషన్ ఒకటి. సినీ జీవనగీతానికి ఒకరు గుండె అయితే ఒకరు గొంతు. ఆయనంటే ఈయనకి గౌరవం, ఈయనంటే ఆయనకి అభిమానం కనుకనే ఈసారి కృష్ణారెడ్డి పుట్టినరోజు సందర్భంగా ఆయనని ఇంటర్వ్యూ చేయమని 'హాసం' చంద్రబోస్‌ని కోరింది. 'హాసం'పై ప్రేమతో వారిరువురూ స్పందించి అందించిన ఇంటర్వ్యూ యిది:

అంచేత దర్శకుడు ఎప్పుడు గొప్పవాడు అవుతాడంటే తనకన్నా గొప్పవాడైన, తనకన్నా తెలివైన, తనకన్న సమర్థుడైన వ్యక్తుల్ని కాని, శక్తుల్ని కాని సెలక్ట్ చేసుకుని వాళ్ళచేత తనకు ఏది రాబట్టుకోవాలో అది రాబట్టుకొని మన ముందు పెడతాడు అంతే. అందుకే అతని ప్రయాణం సులువుగా సక్సెస్‌ఫుల్‌గా వెళుతూ ఉంటుంది. ఏ మాత్రం అసమర్థుణ్ణి సెలెక్ట్ చేసుకున్నా మిగతా సమర్థులు కూడా దెబ్బతినే ప్రమాదం కూడా ఉంది. కాబట్టి దర్శకుడు తనకన్నా గొప్పవాళ్ళతో పనిచేయించుకునే ఓ సాధారణ ప్రేక్షకుడు.

★ నాకు మూడ్ ఆఫ్ అయితే సెల్ ఆఫ్‌లో పెడ్తాను. మా అబ్బాయికి మూడ్ ఆఫ్ అయితే టీ.వి. ఆఫ్ చేస్తాడు. మరి మీ విషయం...?

✦ నాకు మూడ్ ఆఫ్ అయితే నన్ను నేనే ఆఫ్ చేసుకుంటాను. నిశ్శబ్దంగా కూచుని ఆలోచిస్తూ ఉంటాను అంతే....

★ స్టార్ట్, కెమెరా, యాక్షన్, కట్... వాట్ నెక్స్ట్?

✦ వాట్ నెక్స్ట్ అంటే విచ్ ఈజ్ బెస్ట్...

★ నరమానవులు, పశుపక్ష్యాదులు అసలు ఏ ప్రాణీ సంచరించని ఒక నిర్మానుష్య దీవిలో మీరు ఉండిపోతే మీకు టైంపాస్ అవ్వడానికి దేనిని ఆశ్రయిస్తారు?

✦ అక్కడనుంచి బయటపడటం కోసం ఆలోచించే ఆలోచనకన్నా ఇంక వేరే టైంపాస్ ఉంటుందా? ఇక్కడుంటే రోజుకు కొన్ని వేల లక్షల ప్రశ్నలు ఉంటాయి. ప్రతిదానికి సమాధానం చెప్పుకుంటూ మనం ముందుకు వెళ్ళిపోతాం. అక్కడ ఒక్కటే ప్రశ్న... అక్కడనుంచి బయటపడటం ఎలాగా? సమాధానం లేని ఒక ప్రశ్న కోసం నిద్రాహారాలు లేక బుర్ర జోరీగలాగ జుయ్.... మంటూ జవాబు కోసం మనసుని పరుగెత్తిస్తుంది. అందుకని అంతకన్నా గొప్ప క్వొశ్చన్ ఇంకోటి వుంటుందా?

★ సినిమా గొప్పదా? ఇంటర్నెట్ గొప్పదా?

✦ సినిమా ఇంటరెస్టు ఎదుటివారిమీద ఆధారపడి ఉంటుంది. ఇంటర్నెట్‌కు సంబంధించింది మనమీద ఆధారపడి ఉంటుంది. ఇంటర్నెట్‌కు మనమే డైరెక్టరు. మనకొక ఇన్‌ఫర్మేషన్ నచ్చిందనుకోండి అందులోకి మారిపోవచ్చు. అందులో నచ్చింది కంపోజ్ చేసుకుంటూ లోపలికి వెళుతూంటాం. సినిమా ప్రేక్షకుడు ఇంటర్నెట్‌కు దర్శకుడు కావచ్చు. ఎందుకంటే నచ్చకపోతే వేరేదానిలోకి మారిపోతుంటాడు - టి.వి.ఛానల్ మార్చినట్టు! ముందు ముందు సినిమా నిర్మాణంలో ఇంటర్నెట్ కూడా ప్రధాన పాత్ర వహిస్తుంది.

★ ఆత్రేయ గారి గురించి మీ మాటల్లో... మీరు ఆయన్ని కలిసిన సందర్భాలు, ఆయన మాటలిచ్చిన స్ఫూర్తివలన వచ్చిన సందర్భాలు, సంఘటనలు చెప్తారా?

✦ ఒకటి కాదండి చాలా ఉన్నాయి. నేను ఆయనతో ఇంటరాక్ట్ అయి మాట్లాడటం చాలా తక్కువండి. కాని ఆయన గురించి తెలుసుకున్నది చాలా ఎక్కువ. ఒకటి రెండుసార్లు మాట్లాడాను. ఆయన ఎంతో సరదాగా మాట్లాడినా ఆ మాటల్లో ఏదో 'పంచ్' ఉండేది. లాజిక్ ఉండేది. ఆఖరికి తనమీద తానే జోక్ వేసుకునేవాడు. ఒక్కొక్కసారి హార్ట్ టచింగ్‌గా కూడా మాట్లాడేవారాయన. నేను ఆయన గురించి ఆయన పాటల గురించి స్టడీ చేసింది ఎక్కువ కాబట్టి ఆ పాటలు నన్ను బాగా ఆకట్టుకున్నాయి. అందుకనే ఎవరు ఆత్రేయకి దగ్గరగా రాయగలగితే వారు నా దృష్టిలో చాలా గొప్ప రైటరని ఫీలయి పోతాను.డైలాగ్స్ విషయంలో దివాకర్‌బాబు విషయంలో కూడా నేను ఇలాగే మెచ్చుకున్నాను. ఈ మధ్యకాలంలో పాటల విషయంలో చంద్రబోస్ పేరు ఎత్తుతున్నాను.



★ నవ్వుకి, ఏడుపుకి, కళ్ళకి ఎలాంటి సంబంధం ఉంటుంది? నవ్వినా ఏడ్చినా కన్నీళ్ళే వస్తాయి కారణం చెప్తారా?

✦ కళ్ళకి ఒక గొప్ప శక్తి ఉందండి. చూసిని దృశ్యాన్ని కాకుండా చూడని దృశ్యాన్ని కూడా చూడగలదు. కళ్ళు మనముందు ఉండే దృశ్యాన్నే కాకుండా మెదడులోని దృశ్యాలను కూడా చూస్తాయి. మెదడులోని దృశ్యాలను చూసే కళ్ళలో గుండెకాయ ఉంటుంది. అందుకనే గుండెకి కళ్ళకి సంబంధం ఉంటుంది. కాబట్టి మెదడు తడిస్తే అంటే గుండె తడిస్తే ఆ తడి కళ్ళలోంచే బయటకొస్తుంది. అది ఆనందమయినా సరే దుఃఖమయినా సరే. ఆత్రేయ గారి పదాల్లో చెప్పాలంటే మనసెక్కడుంటుంది అని వెతుక్కుంటూ చూడండి. "కనపడని ఒక మనసు అది కళ్ళ వెనకాల పొరల్లో ఉంటుంది" అది ప్రతిదాన్ని చూడగలదు. కన్నీళ్ళ ద్వారా ఎక్స్‌ప్రెషన్ తెలియజేస్తుంది. అది నవ్వయినా, ఏడుపయినా సరే.

★ ఏ రంగంలోనైనా, ఏ దేశంలోనైనా వారికివారే సాటి! వారితో ఎవరిని పోల్చలేము! అని చెప్పగలిగేటంతటి వారు మీకు తెలిసి ఎవరున్నారు?

✦ ప్రపంచం మొత్తం ఒప్పుకున్న పదమైతే మధర్‌థెరిస్సా. ఈ పేరుకుమించిన తిరుగున్న పేరు ఇంకోటిలేదు. ఎందుకంటే ఆమెకు ఆమెనే సాటి. గ్రేట్.

★ నేను కృష్ణారెడ్డిలా మీరు చంద్రబోస్ అయితే ఏమి చేస్తారు?

✦ కుర్చీలు మారి ఇటు అటు కూర్చుంటాం తప్ప అంతకుమించి ఏమి చేస్తాం! నా పనులు మీరు చేస్తారు. మీ పనులు నేను చేస్తాను. నేను ఇంతకు ముందు కృష్ణారెడ్డినే కానీ నాలో ఇప్పుడు చంద్రబోస్ ఉన్నాడు అని నేను ఫీలయ్యాననుకోండి... అక్కడనుండి నేను పాటరాయడానికి ట్రై చేస్తాను. అపుడు నాకు తెలిసిపోతుంది నేను చంద్రబోస్‌ను కాదని. ఆ పాట అలా రాయటం అనేది నావల్ల జరిగే పనికాదు. అందువల్ల నేను ఏమి చేస్తానంటే.... "చంద్రబోస్ గారూ మీరు కృష్ణారెడ్డి అని భ్రమ పడుతున్నారు... కాదు. కృష్ణారెడ్డిని నేనే. చంద్రబోస్‌నై మిమ్మల్ని పూర్తిగా ఉపయోగించు కోలేక పోతున్నాను. అద్భుతమైన రైటర్‌ని మీ దగ్గరే పెట్టుకుని నాకు మంచి పాటలు ఇవ్వండి" అని నేను మిమ్మల్ని నానుంచి మీకప్పచెప్పి ఆ ఎక్స్ట్రార్డినరీ సాంగ్స్ నేను తీసుకుంటానండి. ■















బుడుగులావు
సత్యమూర్తి
రావుగారు మీతో ఒక ముఖ్య విషయం మాట్లాడాలి...
ఆహా! ఏమి నా భాగ్యము
ఆ కొండ మీద పార్క్ ఉంది కదా? అక్కడికి రేపు సాయంకాలం వస్తే మాట్లాడుకుందాం
అలాగా...? ఎన్ని గంటలకి?
ఏడు గంటలకి కొండ కింద వెయిట్ చెయ్యండి. నేను వచ్చాక కలిసి వెళ్దాం
మర్నాడు సాయంకాలం
మా తాతయ్య వస్తానని సరదా పడితే కూడా తీసుకొచ్చాను
పైకి 5 నిమిషాలు మెట్లెక్కాక....
రావుగారు.. ఇదివరకు మనం పైకెళ్ళడానికి కంచర గాడిదలుండేవి. అవి ఉంటే మీకీ శ్రమనిచ్చేదాన్నికాదు

జూన్ 10 ఇవీవి పుట్టినరోజు సందర్భంగా...



# నారా చంద్రబాబు నాయుడ్ని పర్మినెంట్ సి.ఎం.గా చేసేస్తా



## - ఇ.వి.వి.

'ప్రేమదేశం' లాగ ఆయనది హాస్యదేశం. ఆఫ్ఘనిస్తాన్, బెలూచిస్థాన్ లాగ ఆ దేశం పేరు నవ్విస్తాన్.
ఎంతటి వారినైనా సరే 'నవ్విస్తాన్' అంటూ నవ్వించడమే పనిగా పెట్టుకున్న దర్శకుడు ఇవీవి మనసుకి దగ్గరగా వచ్చిన రచయితలలో జనార్ధన మహర్షి ఒకరు. అందుకే ఈసారి ఇవీవి పుట్టినరోజుకి ఆయనను ఇంటర్వ్యూ చేసే బాధ్యతను స్వీకరించమని 'హాసం' జనార్ధన మహర్షిని కోరింది.
'హాసం'పై ప్రేమతో వారిరువురూ మీ ముందుంచిన జనార్ధన్ ప్రశ్నలకు (ఇవీవి) ధనాధన్ సమాధానాలివి.

✦ మీ పుట్టిన రోజు?
★ జూన్ 10
✦ ఏ సంవత్సరం?
★ ప్రతి సంవత్సరం
✦ ఎందుకు పుట్టారు?
★ మా ఆవిడ్ని కట్టుకుందామని...మంచి సినిమాలు తీసి పదిమందినీ ఆకట్టుకుందామని
✦ ఏం చదివారు?
★ ఈనాడు, వార్త, ఆంధ్రజ్యోతి
✦ సినిమా ఫీల్డ్‌కి ఎందుకొచ్చారు?
★ 'ఫీల్డే' కదా దున్నేద్దామని (సినిమాలలోకి రాకముందు ట్రాక్టర్‌తో పొలం దున్నేవాడ్ని)
✦ పెళ్ళెందుకు చేసుకున్నారు?
★ ఆర్యన్‌ని,నరేష్‌ని కందామని
✦ వాళ్లనెందుకు హీరోల్ని చేసారు?
★ చేతిలో ఎప్పుడూ ఇద్దరు హీరోలుంటారని
✦ మీ తొలి చిత్రానికి 'చెవిలో పువ్వు' అని ఎందుకు పెట్టారు?
★ నాకు పెడతారని తెలీక...
✦ రెండో చిత్రానికి 'ప్రేమఖైదీ' అని ఎందుకుపెట్టారు?
★ ప్రేక్షకుల గుండెల్లో ప్రేమగా ఖైదీని అవ్వాలని
✦ మీరు భలే '420' అండీ?
★ కాబట్టే 42 సినిమాలు తీసాను.
✦ మీ చిత్రాలకు టైటిల్స్ ఏంటీ...ఎప్పుడూ విచిత్రంగా పెడతారు?
★ చిత్ర, విచిత్రంగా ఉండాలని
✦ మీరు బోలెడు మంది హీరోయిన్స్‌ని పరిచయం చేసారు...కారణం ఏంటంటారు?
★ ఫ్రెష్‌గా ఉండాలని
✦ మరి కమెడియన్స్‌ని కూడా చాలామందిని ఇంట్రడ్యూస్ చేశారు.
★ నామీద జోకులేసే కమెడియన్స్‌ని... ఏడిపించాలని
✦ మీరు ప్రతి సినిమాకి ఫారిన్ ఎందుకెళతారు?
★ పగలు షూటింగ్, నైట్ షాపింగ్స్ .... చేసుకుందామని
✦ మీకు నచ్చిన హీరో?
★ ఎవరు ముందు డేట్స్ ఇస్తే వాళ్ళు
✦ మీరెవరైనా హీరోయిన్‌ని గిల్లారా?
★ రెండు మూడు సార్లు టైటానిక్ హీరోయిన్‌ని గిల్లాను (కలలో)
✦ కలలో సరే మరి 'లోకల్'లో?
★ ఆ ఒక్కటి అడక్కు
✦ 'ఏమండీ... ఆవిడొచ్చింది' అని 'ఎవరి' గురించైనా మీతో మీవాళ్ళు అన్నారా?
★ ప్రతిరోజూ మా అసిస్టెంట్ డైరెక్టర్స్ అంటూనే ఉంటారు - హీరోయిన్స్ వచ్చినప్పుడు.
✦ మీకెలాంటి కథలంటే ఇష్టం?
★ మా ఆవిడకి చెప్పే కట్టు కథలు
✦ మీకెలాంటి సినిమాలంటే ఇష్టం?
★ వందరోజుల సినిమాలంటే
✦ మీకు నచ్చిన డైరెక్టర్...
★ ఇ.వి.వి. సత్యనారాయణ
✦ ఆయన కాకుండా... ఇంకా...?
★ ఫ్లాప్‌లు ఇచ్చే ప్రతి డైరెక్టరూ
✦ అదేంటి?
★ అది తీసి అతను... అది చూసి నేను... ఒళ్ళు దగ్గరపెట్టుకుని సిన్మా తీస్తాం కాబట్టి.
✦ ఖాళీ టైంలో ఏంచేస్తుంటారు?
★ 'ఖాళీ'గా ఉంటాను.
✦ మీరు సినిమాల్లోకి రాకపోయి ఉంటే?
★ మీకీ ఇంటర్వ్యూ తీసుకునే అవకాశం దొరికేది కాదు
✦ మీ 'డైలాగ్స్' ఏంటి వెరైటిగా ఉంటాయి?
★ 'రొటీన్'గా ఉండకూడదని
✦ మీరు ఇద్దరు పెళ్ళాల మీద చాలా సిన్మాలు తీశారు- మీకిద్దరంటే ఇష్టమా?
★ 'ఆయనకిద్దరు' సిన్మా- చూడలేదా? ... ఇద్దరికి ఇద్దరుంటే ఓకే కానీ ... ఒకళ్ళకి ఇద్దరు ఉండకూడదు.



✦ మీరు చాలా సినిమాల్లో 'తాళి'ని తెంచారు... కామెంట్?

✯ పదికాలాలపాటు తీసినోడి, కొన్నోడి భార్యమెడలో 'తాళి' పవిత్రంగా ఉండాలని.

✦ మీరు తీసిన సిన్మాల్లో... మీకు బాగా నచ్చిన సినిమా?

✯ ఆమె.

✦ 'ఆమె' అంటే మీకంత ఇష్టమా?

✯ బాగా.

✦ మీరు నిర్మాతెందుకయ్యారు?

✯ ఇ.వి.వి.ని డైరెక్టరుగా పెట్టుకుందామని.

✦ నిర్మాత... దర్శకుడిలో ఎవరు గొప్ప?

✯ తిండెట్టేవాడు కాబట్టి నిర్మాతే

✦ మీకు నచ్చిన నిర్మాత?

✯ నా 'రామానాయుడుగారు'

✦ మీకు నచ్చిన హాస్యనటుడు?

✯ మా 'అప్పుల అప్పారావు'

✦ మీకు నచ్చిన హాస్య నటి?

✯ మన 'కోవై సరళ'

✦ మీకు నచ్చని వాళ్ళు?

✯ బ్రేక్ టైంలో వచ్చి నిద్రపోనివ్వని వాళ్ళు

✦ మీకు నచ్చే వాళ్ళు?

✯ రికార్డ్ బ్రేక్ చేసే సినిమాలు తీసి నిద్రపోనివ్వని వాళ్ళు

✦ మీకిష్టమైన పువ్వు?

✯ కంట్లో పువ్వు

✦ మీకిష్టమైన ప్లేస్?

✯ స్పేస్.

✦ మీకిష్టమైన పండు?

✯ చింతపండు..

✦ మీకిష్టమైన దేవుడు?

✯ నాతో సిన్మాతీసే ప్రతి ప్రొడ్యూసర్ దేవుడే

✦ మగాడికి పెళ్ళి అవసరమా?

✯ ఒకసారి అయ్యాక... అనవసరం

✦ మగాడికి డబ్బు అవసరమా?

✯ ఆరేడు తరాలకి సరిపడే సంపాదించాక.. అనవసరం.

✦ పెళ్ళాం మాట మొగుడు వినాలా? మొగుడి మాట పెళ్ళాం వినాలా?

✯ బెడ్‌రూం వరకూ భార్యమాట వింటున్నట్టు భర్త నటించాలి. బైట భర్తమాటే వింటున్నట్టు భార్య జీవించాలి.

✦ ఈ ప్రపంచంలో అందమైనది?

✯ మా అమ్మ....

✦ బిన్‌లాడెన్ వచ్చి సిన్మా తీయమంటే తీస్తారా?

✯ వందకోట్లు ఖర్చుపెట్టించి సూపర్ ఫ్లాప్ తీస్తాను.

✦ మీరు ఒక్కరోజు సి.ఎం. అయితే?

✯ నారా చంద్రబాబునాయుడ్ని పర్మనెంట్ సి.ఎం.గా చేసేస్తా.

✦ 'యూత్'కి మీరిచ్చే సలహా?

✯ వెధవ వేషాలు వెయ్యద్దు.

✦ మిమ్మల్ని కామెంట్ చేసేవాళ్ళపై కామెంట్?

✯ మన బెస్ట్ ఫ్రెండ్స్ వాళ్లే... నా ఈ ఎదుగుదలకి వాళ్ళే కారణం.

✦ చివరిగా ఏవైనా రెండు ముక్కలు చెప్పండి?

✯ బై... బై...

# అవన్నీ వింటూపోతే మనం చెయ్యదల్చుకున్నది చెయ్యలేం

**- చక్రి**



జూన్ 15... నేటి తరానికి ఇష్టమైన సంగీత దర్శకుడు చక్రి పుట్టినరోజు. పాత్రికేయునిగా హైదరాబాద్‌లో అడుగుపెట్టి సినీ గీత రచయితగా గుర్తింపు తెచ్చుకున్న భాస్కరభట్ల రవికుమార్ అంటే చక్రికి ఎంతో ఇష్టం. అంచేత 'హాసం' తరపున రవికుమార్ ఈ ఇంటర్వ్యూ చేస్తే అందరికీ మరింత ఇష్టంగా ఉంటుందని ప్లాన్ చేయటం జరిగింది. చక్రి స్వరపరిచిన సినీ గీతాల పల్లవులతో ప్రశ్నలడిగి సమాధానాలు రాబట్టడం భాస్కరభట్ల రవికుమార్ చేసిన తమాషా... చూడండి.

☆ 'చూపుల్తో గుచ్చి గుచ్చి చంపకే మేరే హాయ్...' అని ఏ అమ్మాయినైనా ఉద్దేశించి పాడడం జరిగిందా?

✱ చాలాసార్లు పాడాను. లేకపోతే మద్రాస్ 'ఐ' (అంటే తెలుసుగా 'కళ్ళకలక') వస్తుందేమోనని చిన్న భయం. అందుకేనేమో 'కళ్ళు కళ్ళు కలుసుకుంటె డింగ్ డింగ్ డింగ్' అంటారు. ఆ 'డింగ్ డింగ్ డింగ్' కి అర్థం బహుశా కళ్ళకలకే అయివుంటుంది కదూ!

☆ 'చేసింది ఒకే చేసేది ఒకే, మనము ఎపుడూ ఒకే ఒకే' అని ఎప్పుడైనా అనుకున్నారా?

✱ ఎప్పుడోకాదు, ఎప్పుడూ నేను నమ్మే సిద్ధాంతమే అది. నేనే కాదు నాకు తెలిసి ఎవరైనా ఇలాగే అనుకోవాలి. ఆ కమిట్‌మెంట్ లేకపోతే ఒక్కొకరూ ఒక్కో అభిప్రాయాన్ని మన దగ్గర ఎక్స్‌ప్రెస్ చేస్తుంటారు. అవన్నీ వింటూపోతే మనం చెయ్యదలచుకున్న పని చెయ్యలేం. ఆ క్షణంలో మన మనసుకు ఏది ఒకే అనిపిస్తే అదే చెయ్యాలి. నేనైతే అలాగే చేస్తాను.

☆ 'ఒకరికి ఒకరై తోడుగవుంటే ఎంతటి ఆనందం...' ఇది ఎంతవరకూ కరెక్ట్ అంటారు?

✱ నూటికి నూరు పాళ్ళూ కరెక్టే. నిశ్శబ్దాన్ని ఛేదించాలంటే తప్పకుండా మరో మనిషి సాయం అవసరం. 'చిలకా ఏ తోడులేకా ఎటేపమ్మ ఒంటరి నడక'లా కాకుండా పదిమంది ఫ్రెండ్స్ మధ్య సందడిగా వుండడం నాకిష్టం. నా కష్టాల్నీ సుఖాల్నీ నేను ఎక్కువగా నా ఫ్రెండ్స్‌తోనే పంచుకుంటాను. అందుకే కదా మీరంతా సరదాగా 'చక్రికి ఫ్రెండ్స్ ఎక్కువ ఫండ్స్ తక్కువ' అని అంటారు.

☆ 'హ్యాపీడే....హ్యాపీడే...' పాట- జీవితంలో మీకు ఎప్పుడు బాగా సింక్ అయిందంటారు?

✱ పూరీ జగన్నాథ్ గారు నా ట్యూన్స్ విని 'బాచి' సినిమాతో నన్ను మ్యూజిక్ డైరెక్టర్‌ని చేసిన రోజున నా ఫీలింగ్ సరిగ్గా ఇంతే. అంత హేపీడే మరొకటి లేదేమో నాకు.

☆ 'పిల్లో పిసినారి పిల్లో...' అని ఏ అమ్మాయినైనా చూసినప్పుడు కామెంట్ చేశారా?

✱ నేను కాదు గానీ, మా ఫ్రెండొకరు ఇలా అనుకున్నాట్ట. ముక్కూమొహం తెలియని ఓ అమ్మాయి బస్టాప్ దగ్గర కలిసి సరదాగా లైఫ్ స్టయిల్‌కి వెళదామా? అనడిగిందట. మా వాడు ఆనందంతో ఉబ్బితబ్బిబ్బైపోయి 'వైనాట్' అన్నాట్ట. షాపింగ్ అంతా పూర్తిచేసుకుని 'సారీ... పర్స్ మర్చిపోయాను. బిల్ మీరే పే చేస్తారా?' అందట ఆమె కూల్‌గా- కేక్ తింటూ... మా వాడు మాత్రం షాక్ తిన్నాట్ట.

☆ 'నీవే నీవే నీవే నేనంటా... నీవే లేకా నేనే లేనంటా' అని 'అమ్మ నాన్న ఓ తమిళ అమ్మాయి'లో రవితేజ టైపులో మీ అమ్మగారి గురించి మీరు ఎప్పుడైనా ప్రేమగా పాడారా?

✱ మా అమ్మంటే నాకు విపరీతమైన ఇష్టం. కానీ నేను ప్రొఫెషన్‌లో బిజీగా వుండడం వల్ల అమ్మతో ఫోన్లో మాట్లాడడం తప్ప, ముఖాముఖీ మాట్లాడడం కుదరట్లేదు. ఇక పాట పాడే వీలేది? ఇది నా గుండెల్లో ఓ మూల బాధగానే అనిపిస్తుంది.

☆ నిజం చెప్పండి... 'నిజం చెప్పమంటే నాకిష్టం నువ్వంటే' అని ఇప్పటిదాకా మీతో ఎంతమంది అని వుంటారు?

✱ చాలామంది డైరెక్టర్లు, ప్రొడ్యూసర్లు నా గురించి ఇలా అనుకోకపోతే నేను ఇవ్వాళ ఈ పొజిషన్‌కి చేరుకునేవాణ్ణే కాదు. ఇది నిజంగా నిజం!

☆ 'సుబ్బారావూ... సుబ్బారావూ స్నానం గానీ చేశావా'?

✱ మీకే డౌటూ అక్కర్లేదు. ఈరోజు అప్పుడే రెండుసార్లు స్నానం చేసి స్ప్రే కొట్టుకున్నాను. అన్నట్టు మీ ఏరియాలో వాటర్ ప్రాబ్లమని విన్నాను. మరి మీరో...?

☆ లంచ్‌కొస్తావా? అని మిమ్మల్ని ఇన్వైట్ చేస్తే?

✱ భోజనం విషయంలో టైం మెయిన్‌టెయిన్ చేయడం నాకు అస్సలు అలవాటులేదు. లంచ్ టైంకి పిలిస్తే మొన్న మీ ఇంటికి డిన్నర్ టైంకి రాలేదూ? అందుకే లంచ్‌కొస్తావా అని సాహసం చేసి అడిగేవాళ్ళు చాలా తక్కువనే చెప్పొచ్చు.

☆ 'ఓస్సామరీ ఓస్సామరీ పైసాలె మనిషి ఊపిరి...' ఇలా ఎప్పుడనిపించింది?

✱ బతుకుతెరువు కోసం మా ఊరునుంచి హైదరాబాద్ వచ్చిన మొదట్లో ఓ ప్రైవేట్ హాస్పిటల్‌లో రిప్రజంటేటివ్‌గా పనిచేశాను. జీతం బాగా తక్కువ కాబట్టి, ఎంత దూరమైనా నడుస్తూనే వెళ్ళేవాణ్ణి. నా పక్కనుండి బైక్‌ల మీద స్పీడ్‌గా వెళ్ళేవాళ్ళను చూస్తూ నేనూ ఓ బైక్ కొనుక్కుంటే భలే వుంటుంది కదా అనుకునేవాణ్ణి. కానీ జేబులో డబ్బుల్లేక ఉస్సూరుమనిపించేది.

☆ వెన్నెల్లో హాయ్ హాయ్...?

✱ నా కెరీర్‌ను మరింత 'హాయి'గా చేసిన పాట ఇది. ఈ పాట తరువాత నేను ఎక్కడికెళ్ళినా అందరూ గుర్తుపట్టి 'హాయ్' అని అభిమానంగా పలకరిస్తున్నారు. ■



**రచన: త్రివిక్రమ్ శ్రీనివాస్ (1) గానం : చక్రి**

ప: స్వరాల వీణ ఈ వేళలోన నీకేమైందే ఆకాశమా ॥2॥
ఎండలో ఇలా పూల వానలా
మెరుపు కూడా మల్లె తీగలా
నేలపై ఇలా నా అడుగు నిలవదా...
లోకమంతా కొత్త చోటులా
నువ్వు తప్ప కళ్లముందు లేరు ఎవరు నమ్మవా.... ॥స్వరాల॥
చ: రేయి చీర కప్పుకున్న చందమామని
నిన్ను చూసి ఒక్కసారి పలకరించి వెళ్లనీ...
తారలన్నీ అల్లుకున్న మేఘమాలని
వాలు కళ్ల సాగరాన కాటుకల్లే మారనీ..
వాలే పొద్దులా జారే నీ జడ నడుముపై నాట్యమే ఆడితే
విరిసే పూవులా కురిసే మంచులా నువ్వలా చల్లగా నవ్వితే
నేను చూడలేను చూసాక ఆగలేను
ఎన్నాళ్ళు నిన్నువదిలి వుండను... ॥స్వరాల॥
ల లా ల
చ: మూసి వున్న రెప్పలల్లో కలల వనంలా
నిదుర రాని వెళలోన కలవరింతలాయెలే
ఊపిరంతా ఊహలతో నిండి పోయినా....
గుండెలోన నిన్ను ఇంక దాచి వుంచడం ఎలా
నేనే నేనుగా లేనేలేనుగా
తాకే వింతగా వుందిగా
నీలా ఎవ్వరూ నన్నే ఎప్పడూ కమ్ముకో లేదులే ఇంతలా
రేయి నిదుర రాదు పగలంతా కునుకు లేదు
అసలేమైందో నాకే తెలియదూ ॥స్వరాల॥

**రచన: త్రివిక్రమ్ శ్రీనివాస్ (2) గానం : చక్రి, కౌసల్య**

అ: వెన్నెలే నువ్వనీ విరహమే నేనని
ఆ: తూరుపే నీవని వేకువే నేనని
అ: కెరటమై పొంగితే తీరమై తాకనా
ఆ: చినుకులా రాలితే.... చిగురునై నవ్వనా
అ: కలగనే వేళ నిదురైరానా వాలే కళ్లలో ॥వెన్నెలే॥
అ: నువ్వలా చిలిపి నవ్వులా
విరిసి పూవుగా మారిన వేళలో
ఆ: వలపు గువ్వలా ఎగిరి గుండెలు



అ: నీ కోసమే నేను ఉన్నానని...
ఆ: నీతోనే నేనెప్పడు ఉంటానని...
అ: రెప్పల్లో స్వప్నాలనే దాచినా...
ఊపిరిలో ఊహలని నిజమనుకోనా
ఆ: చినుకయి నే మేఘంలా
నీ కోసం దిగి రాలేనా... నీ కోసం దిగిరాలేనా
అ: నే మేనిలో కొన్న మెరుపేదని...
హరివిల్లు వరనాలనే అడగనీ.....
ఆ: నీ చేతిలో వున్న చొరవేదని..
చిరుగాలితో చెట్టు చెప్పిందని
అ: నీ కళ్లలో వెన్నెలుంటుందనీ....
ఆ: నీ నవ్వుతో వెలుగు పుడుతుందని....
అ: విరహాలు శిశిరాలు నన్నాపినా..
వాసంతమై నిన్ను కనుగొనలేనా.. ॥నిదురించే॥

**రచన: త్రివిక్రమ్ శ్రీనివాస్ (6) గానం : చక్రి**

ప: నా ప్రాణం నా ప్రణయం నాలోకం అన్నీ నువ్వే.....
నా మౌనం నా గానం నా గుండెల సవ్వడి నువ్వే....
నువ్వే ఆశ..... నువ్వే శ్వాస......
నువ్వులేని ఈ నిమిషం యుగమైనా అవదుగా ॥నా॥
చ: నాలో వున్న నిన్ను మరిచేపోలేని నేను
తీరం లేని అలలా నిజమే కాలేని కలలా
నాలోని లేని నేను కలవాలంటూనే నిన్ను
నీరే లేని నదిలా కన్నీరై ఉన్న మదిలా
వర్షం కోరి ఎండే చూసి మండే భూమిలా....
ప్రేమే కోరి విరహం చూసి మిగిలా నేనిలా
వేరే దారి చూపే వేళ నిన్నే చేరుకోనా..... ॥నా॥
చ: నీ కౌగిళ్లలోనే కాలం మాయమవనీ...
నీ వేడి ఊపిరిలో ఇక నన్నే కరిగిపోనీ...
నా ప్రతి అడుగులోనూ వెంటాడే జ్ఞాపకాలు
నువ్వే లేని నాడు చనిపోయే వరము చాలు
వెళ్లేదారి ముళ్లే చల్లి నన్నే ఆపితే
నీళ్లే మారి నిప్పై పొంగి నన్నే ముంచితే
గాలే జాలి చూపే వేళ పువ్వై చేరుకోనా ॥నా॥



**రచన: వెన్నెలకంటి (1) గానం : మల్లికార్జున్, గోపికాపూర్ణిమ**

అ : పడమటి సంధ్యారాగం నీ చిరునవ్వయ్యింది ॥2॥
తూరుపు వెచ్చని కిరణం చిరుజ్యోతిగ వెలిగింది.
మాటెరుగని ఒక మౌనం ఇది... ఓ...ఓ...ఓ...
మనసెరిగిన ఎదగానం ఇది... ఓ... ఓ... ఓ... ॥పడమటి॥
అ : నీ చూపులోనే నా ప్రాణము
ఆ: నీ ఊహలోనే నా లోకము
అ : నీ కళ్లలోనే నా స్వప్నము
ఆ: ఇక నీవున్న చోటే నా స్వర్గము
అ : నిదుర కాచు ఎద ఎదురుచూచు కథ ఎన్నాళ్లు సాగేనిలా
వెదురు వేణువై మధురగానమై మదిలోన మోగేనిలా
ఆ : గొంతు మూగబోయింది గుండె ఊసులాడింది
తలపు నాదమయ్యిందీ వలపు వేదమయ్యిందీ
ఇ : ప్రేమన్నదే మన భాషైనదీ... ఓ...ఓ...ఓ.... ॥పడమటి॥
అ : నీ వున్న చోటే నీరెండగా
ఆ : ఇక నీవన్న మాటే నా గుండెగా
అ : నా గుండెలోనే నీవుండగా
ఆ : ఇక రెండన్నమాటే లేకుండగా
అ : వేసవైన సిరివెన్నెలల్లె అనిపించేను నీ చెంతలో
చీకటింట తొలి వేకువేదో కనిపించేను పులకింతలో
ఆ : నువ్వు వీణవే అయితే నేను తీగనే కానా
నువ్వు వేణువే అయితే నేను రాగమైపోనా
ఇ : నీ ఆశనై నే శ్వాసించనా... ఓ...ఓ...ఓ... ॥పడమటి॥

**రచన: జొన్నవిత్తుల (2) గానం : రాజేష్, మల్లికార్జున్, రఘుకుంచే, విశ్వ, వేణుమాధవ్**

రూపీ లేకపోతే హేపీ ఎవ్వరూ పెట్టలేరు టోపీ ॥2॥
లైఫులో రాదు ఏ జీపీ ఇదేరా సోదరా ఫిలాసఫీ ॥2॥ ॥రూపీ॥
సేల్సుటాక్సు బెడదలేదు ఇన్‌కంటాక్సు గొడవలేదు
హౌస్‌టాక్సు అసలు లేదు వాటరు టాక్సు ప్రశ్నలేదు
ఏసీ లేదు కనుక రాదు సైనసైటిసూ
క్యాషు లేకపోతే ఇంక వ్యసనాలే మైనసూ
రెక్కాడితే డొక్కాడును కనుకరాదు వీక్‌నుసూ
పేదరికం పెద్ద ప్లెస్సూ దేశం మీద ప్రామిస్సూ
మనదేశం మీద ప్రామిస్సూ ॥రూపీ॥
శ్రీరామనవమికీ - వినాయక చవితికీ



ఆ: వలపంత బలమస్తూ హే....
అ: బాపూని కాపీని చేసి ఆ బ్రహ్మే నీకిచ్చె కులుకూ
ఆ: ఆ ముళ్లపూడింటదూలీ కాజేసి నీకిచ్చె పలుకూ
అ: నీ చిలిపి చూపు ఇక చాలూ వలపు కాపురాలూ
ఆ: ఒళ్లంతటా - విరివీణలూ - వినిపించు సుస్వరాలూ
అ: కాలినూపురాలూ - గాలి గోపురాలూ
ఆ: నా తోటకే యువరాజువీ నీవేలె వేలపూలూ ॥హే శ్రీరస్తూ॥
ఆ: అందాల ఈ ముద్దబంతీ మొదలంది ఇక ముద్దుబంతీ
అ: కనుచెదురు నీ కనుల సోకూ ములుకుదురు చిరుతమలపాకూ
ఆ: ఏ అందమైన నీదంటా మాట నిలుపుకుంటా
అ: ఓ మేనకా నీ మేనికా మౌనంగ నాది అంటా
ఆ: పువ్వులన్ని మురిసీ నవ్వువాన కురిసీ
అ: విరబూసినా ఓ ప్రేయసీ విరహాల వారణాసీ ॥శ్రీరస్తూ॥

**రచన: సిరివెన్నెల సీతారామశాస్త్రి (6) గానం : సందీప్ భౌమిక్, సునీత**

అ : నీ చిలిపి చొరవ నిలుప తరమా!
ఆ : నీ చెలిమి విలువ తెలుపతరమా!
అ : ఈ వలపు మహిమ తెలుప తరమా
ఆ : నా పిలుపు వినుమా బయటపడుమా
అ : కుదిరే చెదిరే మది నాదిర దిరనా...
తిల్లానాలా నర్తించేలా కవ్విస్తున్న కలవరమా ॥నీ చిలిపి॥
అ : అక్కడ చూస్తే నువ్వు ఇక్కడ చూస్తే నువ్వు
పక్కకి వెళ్తే దారివ్వని చిక్కులాంటి చిరునవ్వు
ఆ : దిక్కులు చూస్తున్నావు లెక్కలు వేస్తున్నావు
చక్కిలిగింత పెట్టకపోతే చెప్పేమాట వింటావా నువ్వు వినవు
అ : లేడికళ్లా వాడిముళ్లా ఇన్నాళ్ల ఏకాంతాన్ని గిచ్చుతున్నావు
ఆ : ఒంటరివేళ (తుంటరి) గోల ఎన్నాళ్ళు నిశ్శబ్దంగా దాచుకుంటావు
అ : కుదిరే చెదిరే మది...॥నీ చిలిపి॥
ఆ : తొందర పెట్టే ఆశ అందెలు గట్టే శ్వాస
ముందుకునెట్టే సందడివెంటే సందేహించే సిగ్గును పంపేశా తెలుసా
అ : నిన్నటిదాకా చూసా. నిందలు ఎన్నో మోశా
నిద్దరచుట్టూ నిప్పులుపెట్టే నిష్ఠూరంతో నేస్తం కట్టేసా సాగసా
ఆ : మొక్కినకొద్ది నిక్కిన బుద్ధి పద్ధతి మార్చుకుంది మంచిదే కదా
అ : అక్కర ఉంది మక్కువ ఉంది చక్కెర చేదు అని అనను కదా
ఆ : కుదిరే చెదిరే మది...॥నీ చిలిపి॥

**రచన: త్రివిక్రమ్ శ్రీనివాస్ (4) గానం : ఉదిత్ నారాయణ్, కౌసల్య**

అ: మన్ను తినే చిన్నతనం కాదమ్మా
వెన్న తినే వయసొచ్చే గోపెమ్మా...
సిగ్గుపడే బుగ్గలలో రాధమ్మా...
ఎరుపెందుకొచ్చిందో చెప్పమ్మా...
ఆ: గుండెల పైన గొలుసు బరువైయ్యింది
నడుమొంపుల్లో చీర నిలవను అంది
అ: చలి రాతిరి తారకలా నువ్వసలే ఒంటరిగా
ఆ: చెలరేగే కోరికలా నువ్వసలే తుంటరిగా ॥మన్ను॥
అ: కయ్యాల మారి వయ్యారి ముద్దివ్వలేవా ఓసారి
ఆ: బృందా విహారీ... బ్రహ్మచారి పెళ్ళయ్యేదాకా సోసారి
అ: ప్రియుడే మొగుడైతే ముద్దులకి ఎంగిలి ఏం ఉండదా...
ఆ: వెదురే వేణువుగా మారినచో రాగాలే పలకవా...
అ: తొలి రాతిరి శివరాతిరి అయిపోతుందేమో.....
చలి రాతిరి తారకలా నువ్వసలే ఒంటరిగా
ఆ: చెలరేగే కోరికలా నువ్వసలే తుంటరిగా.... ॥మన్ను॥
ఆ: కృష్ణా ముకుందా గోవిందా..... నీ రాసలీల అయ్యిందా
అ: ఈ జన్మకంత సీనుందా.. నా బాధ నీకు బాగుందా
ఆ: విరహం ముదిరాకే సరసం సరదాగా ఉంటుందిగా
అ: ఇప్పడే ముచ్చటగా ఔనంటే నీ సొమ్మేం పోదుగా
ఆ: నీ కౌగిలి నాలో చలి పెంచేస్తోందయ్యో...
అ: చల రాతిరి తారకలా నువ్వసలే ఒంటరిగా
ఆ: చెలరేగే కోరికలా నువ్వసలే తుంటరిగా..... ॥మన్ను॥

**రచన: త్రివిక్రమ్ శ్రీనివాస్ (5) గానం : మతిన్, కౌసల్య**

అ: నిదురించే రాతిరిలో... తారకలా నిను నే తాకనా...
ఆ: చినుకయి నే మేఘంలా నీ కోసం దిగి రాలేనా
అ: తొలకరిలో తొలి వలపే... చిరుగాలై చేరనా...
నిదురించే రాతిరిలో... తారకలా నిను నే తాకనా...
తారకలా నిను నే తాకనా....
అ: తెలవారితే నేను తొలికిరణమై..
ప్రియురాలి బుగ్గల్ని ముద్దాడనా....
ఆ: చలి చేరితే నేను నీరెండనై....
నీ గుండెలో వేడి పుట్టించనా....



ఒదిగి నవ్వడి చేసిన సంధ్యలో
అ: కౌగిలే కోటలా ఉండనా తోడుగా
ఆ: ఊపిరై వేడిగా ఉండిపో చాలుగా
అ: పెదవుల్లో చిరునవ్వై ఎదురవుతాలే సుమచరమా... ॥వెన్నెలే॥
ఆ: గుండెలు చెలిమి కదలి కళ్లను తడిపిన జల్లులో....
అ: మనసు మౌనమై మిగిలి
కాలమే కలలు కౌగిలి చేరిన మత్తులో
ఆ: చేరవా మిత్రమా ప్రేమకే చైత్రమా....
అ: కోరితే ప్రాణమే అంకితం చెయ్యనా...
ఆ: ఉదయంలో కిరణంలా ప్రతిరోజూ నీకై జయమా ॥వెన్నెలే॥

**రచన : త్రివిక్రమ్ శ్రీనివాస్ (3) గానం : కౌసల్య**

ప: కలలు కంటాను నేనీ వేళ
పగలు రాత్రితో ఒకటయ్యేలా
కలిపి చూడాలి నింగీ నేలా
ఇంద్రధనుస్సు ఉయ్యాలయ్యేలా
చలి పుట్టే ఎండల్లోనా చెమటొచ్చే
వానేదైనా కనిపెడదాం కాసేపైనా.... హో
నైనో క్లాక్ కూసే కోడి
రౌండీ క్లాక్ ఆడి పాడి సరదాగా గడిపేద్దామా....హో ॥కలలు॥
చ: ప్రియురాలే ఈ నేల ఆకాశం చూసే వేళ
కదిలొచ్చే ప్రతి చినుకు ఓ ముత్యం అయిపోలేదా.....
ప్రతి పువ్వూ చిరునవ్వై చెప్పాలి హల్లో
ఈ గాలి జోలాలా పాడాలి ఇలలో
కన్నీళ్లే లేని ప్రపంచం తాగే నీళ్లున్న సముద్రం
తెచ్చేద్దాం ఎప్పటికైనా ఓ... ॥కన్నీళ్లే॥ ॥కలలు॥
చ: చెయ్యెత్తి పిలిచానా
చుక్కల్లో చంద్రుడు కూడా
పరిగెత్తి దిగివచ్చి నా జళ్లో పూవైపోడా
కొమ్మలనే కుర్చీలా వాడే కోయిల
వాసంతం విరిసిందే కూ అనవే ఎలా
వదిలేద్దాం కోపం ద్వేషం నవ్వేగా
నా సందేశం పుట్టటమే విజయం కాదా... ఓ...
వదిలేద్దాం కోపం ద్వేషం నవ్వేగా
నా సందేశం పుట్టటమే విజయం కాదా... ఓ... ॥కలలు॥



ఆ: చేసేది చెయ్యరా.. తూరురురురూ... నువ్వేరా రాజురా తురురురూ
అ: ఎంతకోరికైనా ఎంత కష్టమైనా అది తీరేదాకా ఎపుడూ ఆగిపోకూ
నీదేరా గెలుపు
ఆ: నింగిమీదవున్నా వెండి చందమామ
నువ్వు అందకుంటే నీకు దక్కుతుంది
రానీకు అలుపూ..
అ: టీనేజి థ్రిల్లిదే.. తూరురురురూ ట్ర్యూనైతే అల్లరే ... తూరురురూ
అ: సముద్రాన్ని చిలిపివాన తడుముతున్నట్టు తనువులో
ఆ: అలలు పొంగి హొయలు పోతూ కులుకు చూపించు కళ్లలో
ఆ: ఉరుము నిన్నేదో తరుముతున్నట్టు పరుగులెత్తాలి మెరుపులా
ఆ: పాలపుంతే నడుముచుట్టూ ఉరకలెత్తాలి గలగలా
ఇ: ఓ.. ఓ.. ఓ..
అ: స్టెప్పే తప్పిపోతే తప్పుకాదు లేమ్మా ఓడిపోయినోళ్లే గెలిచితీరుతారు
జంకొద్దూ ఎపుడూ...
ఆ: ఎన్ని మబ్బులొచ్చి పైన దూకుతున్నా
పొద్దురాక పోదు... కాలం ఆగిపోదు
భయమొద్దు బాసూ
ఆ: టీనేజీ థ్రిల్లిదే... తూరురురురూ...
ట్యూనైతే అల్లరే... తురురురు...
అ: తకిటథిమ్మంటు తాళమేస్తూ తడుపుతుండాలి గుండెను..
ఆ: పదంలోని రిథం ఏదో ఊపుతుండాలి మనసునూ
అ: చివరిమెట్టేదో చేరుకుందాక ఆపవద్దయ్యి పరుగునూ
ఆ: లక్ష్యమేదైనా అందుకుందాక తగ్గనీకయ్యా పవరునూ
ఇ: ఓ.. ఓ.. ఓ..
అ: వానవిల్లులోన రంగులెన్నివున్నా నీకు సాటిరావు వింత ఏమిటమ్మో
చెప్పేస్తే బెటరు
ఆ: కొత్త టెక్నికుంది ఎవరూ చెప్పలేదా సెల్ఫ్ కాన్ఫిడెన్స్ ఫేసు గ్లామరయ్యో
నమ్మాలోయ్ బ్రదరూ
అ: టీనేజి థ్రిల్లిదే... తురురురురూ ట్యూనైతే అల్లరే.. తురురురురూ..

**రచన: సాయిహర్ష (5) గానం : సందీప్ భౌమిక్, సునీత**

అ: హే... శ్రీరస్తూ శుభమస్తూ ప్రేమంగా క్షేమంగా జన్మ జన్మంత జయమస్తూ
ఆ: హే... విజయోస్తూ నా దోస్తూ
లౌక్యంగా సౌఖ్యంగా యవ్వనాలన్ని నువుదోస్తూ
అ: కలలన్ని ఫలమస్తూ



చందాల బాధలేదు రౌడీ మామూళ్లు లేవు
చుట్టాలు పక్కాలు ఇంటికొచ్చి మీద పడరు
ఎప్పుడంటే అప్పుడే అప్పులంటూ అడగరు
వంగి వంగి దండమెట్టి కాళ్లు పట్టిలాగరూ
మనకీ మన పార్ట్‌నర్‌కీ జుట్టుజుట్టు ముడేయరూ ॥రూపీ॥
అడగరెవరు ఎల్.ఐ.సి. పాలసీ డబ్బు చూసి ప్రేమించదు ప్రేయసీ
మన సరుకును చెయ్యరెవరూ పైరసీ ఎవ్వరికీ ఉండదింక జెలసీ
చెప్పలేని తలనొప్పి స్టేటసూ చచ్చేంత చావురా మెయింటెనెన్సూ
డబ్బుతోటి డీలింగే న్యూసెన్సూ
రిలాక్సురా సోదరా రిలాక్సు రిలాక్సురా సోదరా రిలాక్సు ॥రూపీ॥

**రచన: సాయిహర్ష (3) గానం : యస్.పి.చరణ్, కల్పన**

అ : స్వాగతమూ జీవితాంతం చల్లని ఓ నేస్తం...
ఉరికే గలగల జలపాతం యువతీ యువకుల నవగీతం ॥స్వాగతమూ॥
అ : కమ్మని ఈ స్నేహం మన గుండెల్లో గుడిదీపం
ఆ : జన్మంత సంతోషం ఈ దొంతర్ల దరహాసం
అ : ఇది బమ్మెర పోతన రాయని భాగవతం... ॥స్వాగతమూ॥
అ : సేద దీర్చగా బాధ తీర్చగా ఒక్కటే స్నేహమూ
అచ్చమైనదీ స్వచ్ఛమైనదీ పచ్చనీ స్నేహమూ
మబ్బులమ్మ మనసునకేమో చల్లగాలితో స్నేహం
మబ్బునుంచి రాలే చినుకు నేలతల్లితో స్నేహం
గువ్వపిట్ట జుట్టులకేమో చెట్టు పుట్టతో స్నేహం
ఇసుకగూళ్ల ఆటలకేమో ఏటిగట్టు స్నేహం..
ఈ బంధం ఒక్కటే కల్తీ లేనిదిలే.. ఆ: ॥స్వాగతమూ॥
ఆ : స్నేహమెప్పుడూ ప్రేమచప్పుడూ చెయ్యదా గుండెలో
దారమెప్పుడూ దాగి ఉండదా చక్కనీ దండలో
దొంగవయసు దాగుడుమూత ఆడుతోందిలే మనసా
దోస్తు ఆడు దోబూచాట ప్రేమ అవునులే బహుశా
ప్రేమ కన్నా ప్రాణం అయినా మిన్న కాదులే తెలుసా...
రెండు తలపులొకటే ధ్యాస నిండు వలపు బాస
కనుపాపల చెమ్మలు జన్మలు చాలవులే.. ఆ: ॥స్వాగతమూ॥

**రచన: సుద్దాల అశోక్‌తేజ (4) గానం : దేవన్, సునీత**

అ: రా... రామ్మరా... దా... దామ్మదా ఈ ఆటలో.. ఓ పాటగా
లైఫే ఓ ఛాన్సులే.. తూరురురురూ.. మిస్సయితే రాదులే.. తూరురురురూ..

RAMOJI FILM CITY

ఉషాకిరణ్ మూవీస్

# ఒక రాజు ఒక రాణి

రామోజీరావు యోగి.ఎం చక్రి త్రివిక్రమ్



రామోజీరావు



చక్రి



త్రివిక్రమ్ శ్రీనివాస్

పాఠక పుస్తక ప్రియులకోసం సినీ సంగీత విశ్లేషకుడు
'రాజా'
పర్యవేక్షణలో 'హాసం' అందిస్తున్న ప్రత్యేక కానుక ఇది.

## తారాగణం

రవితేజ, నమిత, భరణి, చంద్రమోహన్, రమాప్రభ, శోభన్, శ్రీనివాస్‌రెడ్డి, రంగధామ్, బ్రహ్మానందం, ఆలి, ధర్మవరపు సుబ్రమణ్యం, బెనర్జీ, మెల్కోటె, ఎం.ఎస్.నారాయణ, సునీల్, రామకృష్ణ, సుధా, సత్యప్రియ, విజయసింగ్, శ్వేత, లక్ష్మీపతి, తెలంగాణ శకుంతల, నగేష్, సిద్ధార్థ

## సాంకేతిక నిపుణులు

| | |
|---|---|
| ఎగ్జిక్యూటివ్ ప్రొడ్యూసర్ | : ఎ.వి.రావు |
| కాస్ట్యూమ్స్ | : బాషా |
| మేకప్ | : రాంబాబు |
| ఆర్ట్ | : ప్రకాష్ |
| ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్ | : వల్లూరిపల్లి వెంకటేశ్వరరావు |
| యాక్షన్ | : సతీష్‌రెడ్డి, హార్స్‌మెన్‌బాబు |
| డ్యాన్స్ | : బాబీ, లారెన్స్, విజయశాంతి, కృష్ణారెడ్డి |
| కెమెరా | : వాసు |
| పి.ఆర్.ఓ. | : ఎల్.వేణుగోపాల్ |
| పబ్లిసిటీ | : స్వామి |
| ఎడిటర్ | : శ్రీకరప్రసాద్ |
| డైలాగ్స్ | : నివాస్ |
| లిరిక్స్ | : త్రివిక్రమ్ శ్రీనివాస్ |
| సంగీతం | : చక్రి |
| స్క్రీన్‌ప్లే | : కోన వెంకట్, తాల్లూరి రమేష్, యోగి.ఎం. |
| కథ - దర్శకత్వం | : యోగి.ఎం. |
| నిర్మాత | : రామోజీరావు |



## సాంకేతిక నిపుణులు

| | |
|---|---|
| మాటలు | : శంకరమంచి పార్థసారథి |
| స్క్రీన్‌ప్లే సహకారం | : శ్రీరమణ, వై.యస్. కృష్ణేశ్వరరావు |
| పాటలు | : సిరివెన్నెల, వెన్నెలకంటి, జొన్నవిత్తుల, సుద్దాల అశోక్‌తేజ, సాయిహర్ష |
| కెమెరా | : వాసు |
| ఆర్ట్ | : పేకేటి రంగా |
| ఫైట్స్ | : విజయ్ |
| ఎడిటింగ్ | : మార్తాండ్ కె.వెంకటేష్ |
| కొరియోగ్రఫీ | : లారెన్స్, సుచిత్ర, స్వర్ణ, కూల్ జయంత్ |
| స్టిల్స్ | : పాండ్యన్ |
| మేకప్ | : శేఖర్ |
| కాస్ట్యూమ్స్ | : సాయి |
| పబ్లిసిటీ | : ధని ఏలె |
| పి.ఆర్.ఓ. | : ఎల్.వేణుగోపాల్ |
| ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్ | : ఎన్.వెంకటేశ్వరరావు |
| ప్రొడక్షన్ కంట్రోలర్ | : ప్రభాకర్ |
| కో-డైరెక్టర్ | : కృష్ణచైతన్య |
| నిర్మాణం | : మైత్రీ టాకీస్ |
| సంగీతం | : మణిశర్మ |
| కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వం | : ఏవీయస్ |

## తారాగణం

రాజేష్, సంగీత, గిరిబాబు, జయప్రకాష్‌రెడ్డి, తనికెళ్ళ భరణి, సునీల్, రఘుబాబు, బెనర్జీ, వేణుమాధవ్, గణేష్, కృష్ణచైతన్య, ఎం.ఎస్.నారాయణ, వినోద్, చిత్రం శ్రీను, గుండు హనుమంతరావు, అనంత్, సి.వి.ఎల్., తిరుపతి ప్రకాష్, చలపతిరాజు, జూ॥రేలంగి, రమాప్రభ, 'కోవై' సరళ, జయలలిత, సన, దీప, వర్ష, అనితాచౌదరి

స్పెషల్ ఎప్పియరెన్స్ : లారెన్స్

పాఠక పుస్తక ప్రియులకోసం సినీ సంగీత విశ్లేషకుడు
'రాజా'
పర్యవేక్షణలో 'హాసం' అందిస్తున్న ప్రత్యేక కానుక ఇది.

# ఓరి.. నీ ప్రేమ బంగారంకానూ..!



ఏవీయస్



మణిశర్మ



సిరివెన్నెల



వెన్నెలకంటి



జొన్నవిత్తుల



సుద్దాల అశోక్‌తేజ



సాయిహర్ష

మీ వెన్న ముద్దల్ని ఆప్యాయంగా అందుకున్నాను. ఆ తరం, మా తరం, ఈ తరం రచయితల ఫోటోలను సేకరించి అకారాదిగా ప్రచురించడంలో మీ అపార సహనం, ఆర్ద్ర సంస్కారం అభివ్యక్తమవుతున్నాయి. మీ వచన కవితలు, మినీ కవితలు దోసిళ్ల కొద్దీ చమత్కారాలను వెదజల్లుతున్నాయి. చాలా సంతోషం.

**- డా॥సి.నారాయణరెడ్డి**

అలనాడు జనార్దనుడు వెన్నముద్దలు ఆరగించాడు. ఈనాడు జనార్దన మహర్షి వెన్నముద్దలు అందరికీ పంచాడు. తిన్న కొద్దీ మళ్లీ మళ్లీ తినాలనిపించేంత బావున్నాయి. జనార్దన మహర్షి భవిష్యత్తులో ఇంకా ఎన్నో కమ్మటి కవిత్వాలు వ్రాసి జనాకర్షణ మహర్షిగా ఎదగాలని ఆశిస్తూ, ఆశీర్వదిస్తున్నాను.

**- దివాకరబాబు**

బాగుందోయ్.
చదవడానికి చాలా సులువుగా ఉంది.
అర్థం చేసుకోవడానికి, ఆనందించడానికి... జీర్ణం చేసుకోవడానికి నిజంగానే ఇవి వెన్నముద్దలు.
ముఖ్యంగా అందరి ఫోటోలు వేయటం నాకు బాగా నచ్చింది. అంకితం భలే ఇచ్చావ్.
నీ పుస్తకం ప్రతి ఇంటి పుస్తకాల బీరువాలోనే కాదు ప్రతి పాఠకుడి గుండెల్లోనూ ఉండాలి... ఉంటుందని మనస్ఫూర్తిగా కోరుకుంటున్నాను.

**- కె.రాఘవేంద్రరావు**

జనార్దన మహర్షి 'వెన్నముద్దలు' కవిత్వం అనిపించే జీవితం. జీవితం వినిపించే కవిత్వం.
ఒక కవి కవిత్వాన్ని 224 మంది కవులు ఆశీర్వదించి, ఆ కవిత్వాన్ని వెంట తీసుకొచ్చారంటేనే అది ఎంత విలువైందో అర్థం అవుతుంది. అన్నప్రాసన రోజునించీ అన్న ముద్దలు తినిపించినట్టుగా, అక్షరభ్యాసం రోజునించీ ఈ వెన్నముద్దలు వినిపించటం మొదలుపెడితే... చిన్నప్పటినుంచే జీవితం విలువెంతో తెలుస్తుంది.
ఇంతమంది కవులున్న ఈ పుస్తకాన్ని భద్రంగా దాచిపెట్టుకోవాలి; ఇంత మంచి కవిత్వం రాసిన జనార్దన మహర్షిని గుర్తుపెట్టుకోవాలి

**- గూడూరు విశ్వనాథశాస్త్రి**

ఘంటసాల భగవద్గీత
ఎం.ఎస్.సుబ్బలక్ష్మి భజగోవిందం
ఎస్.పి.బాలు శివస్తోత్రం
ఎప్పట్నించో ఇష్టం
జనార్దనమహర్షి 'వెన్నముద్దలు'
ఇప్పుడు మరీ ఇష్టం
అమ్మ... జనా... ఇంత చిన్న మనిషిలో జీవితం గురించి ఇంత తెలిసిన పెద్ద మనిషి ఉన్నాడు... దొంగా

**- రాజేంద్రప్రసాద్**




## మచ్చుకు కొన్ని వెన్నముద్దలు...

మా అమ్మ
మెజీషియన్
ఇంట్లో ఏం లేకపోయినా
క్షణాల్లో పుట్టిస్తుంది.
మా ఆవిడ
అంత కంటే పెద్ద మెజీషియన్
ఇంట్లో ఎన్ని ఉన్నా
క్షణాల్లో మాయం చేస్తుంది.

అతని
నాలుక
కత్తెరలాంటిది.
తల్లి
పెళ్ళాం కూడా
కట్ అయిపోయారు.

జనార్దనమహర్షి వడ్డించిన వెన్నముద్దలు ఆస్వాదించాను. ఇందులో అతని కల నిజమవ్వడం వెన్నముద్దలు ప్రింటవ్వడంతోనే మొదలయ్యిందనిపిస్తుంది.
ఒక కవి చిలికిన వెన్నముద్దల్ని రంగరిస్తే కమ్మటి నెయ్యి అవ్వొచ్చు. కానీ ఆ నేతిని ఎక్కువ తింటే మొహం మొత్తవచ్చు. కానీ ఈ వెన్నముద్దల్ని తింటుంటే చల్లగా సేద తీరి మళ్ళీ కొత్త వెన్నముద్దల కోసం ఆశ వేస్తుంది. నా ఆశ తీరాలంటే.... మీరు మరో వెన్నముద్దల సంకలనాన్ని ముద్రింప చేయాలి.
ఆ వృత్తాన్ని నేను నాతో పాటూ తెలుగువారంతా డబ్బుపెట్టి కొని మీ కలను మరింత నిజం చేయాలని కోరుకుంటున్నాను

**- అచ్చిరెడ్డి**

అతను ప్రతీదీ
వెంట్రుక ముక్కలా
తీసిపారేస్తాడు.
....
చిన్నతనంలోనే
బట్టతల వచ్చింది.

భార్యాభర్తల బంధం
ఏడు జన్మలదంటారు.
అప్పటికైనా
ఒకరినొకరు
అర్థం అవుతారేమోనని...

ఎలా చచ్చావన్నది కాదు
ఎలా బతికావన్నదే ముఖ్యం.
ఛస్తే ఖచ్చితంగా
నలుగురే మోస్తారు.
బతకటంలో తేడా వస్తే
ఊరంతా మోసేస్తారు.

చిన్నప్పుడు రోగం వస్తే
నాన్నారు 'ఆ మెడకి'
తాయత్తు కట్టాడు
స్కూల్లో ర్యాంక్ వస్తే
మాస్టారు 'ఆ మెడకి'
గోల్డ్ మెడల్ వేశాడు.
కావల్సిన కట్నం ఇచ్చాక
మొగుడు 'ఆ మెడకి'
తాళి కట్టాడు
ఇంత మందికి నచ్చిన
ఆ మెడకే అత్తగారు
ఉరేసింది.

# దిసీజ్ ఖర్మ... దట్సాల్...!

సత్యమూర్తి BV



ఇంట్లో వస్తువులు నాశనం చేస్తుంటే పిల్లల్ని వెనకేసుకొస్తుంది బామ్మ.



వెనకేసుకొచ్చిందన్న కోపంతో పిల్లల్ని ఆవిడ దగ్గరే వదిలేసి ఇంట్లో మిగిలిన వాళ్ళంతా కలిసికట్టుగా సినిమాకెళ్తే...



'సరదాగా మా ఇంటికి భోజనానికి రా' అని పక్కింటి పిన్నిగారు బలవంతపెట్టారని వెళితే...



భోజనం చేస్తున్నంతసేపూ తనకి ఎలా ఆపరేషన్ చేశారో, పొట్ట ఎలా ఓపెన్ చేశారో, పొట్టలోంచి తీసిన గడ్డ అచ్చు ఈ 'బీట్‌రూట్' రంగులోనే ఉంటుంది.... అంటూ ఆవిడ భయంకరంగా వర్ణించి చెప్తుంటే...



ఒకే ఒక్క ఫోన్ చేస్తానంటుంది పక్కింటావిడ




95తో ఒక్కఫోన్ విశాఖపట్నంకి చేసి, 'మిగతా వూళ్ళలో ఉన్న మనోళ్ళందరికీ చెప్ప నాకు ఫోన్ చెయ్యమని - నేనిక్కడే కాస్సేపు ఉంటాను. ఈ నెంబరే అందరికీ ఇయ్యి' అని ఆవిడ అంటే...

# ఎలుక వచ్చె ఇల్లు భద్రం



ఇలపావులూరి మురళీమోహనరావు

7

**హెచ్చరిక**

విరగబడి నవ్వితే గుండె చిక్కబట్టి ఊపిరాడక అవస్థపడేవారు కామెడీ యాక్ట్ 2003 ప్రకారం ఈ సీరియల్‌చదవడం నిషేధం. ఒకవేళ మీ పొట్టచెక్కలైతే పత్రిక నుంచి ఎలాంటి పరిహారం రాదు. ఈ హెచ్చరిక ఈ సీరియల్ పూర్తయ్యేంత వరకు అమలులో ఉంటుంది.





## జరిగిన కథ

వెంకట్రావు, సుందరి భార్యాభర్తలు. అనూహ్య వాళ్ల పాప. వాళ్ల ఇంట్లో ఓ ఎలుక దూరి నానా రభసా చేస్తూంటుంది. దాన్ని చంపడానికి పెట్టిన 'రాటేట్' కేకును అనూహ్య రుచిచూడడంతో ఉత్తుత్తి పరీక్షల పేర డాక్టరు వేలాది రూపాయలు ఖర్చుపెట్టిస్తాడు. ఇలా కాదని ఎలుకల బోను పెడితే దాన్ని కొరికేస్తుందా ఎలుక. పిల్లిని పెంచితే ఎలుక పీడ విరగడవుతుందని సుందరి చెప్పడంతో వెంకట్రావు మేనేజర్ ఇంటినుండి పిల్లిని తెస్తాడు. మేనేజరు, భార్య పిల్లి చాలా అపురూపమైనదని నాటకం ఆడతారు.

(ఇక చదవండి)

# ఎలుక వచ్చె ఇల్లు భద్రం

ఇలపావులూరి మురళీమోహనరావు

"రేపట్నుంచి లీటర్ పాలు ఎక్కువ పోయించుకోవాలి. మన మధ్య మూడో మనిషి రాబోతుంది" భర్త రాగానే చెప్పింది భార్య.
భార్య నెల తప్పిందనే ఉద్దేశంతో "ఎవరోయ్?" అని అడిగాడు భర్త మురిపంగా ఒక ముద్దిచ్చి.
"మా అమ్మ రేపు కోణార్క్ ఎక్స్‌ప్రెస్‌లో వస్తుంది." చల్లగా చెప్పింది భార్య.
వెంకట్రావు కూడా ఇలాగే భ్రమపడ్డాడు. చూడండి.

"మా మేనేజర్ గారిది. వాళ్ళు దీన్ని అపురూపంగా చూసుకున్నారట. కన్నీళ్ళు పెట్టుకుని మరీ ఇచ్చాడు" చెప్పాడు వెంకట్రావు.

****

అవతల మేనేజర్ ఇంట్లో -

భార్యాభర్తలిద్దరూ విరగబడి నవ్వుకుంటున్నారు.

"ఇన్నాళ్లకు శనిగ్రహం వదిలింది. దున్నపోతులా తినడం తాగడం తప్ప ఏనాడూ ఎలుక పిల్లను కూడా పట్టి ఎరగదు. దరిద్రపు పిల్లి. భలే తెలివిగా వదిలించారు" అన్నది పర్వతం.

"పాపం! తెలివి తక్కువ శుంఠ! మనం నిజంగానే ఏడుస్తున్నాం అనుకున్నాడు. ఇకవాడి తిప్పలు ఆ బ్రహ్మదేవుడికే ఎరుక." పొట్ట పట్టుకుని నవ్వుతూ అన్నాడు మేనేజర్.

"వారం పదిరోజుల దాకా పిల్లిని గురించి అడుగుతుండండి. లేకపోతే మన పిల్లి ప్రేమంతా నాటకం అని తెలిసిపోతుంది" చెప్పింది పర్వతం.

మర్నాడు ఆఫీసులో-

"ఏవోయ్ వెంకట్రావ్? ఎలా ఉంది మా చిట్టితల్లి? ఏమైనా మారాం చేస్తున్నదా? దారిలో కొచ్చిందా?" అడిగాడు మేనేజర్.

"రాత్రి సంచిలోంచి తియ్యగానే అటక మీదికెక్కింది సార్. మళ్ళీ కిందికి రాలేదు. దగ్గరకు వెళ్ళబోతుంటే కరుస్తున్నది" చెప్పాడు వెంకట్రావు.

"కొత్త వాతావరణం కదయ్యా. కాస్త అలవాటైందాకా సర్దుకుపో. అన్నట్లు మీకు కేబుల్ కనెక్షన్ ఉందా?" అన్నాడు మేనేజర్.

"ఉన్నది సార్. ఈటీవీ, జెమినీ టీవీ తప్ప మరేం పెట్టదు మా ఆవిడ. సీరియల్స్ చూస్తుంది వార్తలు రాగానే టీవీ ఆపేసి వంట పని చేస్తుంది".




" ఈ లేడీసంతా ఇంతేనయ్యా. వార్తలు చూడటమంటే టైం వేస్టని వాళ్ళ అభిప్రాయం. పార్లమెంట్‌లో రభస, కాశ్మీర్లో తీవ్రవాదుల మృతి. క్రికెట్‌లో ఇండియా ఘోరపరాజయం, వాతావరణం పొడిగా ఉంటుంది. స్టాక్ మార్కెట్ కుప్పకూలింది... ఏ రోజూ ఇవేగా... ఇంతోటి దానికి అవన్నీ చూడాల్నా అంటుంది మా ఆవిడ."

"యస్సార్... పాతికేళ్ళ కాపురం చేసిన తరువాత తన భర్తకు అంతకుముందే పెళ్ళైందని భార్యకు తెలియడం, తల్లిని కూతురు అరెస్టు చేయ్యడం, ముప్పై ఏళ్ళొచ్చిన తరువాత కూడా కొడుకు తల్లిని పదిరూపాయలడగడం, పెళ్ళైన మూడో రోజే భర్తను వదిలేసి భార్య పెద్దపెద్ద ఫ్యాక్టరీలను మెయిన్‌టెయిన్ చేస్తూ రోజుకొక కార్లో తిరగడం, ఓనమాలు రాని ఆడపిల్ల పెళ్ళైన తరువాత ఐ.ఎ.యస్. ప్యాసై కలెక్టర్ కావడం... ఇలాంటి సీరియల్స్ చూస్తే జన్మ తరిస్తుందని మా ఆవిడ అభిప్రాయం."

"బాగా చెప్పావు. బట్ సీ వెంకూ.... నీవు ఎలాగైనా మీ ఆవిడ నొప్పించి ఒక సాహసం చెయ్యాలి."

"ఏంటి సార్ అది? చెప్పండి"

"చేస్తావుగదా?"

"అదేంటిసార్ అలా అడుగుతున్నారు? మీరు చెప్పిన తరువాత చెయ్యక పోవడమా?"

"మా బుజ్జి పిల్లికి ఏనిమల్ ప్లానెట్ అన్నా, డిస్కవరీ అన్నా, నేషనల్ జియోగ్రాఫిక్ అన్నా చాలా ఇష్టం. రోజూ కనీసం గంటసేపయినా చూడకుండా ఉండలేదు. రోజూ రాత్రిపూట పన్నెండు గంటలనుంచీ రెండు గంటల వరకూ దానికోసం ఆ ఛానల్స్ ఆన్ చేసుంచే వాళ్ళం" చెప్పాడు మేనేజర్.

వెంకట్రావు ఆశ్చర్యంతో కళ్ళంత లావు చేశాడు. "పిల్లి టీవీ చూస్తుందా! వింతగా ఉందే!" అన్నాడు.

"మరో వింత చెబుతా మా పిల్లి గురించి. జాగ్రత్తగా విను".

"ఏంటిసార్ అది?"

"నువ్వు ఏ ఛానలైనా పెట్టు. కానీ ఫ్యాషన్ టీవీ మాత్రం పెట్టకు. మీ ఆవిడ మీదపడి రక్కుతుంది." ఎగిరెగిరి నవ్వాడు మేనేజర్.

వెంకట్రావు కూడా నవ్వాడు.

"భలే చిత్రమైన పిల్లండీ." అన్నాడు.

* * *

సాయంత్రం ఇంటికి రాగానే-

"ఏవండోయ్... శుభవార్త!" నవ్వుతూ ఎదురొచ్చింది సుందరి.

"ఏంటి? మన పిల్లి ఎలుకను చంపేసిందా?" ఆత్రంగా అన్నాడు వెంకట్రావు.

"కాదు. నిన్నట్నుంచి అటక దిగకుండా అక్కడే కూర్చుందా పిల్లి! మధ్యాహ్నం టీవీ పెట్టి ఛానెల్ స్కానింగ్ చేస్తున్నపుడు మధ్యలో ఏనిమల్ ప్లానెట్ వచ్చింది. అది రాగానే పిల్లి గభాల్న కిందికి దూకి టీవీ ముందుకొచ్చింది."

"ఆఁ... వాటే వండర్.... మేనేజర్ చెప్పింది నిజమేనన్న మాట! ఆ తరువాతింకేం జరిగింది?"

"నాలుగైదు ఛానెల్స్ తరువాత నేను నిద్రపోయింతరువాత రోజూ అర్ధరాత్రి లేచి మీరు



## ఎలుక వచ్చె ఇల్లు భద్రం

ఇలపావులూరి మురళీమోహనరావు

ఆఫీసరు గారింటికి వెళ్ళాడు గుమస్తా చిదంబరం. "సారున్నారా" వాచ్‌మన్‌ను అడిగాడు.
"సార్ డిన్నర్ చేస్తున్నారు" చెప్పాడతను.
"డిన్నరా? ఇప్పుడు మధ్యాహ్నం ఒంటిగంటయింది. మధ్యాహ్నం తినే భోజనాన్ని లంచ్ అంటారు. రాత్రి భోజనాన్ని డిన్నర్ అంటారు.
ఇంగ్లీష్ తెలియకపోతే తెలుగులో చెప్పవచ్చు కదా?" నవ్వాడు చిదంబరం.
"ఓయబ్బో... మీ మాత్రం ఇంగ్లీషు మాకూ తెలుసు. ఆయనిప్పుడు తింటున్నది రాత్రి వండిందే" కోపంగా అన్నాడు వాచ్‌మన్.

చూస్తుంటారే ఒక ఛానెల్.... అదొచ్చింది..."

గతుక్కుమన్నాడు వెంకట్రావు.

"ఆఁ..ఆఁ... అప్పుడేమైంది?" అడిగాడు.

"వెంటనే నోరు గుహలా చేసి నా వైపు భయంకరంగా చూసింది. వెంటనే మళ్లీ యానిమల్ ప్లానెట్ పెట్టాను. దాంతో మళ్ళీ టీ.వీ. చూడటం మొదలు పెట్టింది. బుద్ధిగా మనిషి కూర్చున్నట్లే కూర్చుంది." విచిత్రంగా చెప్పింది సుందరి.

"మైగాడ్.... అయితే ఈ పిల్లితో జాగ్రత్తగా ఉండాలి. ఆ ఛానెల్ లాక్ చేస్తాను."

"అయినా ఆ ఛానెలేటండీ అంత దరిద్రంగా ఉంది? దేశంలో బట్టలకు కరువొచ్చినట్లు ఒక్క ముండ వంటిమీద పీలికలేదేం? దాన్నా మీరు చొంగకార్చుకుంటూ చూసేది! ఛి...ఛీ...."

"వాళ్ళ సంగతి మనకెందుకులే... ఇంతకూ ఏమైనా పాలు తాగిందా?"

"అరలీటరు తాగింది. నేను అన్నం తినేటపుడు పెరుగన్నం తిన్నది."

"హమ్మయ్య.... బతికించింది. ఇదెన్నాళ్ళు అలుగుతుందోనని భయపడ్డాను. వెంటనే దార్లోకొచ్చింది. మంచి పిల్లే పాపం" అన్నాడు వెంకట్రావు.

ఇంతలో కెవ్వుమని అరిచింది సుందరి... ఉలిక్కిపడ్డాడు వెంకట్రావు.

"ఏమైంది?" అన్నాడు.

"కాలికింద ఏదో మెత్తగా తగిలితే ఏ పామో అనుకున్నాను. ఓసి దీని దుంపతెగ! పిల్లండీ..." నవ్వుతూ చెప్పింది సుందరి.

సుందరి రెండు కాళ్ళ మధ్య వెచ్చగా కూర్చుంది పిల్లి.

"కండబట్టి భలే ముద్దొస్తున్నది పిల్లి" నవ్వాడు వెంకట్రావు.

"ముద్దు మురిపాల గురించి సరే... ఈ రోజు నుంచీ మనం అరలీటరు పాలు ఎక్కువ పోయించుకోవాలి" అన్నది సుందరి.




"దేనికి? ఎవరైనా బంధువులొస్తున్నారా?"

"వస్తారా ఏంటి? వచ్చారు! ఈ పిల్లే మన బంధువు. దీనికి పాలు కావాలి కదా..."

"దీని కోసం స్పెషల్‌గా ఎందుకు? ఓ గిన్నెడు పాలు పోస్తే సరిపోతుందన్నావుకదా..."

"ఏదో మాట వరసకంటే దాన్నే పట్టుకు వేళ్ళాడుతారేం?"

"మన బడ్జెట్ పెరిగిపోతుంది కదా..."

"అలాగైతే ఎలా? పిల్లి పోషణ జరగాలి కదా.."

"అది ఎలుకను పట్టిందాకేగదా... సరేకానీ.. ఈ రెండు మూడు రోజులు అలాగే తెద్దాం." అన్నాడు వెంకట్రావు.

వారం రోజులు గడిచాయి. పిల్లి మూడు పూట్లా పాలు తాగుతున్నదీ తప్ప ఎలుకను పట్టుకున్న జాడలేదు. ఎలుక మాత్రం బియ్యపు బస్తాను, మూలకు పడేసిన విడిచిన గుడ్డలను యధాశక్తి నమిలిపారేస్తున్నది.

సుందరి, వెంకట్రావులను దిగులు ఆవరించింది.

"రోజులు గడుస్తున్నాయి కానీ వచ్చిన పని చూడదేంటీ పిల్లి? దీనికి కళ్ళున్నాయా లేక గుడ్డి పిల్లా?" నీరసంగా అన్నది సుందిరి.

"గుడ్డిదైతే టీవీ ఎలా చూస్తుంది?" అన్నాడు వెంకట్రావు.

"అయితే ఇది తిండికి తిమ్మరాజు పనికి పోతరాజు బాపతా ఏంటి? కొత్త పెళ్ళి కొడుకులా తిని కూర్చోడం తప్ప డ్యూటీ చెయ్యదేం?"

"ఆ సంగతి దానికి చెప్పేదెలా? పోనీ దానికి తెలిసేదెలా?"

"ఎలుకని పట్టమని పిల్లికి ఒకరు చెప్పాలా ఏం? దాని సహజ గుణమే కదా?"

"ఒక వేళ కొంపదీసి వేటాడగూడదని, జీవ హింస చేయరాదని నిర్ణయమేమైనా తీసుకుందా ఏం?"

"నా శ్రాద్ధం... నా పిండా కూడు.. భలే సోమరి పిల్లిని తెచ్చారు."

"ఎలుకను పట్టడమంటే అంత తేలిక కాదోయ్. అయినా దాని పని అది చెయ్యకుండా ఎలా ఉంటుంది. ఉద్యోగం లేనివాడు వంద కంపెనీలకు అప్లై చేస్తాడు. ఏదో ఒకటి తగులుతుంది. అలాగే దాని ప్రయత్నాలు అది చేస్తుంటుంది. ఎప్పుడో ఫలిస్తుంది."

"ఈ లోపల కొంప గుండం అవుతుంది. అసలీ రాత్రి లేచి చూద్దాం. ఇది ఏం చేస్తున్నదో తెలుస్తుంది." అన్నది సుందరి.

తలూపాడు వెంకట్రావు. "రాత్రి ఎన్ని గంటలకు అలారం పెట్టమంటావు? అడిగాడు.

"మీ తెలివి మండినట్టే ఉంది. అలారం మోతకు పిల్లి లేవదూ? చడీ చప్పుడు కాకుండా మనమే లేవాలి. ఒంటిగంటకు లేద్దాం" చెప్పింది సుందరి.

-(ఇంకావుంది)



# కొమ్మ కొమ్మకో సన్నాయి ...





## ఇద్దరూ ఇద్దరే ఇద్దరిది చెరిగిపోని ముద్దరే

తెలుగు చిత్ర సంగీత రంగానికి ఎంతో సేవ చేసిన ఇద్దరు మిత్రులు ఈ జూన్ నెలలోనే జన్మించారు. ఏడు రంగుల ఇంద్రధనుస్సులు నింగిలో తొంగిచూసే సప్త స్వరాల తొలకరి జల్లుల వేళలో ఆ యిద్దరూ పుట్టడం వారు సంగీతానికి జీవితాలు అంకితం చేయడం ఆశ్చర్యం కలిగించదు. వారిద్దరితో నా అనుబంధమూ అలరులు కురియగ ఆమని సొబగులతో అలరారే అనురాగ వినురాగ బృందావన గీతగోవిందమే. వేదం, అణువణువున నాదం, నా పంచ ప్రాణాల నాట్య వినోదం 'అఉమ'లుగా పెనవేసుకున్న ప్రణవంలా అది నాలో నేపథ్యంగా వినిపిస్తుంది.

ఈ యిద్దరిలో ఒకరు గిటారు డేనియల్ రాజా, ఇంకొకరు 'ఆంధ్ర పత్రిక'లో నా సహాధ్యాయి శ్రీ అగస్తీశ్వరరావు గారి అల్లుడు చి॥మణి. మూకాంబికా మూక స్వర ప్రసాదంతో డేనియల్ మహా సంగీత దర్శకుడైనాడు, మంచి బాలుడు మణి చదవవచ్చిన ఇంజనీరింగు పక్కన పెట్టి తండ్రినుంచి సంక్రమించిన త్యాగరాజ సంప్రదాయ గీతికి వారసుడై కోదండపాణి గురుత్వంలో ఘంటసాల అనే గంధర్వుడికి వారసుడనిపించుకున్నాడు.

వీరిద్దరి జీవితాలు ప్రత్యక్షసాక్షిగా పరిశీలించినవారికి వర్తమాన పురాణాలుగా కనిపిస్తాయి. అభినవ శ్రుతి హాసాలుగా వినిపిస్తాయి.

డేనియల్ గిటారు చేత పట్టుకుని కాళ్లు కడుపులో పెట్టుకుని కాలం గడిపిన రోజుల్లో అనంతమైన రాగాలు, వాటిచుట్టూ పరిభ్రమించే లోకాలు అతని కడుపులో వున్నాయని గుర్తించిన వారు లేరు. నిట్టూర్పులతో మూగ వేణువులూదుతున్న అతని మౌనగీతాలు ఆ తర్వాత పలకనేర్చిన వైనం ఓ చిన్న కథ.

అతను కొందరు మిత్రుల పిలుపుతో చేసేది ఏమీ లేక యాత్రకు బయలుదేరాడు. అతని మతం క్రైస్తవం - కానీ అభిమతం, సమ్మతం క్రైస్తవపు సరిహద్దులు దాటాయి. నిజమైన క్రైస్తవాన్ని, వాస్తవాన్ని గ్రహించింది అతని మనస్సు. మిత్రులతో యాత్రకు వెళ్ళి డేనియల్ కొన్ని ప్రదేశాలు చూసి కర్ణాటక రాష్ట్రంలో దక్షిణ కన్నడ జిల్లాలోని కొల్లూరు చేరుకున్నాడు. ఆ ఊరు శ్రీ ఆదిశంకరుల మూకపంచవింశతికి అద్దం పట్టే శ్రీ మూకాంబికా క్షేత్రం, సౌపర్ణికా నదీ తీరం, అదొక చిట్టడవి. అక్కడొక అతి ప్రాచీనమైన గణపతీ ఆలయం. స్నానం చేసి వచ్చి డేనియల్ ఆ గుడిలో కూర్చున్నాడు. ఏదో నిర్వేదం - ఏదో నైరాశ్యం, బరువుగా మౌనం, బహుశా ధ్యానమేమో! అది కూడా తెలియని స్థితి. అక్కడికి అడవిలోనుంచి వృద్ధుడైన సాధువు ఒకరు వచ్చి, దీపారాధన చేసి, స్వామికి నమస్కరించి అప్రయత్నంగా డేనియల్ వైపు చూశాడు. అతను మౌనముద్రలో వున్నాడో యోగనిద్రలో వున్నాడో - ఈ సాధువు అతనిని సమీపించి క్షణం ఆగి తలపై చేత్తో తడిమి 'ఇళయరాజా డా నీ' (ఇలకు రాజువురా నువ్వు-అని అర్థం) అన్నాడట. అతనిలో అపూర్వమైన చైతన్యం పుట్టుకొచ్చింది. కానీ ఎదుట జీవితం ఎడారిలా వుంది. అమ్మను సేవించుకొని మిత్రులతో మద్రాసు చేరాడు డేనియల్. రాగానే భార్య ఎదురువచ్చి... మీ కోసం ఎవరో వారం రోజుల నించీ రోజూ రెండు మూడు సార్లు వచ్చిపోతున్నారు. వాళ్లేదో పిక్చర్ తీస్తున్నారట. మీరు సంగీతం చెయ్యాలట' అంటుండగానే వాళ్లు రావడం, ఆ పిక్చర్‌కి అతను సంగీతం చేసి తన స్వర విహంగాన్ని వినువీధిలో ఎగురవేయడం జరిగిపోయింది. ఆ చిత్రమే 'అన్నక్కిళి' అనే తమిళచిత్రం. అందులో ప్రతిపాటా సూపర్‌హిట్టు కావడం, చిత్ర విజయానికే కాక ఇళయరాజా జీవిత సోపానానికి తొలిమెట్టు కావడం జరిగింది.



ఆనాడే దక్షిణ భారత చలన చిత్రాకాశంలో అపూర్వమైన తార వెలిగింది. వ్యక్తిగతంగా డేనియల్‌లో ఒక యోగి ఆవిర్భవించాడు. మూకాంబికా కృపా రసం అతనిపై ఎడతెగని ధారగా కురిసింది. కాషాయం కడుతూ, పాదరక్షలు విసర్జించి, ఏకభుక్తంగా శాకాహారియై, మితభాషిగా, మౌనిగా మారిపోయాడు. అతను చేసిన చిత్రాల సంగీతంలో కూడా దివ్యత్వం చోటు చేసుకుంది. ఇళయరాజా శకం ప్రారంభమైంది. స్వరబ్రహ్మ అంతటి వారే అతని నాద విన్యాసానికి ఆశ్చర్యపడిన సందర్భాలున్నాయి.

'రాజపార్వై' అనే తమిళ చిత్రాన్ని తెలుగులో కూడా ఏకకాలంలో తీయడం జరిగింది. ఇళయరాజాతో నాకు అదే తొలి పరిచయం. అప్పుడే తమిళ కవి వైరముత్తుకు ట్యూన్ యిచ్చానని, అప్పుడే ఈయన (అంటే నేను) వస్తే బాగుండేది కదా అన్న పుల్లవిరుపుతో ప్రారంభమైంది. ఈ పరిచయం. దర్శకుడు సింగీతం శ్రీనివాసరావుగారు ఏదో సర్ది చెప్పబోయారు. ఇదేదో బ్రతిమాలుడు వ్యవహారంగా తోచి నేను లేచి వెళ్లబోయాను. తాను చాలా బిజీగా వున్నానని, తమిళకవి ట్యూన్ యివ్వగానే అలా పల్లవి రాసిచ్చాడని, ఇప్పటికే తనకు లేటయిందని - ఇదీ వరస... విరసంగా సాగింది. 'నేనూ చాలా బిజీయే... అలా చెప్పుకోవడం పద్ధతి కాదు... వస్తాను' అన్నాను. 'ఎన్నా సార్ - కవింగర్‌కి కోపం వందదుపోలె యిరిక్కే... సారీ సార్' అంటూ ఆ ట్యూను వినిపించాడు ఇళయరాజా. వినగానే ఆనందం కలిగింది -'ఇలా వినగానే తమిళకవి అలా రాసి ఇచ్చాడు' అన్నమాట మదిలో మెదిలింది. 'ఎళుదుకు రాంగళా' అన్నాను... 'పల్లవి రాసుకుంటారా' అని... 'ఇప్పుడే చెప్పేస్తారా అయితే చెప్పండి' అన్నాడు -

'సుందరమో సుమధురమో
చందురుడందిన చందన శీతలమో
మలయజ మారుతశీకరమో
మనసిజ రాగవశీకరమో' (అమావాస్య చంద్రుడు)

అని పల్లవి చెప్పాను; అది పాడుకుని చూసి, బయటకు పాడి వినిపించి ఎంత మధురంగా వుంది. ఆహా! సుందరత్తెలుంగు అని భారతి మహాకవి ఎందుకన్నాడో యిప్పుడు తెలిసింది' అని నన్ను కూడా మెచ్చుకున్నాడు.

ఆ ముహూర్తమెటువంటిదో మా యిద్దరి కలయికలో ఎన్నో పాటలీ కుసుమాలు వికసించాయి. మా మధ్య అవ్యాజమైన స్నేహబంధం ఏర్పడి ఒకటిన్నర దశాబ్దం పాటు మా సినీ జీవితానికి ఆలంబనగా నిలిచింది - ఇళయరాజా బాహిర ప్రవర్తన చాలా మందికి అర్థం కాని విషయం. సన్నిహితులైన ఏ యిద్దరు ముగ్గురికో అది కరతలామలకం. మేమిద్దరం కలిసి కొన్ని తీర్థయాత్రలు చేశాం. కర్ణాటకలో హెనెక్కి అనే కుగ్రామంలో ఒక స్వామి - ఆయన పేరు ఆవులప్ప స్వామి - దర్శనానికి రాజా దంపతులూ, నేనూ వెళ్లాము. ఆ గ్రామంలో గుడికి చెందిన పూజా గోవు మరణిస్తే ఈ స్వామిని జనమంతా ప్రార్థించారట. అప్పుడీ స్వామి ఆవు కళేబరాన్ని వెనకనుంచి తాకి 'లేరా బసవా లే' అన్నాడట. ఆ ఆవు వెంటనే సజీవంగా లేచి నిలబడ్డదని, అప్పటినుంచి 'ఆవులప్ప స్వామి' అనే పేరు స్వామికి వచ్చిందని రాజా నాకు చెప్పాడు. అలాగే పొల్లాచ్చిలో 500 సంవత్సరాల ఒక యోగి వున్నాడని చెప్పి (ఆయన ఫోటో కూడా తన కంపోజింగు గదిలో వుంది) ఎంతగానో ఆయన మహత్తు నాకు చెప్పేవాడు.

ఇళయరాజా చక్కని తెలుగు మాట్లాడగలడు, యాస ఆయనలో చాలా తక్కువ. పాట రాస్తే దాన్ని సవిమర్శకంగా తూచి చూడగలడు. స్వర పద సంధానం ఆయనకు, ఆయన పాటకూ ప్రాణం. తను యిచ్చిన ఒక ట్యూన్‌కి 'కొట్టండి తిట్టండి కొయ్యండి చంపండి గిల్లండి గిచ్చండి పిచ్చండి నమ్మండి ప్రేమ' అని రాసినప్పుడు అతను ఎంతగా నవ్వాడో, ఎంతమందికి చెప్పాడో! 'సాగరసంగమం'లో 'ఓం నమశ్శివాయ' అనే పాట నన్ను ముందు రాయమని తరువాత ఎంత గొప్పగా ట్యూన్ చేశాడో అందరికీ తెలిసిందే. శివసంబంధమైన రాగాలలో నాట తర్వాత హిందోళం ప్రధానమైనదని ప్రొఫెసర్ పి.సాంబమూర్తి ఒక సదస్సులో చెప్పారు. ఇళయరాజా ఆ రాగంలో నా పాటను స్వరపరిచిన క్షణాలలో నాకు ఆ మాటలు గుర్తుకు వచ్చాయి. అందులో అతను ప్రస్తరించిన స్వరాలు శివస్పందనను తాండవ చలనాన్ని సాత్వికంగా కళ్లకు కట్టినట్లు చూపించాయి. ముఖ్యంగా 'ప్రకృతి

పార్వతి నీతో నడచిన ఏడు అడుగులే స్వరసప్తకమై' అన్నచోట స్వరకల్పన అద్భుతంగా తోచింది. ఒకప్పుడు శహనా రాగంలో 'మామ' మనోహరంగా డ్యూయట్ చేస్తే రాజా పరమ విషాదరాగంగా పరగణింపబడే శుభపంతువరాళి రాగంలో డ్యూయట్ చేసి ఆహా అనిపించారు. అదే 'ఆఖరిపోరాటం' చిత్రంలో శృంగార రస వర్షగీతం 'స్వాతి చినుకు సందె వేళలో లేలేతవణుకు అందగత్తెలో' పల్లవిగా సాగుతుంది.

'నాభిహృత్కంఠరసన'ల ద్వారా ఉద్భవించి ఉరికివచ్చే 'సప్త స్వర సుందరులను' భజించిన నాద యోగులలో ఇళయరాజా ఒకడు. నాదసుధారాసంబిలను నరాకృతి ఆయెరా' అన్న త్యాగయ్యగారి మాటకు సాక్ష్యమే అతని జీవితం. 'సీతాకోకచిలక', 'సాగరసంగమం', 'సితార', 'అన్వేషణ', 'కీచురాళ్ళు', 'ఏడుకొండలస్వామి', 'రుద్రనేత్ర', 'గీతాంజలి', 'ఆఖరిపోరాటం', 'జగదేకవీరుడు అతిలోకసుందరి', ఇలా ఎన్నని చెప్పగలను. ఏదని చెప్పగలను. ఎన్ని రసయోగాలు, ప్రయోగాలు! రచనకీ రాగరచనకీ - ఎన్ని నియమాలు! ప్రాణాయామాలు! ధ్వని శాసనానికీ పదాలు రాయడాలు. 'ఆఖరిపోరాటం' చిత్రంలో ఒక పాటకు కేవలం దరువు వినిపించి దీనికి రాయండి గురువుగారూ' అన్నాడు రాజా. అదొక మామూలు డ్యూయట్ సన్నివేశం. నేను కొంచెం ఆలోచించాను. శబ్దం ఏ మాటని స్ఫురింపజేస్తుందో అవే మాటలతో రాయండి అన్నాడు - అప్పుడు రాసిన గీతం-



'ఎప్పుడు ఎప్పుడు గుప్పెడు ముద్దుల
చప్పుడు బుగ్గల్లో
హత్తుకునే మత్తులలో మెత్తని వత్తిడిలో
ఇప్పటికిప్పుడు చిచ్చుల కుంపటి
పెట్టకు గుండెల్లో
తాకిడికో దూకుడుకో దక్కిన చెక్కిలితో
నీ ఒంపుల సొంపే నా ఒంటికి పంపే
అల్లికలో అందికలో మల్లిక పూసిన మాపటిలో

అలాగే ఒకే వాద్యం వినిపిస్తూ - దరువు విడిగా లేకుండా స్ఫురణకు మాత్రమే తంత్రిలో పలికిస్తూ - అక్కడి సన్నివేశానికి ఆ ట్యూన్ వచ్చిందని ఆ సన్నివేశానికి ఈ ట్యూన్‌కే మీకు ఏమి రాయాలనిపిస్తే అది రాయండి అని అన్నాడొకసారి-

'గోపెమ్మ చేతిలో గోరుముద్ద
రాధమ్మ చేతిలో వెన్నముద్ద
ముద్ద కావాలా ముద్దు కావాలా
ఆవిందా ఈవిందా నాముద్దు గోవిందా'

ఈ మధుర గీతం అలా వచ్చిందే- అదొక సరసం, అదో చిలిపి తనపు మోజువీడు చిన్నరసం... అందులో 'అలూ అరూ ఇణీ' తెలుగింటి మూల మూలలనుంచి ధైర్యంగా వచ్చి మనతో ఆడుకుంటాయి. ఎంత అందంగా పొందికగా, జడకుచ్చులతో, పరికిణీలతో, ముద్దొస్తాయో! చింతాదీక్షితులు గారి సీతీ వెంకిలా రమణగారి సీగాన పెసూనాంబలా! పాట ఆగినా అవి మనసులో జ్ఞాపకాలుగా ఆడుతూనే వుంటాయి. ఆ పాట రాసి, అది 'ప్రేమించు-పెళ్ళాడు'లో వచ్చి ఎంతకాలమైందో - అయినా ఆ పాట మధురంగా సరసుల హృదయాలలో స్మృతివీణలు మీటుతూనేవుంది.

లతామంగేష్కర్, బాలు కలసి ఆలపించిన యుగళగీతం అప్పటికప్పుడు కంపోజ్‌చేసి రాసినది అంటే ఎవరికైనా నమ్మడం కష్టం. 'తెల్లచీరకు తకధిమి తపనలు రేగెనమ్మ సందెఎన్నెల్లో సిరిమల్లె పూలకు సరిగమ ఘుమఘుమ సోకెనమ్మ జంటముద్దుల్లో' అనే పాటలో చరణాలను సంగీత పరంగా లతాజీ మెచ్చుకుంటే అప్పటికప్పుడే అవి రాయడంలో రచయిత చూపిన విన్నాణాన్ని ఇళయరాజా ఆవిడకు చెప్పి నన్ను ఎంతో గౌరవించాడు. ముఖ్యంగా

'కార్తీకం కలిసివస్తే
నీ పరువం అడుగుతున్నా
హేమంతం కరుగుతుంటే
నీ అందం కడుగుతున్నా
వైశాఖం తరుముతుంటే
నీ ఒళ్లో ఒదుగుతున్నా
ఆషాఢం ఉరుముతుంటే
నీ మెరుపే చిదుముకున్నా'

వంటి చరణాలలో సన్నివేశ సాహిత్యానికి లతాజీ చాలా సంతోషించారు.

ఇళయరాజా పాట కంపోజింగు ఆర్భాటంగా వుండదు. గిటారు, తబలాల సహకారంతో ఎలుగెత్తి అబద్ధ సాహిత్యాలు పాడి ట్యూన్లు దర్శక నిర్మాతల చేత ఓకే చేయించే 'గిమ్మిక్కు' బొత్తిగా అతనికి లేవు. కనీసం తబలా అయినా లేకపోతే గత్తు ఎలా తెలుస్తుందను కోడానికి ఆస్కారం వుండదు. తాను చాలా తక్కువ స్థాయిలో రహస్యోపదేశం చేస్తున్నట్టు పాడుతూ కుడి చేతివేలితో హార్మోనియం మీద దరువు వేస్తాడు. దూరంగా కూర్చున్న సహాయకుడు సౌందరరాజన్ స్వరాలు రాసుకుంటారు. పాట టేపు అయిపోతుంది.

ఒకసారి విజయలక్ష్మీ ఆర్ట్ మూవీస్ (శ్రీ త్రివిక్రమరావు) కంపోజింగ్‌కు నేనూ యండమూరి వీరేంద్రనాథ్ ఇద్దరమే వెళ్ళాము. అదొక ఏకాంత నిర్జన ప్రదేశం. తమిళనాడు నడిబొడ్డున వున్న సుందర పర్వత ప్రాంతం. ఇళయరాజా చాలా సందర్భాలలో అటువంటి ప్రదేశాలలో 'ప్రత్యూష పవనాంకురములు పైకొనువేళ' కంపోజింగు కార్యక్రమం పెట్టేవాడు. ఆరోజు ఉదయం మా పాటల స్వరకల్పన. మేము ముగ్గురమూ సౌందరరాజన్ మాత్రమే ఉన్నాము. ఏదో తపోముద్రలో హార్మోనియం ముందు చాలా సేపు కూర్చున్నాడు. మాకు అర్థంకాలేదు. ఒక ఇరవై నిముషాల తరువాత మెల్లిగా కళ్లు తెరిచి 'ఈ క్షణం నాకు ఒక మహాపురుషుడు దర్శనమిస్తున్నాడు. సినిమాకి చేసే సంగీతం జనం కోసం- మన ప్రతిభా పాటవాల ప్రదర్శనకు కాదు. అది నిరూపించి ఒకదారి చూపించిన గురువు ఒక్కరే- ఆయనెవరో తెలుసా? ఒకే చిత్రంలో ఒకే రాగంలో దాదాపు అన్ని పాటలూ చేసి అన్నీ హిట్ చేసిన ఆయనెవరో తెలుసా?' అని అడిగాడు. నాకేం చెప్పాలో ఎవరని చెప్పాలో తెలియలేదు. కానీ సంకోచిస్తూనే శంకర్ జైకిషన్ అన్నాను- 'కాదు. ఆ క్రెడిట్ అంతా ఘంటసాలగారిది' అని ఖచ్చితంగా అనేశాడు. అనడమే తడవుగా హార్మోనియం మీద 'పాతాళభైరవి' చిత్రంలోని పాటల పల్లవులు, రాగాలు గుర్తున్నంతవరకు పాడి- ఇది సామాన్యమైన విషయం కాదు- అన్నాడు. వెంటనే ఆ ఉత్సాహధోరణిలో ఒక ట్యూన్ పాడి 'ఇది మీ డ్యూయట్‌కి యిస్తున్నాను' అని నన్ను రాయమన్నాడు. ఆ పాటే 'శుభలేఖ రాసుకున్నా ఎదలో ఎపుడో' అనే పల్లవితో అందరినోట చాలాకాలం వినిపించింది. ఇప్పటికీ 'అటువంటి పాట ఒకటి యివ్వండి గురువుగారూ' అనేవాళ్ళున్నారు.

ఇళయరాజా అంటే ఇలకు రాజు అని అర్థం. కళలకు రాజు నటరాజు ఒక్కడే- ఆ నటరాజ పాదాల తలవాల్చడం నయనాభిషేకాన తరించడం అతని రాజరికం- అది అందరికీ లభ్యమయ్యే వరంకాదు. జూన్ 2వ తేది ఇళయరాజా పుట్టినరోజు. సప్త సాగరాలుగా పొంగే సంగీతానికి ప్రాక్

పశ్చిమాలు లేవని చాటిన వైతాళికుడు జన్మించిన రోజు- అతనితో నాకు గల అనుబంధంతో అనురాగంతో శతవసంతాలు జీవించాలని మళ్ళీ తెలుగు సినిమాను సంగీతంతో అభిషేకించాలని కోరుకుంటున్నాను.

ఇద్దరుమిత్రుల పుట్టినరోజుల పురస్కారంగా మొదలెట్టిన ఈ వ్యాసార్థంలో జూన్ 4వ తేదిన జన్మించిన ప్రియమైన దుర్మార్గుడు, నేను గీతమైతే తాను గానమైనవాడు, అద్వితీయుడైన రెండవవాడు, నాకు ప్రాణసమానమైనవాడు, నావాడు బాలసుబ్రహ్మణ్యం.

జనార్ధనరెడ్డి సి.ఎం.గా వున్నప్పుడు నంది అవార్డ్స్ ఫంక్షన్ ఒక సంవత్సరం నెల్లూరులో జరిగింది. అవి ప్రదానం చేయడానికి వచ్చిన నేటి తమిళనాడు ముఖ్యమంత్రి శ్రీమతి జయలలిత ఒకగొప్ప చారిత్రిక సత్యం చెప్పారు. 'భారతదేశంలో సరిహద్దులంటూలేని రాష్ట్రాలు రెండే రెండు- అవి ఆంధ్ర తమిళ రాష్ట్రాలు' అన్నది ఆ సత్యం. ఉమ్మడి సాహితీ, సంగీత, నాట్య, కళా, సాంస్కృతిక చరిత్ర ఈ రెండు రాష్ట్రాలకు ఉన్నట్టు మరే ఇతర రాష్ట్రాలకు లేదని ఆమె అన్నారు. ఈ రెండు రాష్ట్రాల సరిహద్దుపల్లె కోనేటంపేటలో పుట్టిన బాలు ఆంధ్రులకీ తమిళులకీ ఉమ్మడి సినీ గాయకుడు. తమిళాంధ్ర దేశాలను బాలులాగ ఉర్రూతలూగించిన గాయకుడు మరొకరు లేరు. ఘంటసాల, టి.ఎం.సౌందరరాజన్‌లు ఒక విధంగా ఆంధ్ర తమిళ రంగాలకే పరిమితమైనారు. కానీ బాలు గళం ఈ రెండు రంగాలకూ కాక కన్నడ హిందీ రంగాలకు కూడా వ్యాపించి తెలుగు గాయకశ్రేణికి అఖండమైన కీర్తి ఆర్జించిపెట్టింది.

సాధనతో ఒక వ్యక్తి ఎంతటి శక్తిగా మారగలడో నిరూపిస్తుంది బాలసుబ్రహ్మణ్యం జీవితం. ముత్యాలొలికే దస్తూరి, మూలాగ్రాలెరిగిన ఆంధ్ర సాహితీ పరిచయం, ధ్వన్యనుకరణ వంటి కళలలో ప్రవేశం, అనర్గళంగా ఆంగ్లంతో పాటు దేశభాషలు అయిదారు మాట్లాడగల వాగ్ఝరి అతని నిధులు. శాస్త్రీయ సంగీతం గురువువద్ద నేర్చుకొనకపోయినా మామ, పుగళేంది వంటి విజ్ఞులవల్ల దానిని సాధించి పాడి మెప్పించిన సాధకుడు. ఇవన్నీ అతనిని గూర్చిన నిజాలు. సంగీత దర్శకుడుగా గంగిగోవుపాలవంటి నాలుగైదు చిత్రాలే చేసినా మధురంగా, మనోహరంగా సంగీతం వినిపించినవాడు బాలు. మయూరి, జాకీ, తూర్పువెళ్ళేరైలు అతని సంగీత దర్శకత్వ ప్రతిభకు దర్పణాలు.

ఉషాకిరణ్ సంస్థ నిర్మించిన 'మయూరి' చిత్రం సినీనిర్మాణ రంగంలో ప్రయోగాత్మకమైన మణిపూస. ఆ చిత్రానికి అందులో వున్న ఉదాత్త సన్నివేశానికి బాలు సమకూర్చిన సంగీతం కథలో వున్న 'మూడ్'ను ఇనుమడింప చేయడమేగాక, ఎంతో హార్దికమైన హాయిని శ్రోతలకు పంచిపెట్టింది. అటువంటిదే మరొక గొప్ప చిత్రం సంగీత రచన జరిగికూడా ఉషాకిరణ్ సంస్థ నిర్మించడం జరగలేదు. ఆ చిత్రంపేరు ప్రతిమ. గణేశ్ పాత్రో కథ, దర్శకత్వం అనుకున్న చిత్రమది. అందులోకూడా బాలు ఎంతో హృదయంగమమైన సంగీతం, నేను హృదయ పూర్వకమైన సాహిత్యం అందించాము. కొన్ని నా భావ గీతాలు కూడా బాలు ట్యూన్ చేసిన పద్ధతి విని మళ్ళీ దేవదాసు వంటి సినిమా తెలుగులో తీస్తే ఇతనే సంగీతం చెయ్యాలి అనుకున్నవారున్నారు. 'బ్రతుకులాంటి పాటలో బ్రతకలేని బాటలో బాటసారిని నన్నీ పాటపాడనీ' వంటి గీతాలను మధుర విషాద గీతాలుగా మలిచిన మనస్వి అతను. బాపూరమణలకు బాలూ అన్నా అతని సంగీతమన్నా ఎంతో యిష్టం. 'చుట్టూ చెంగావి చీర' (తూర్పువెళ్ళేరైలు), 'శశివదన మనవి వినలేవా' (జాకీ), 'అలా మండిపడకే జాబిలి' (జాకీ), 'కోనసీమలో కొంగుజారిన ఆకుపచ్చ చందమామా' (సీతమ్మపెళ్ళి) లాంటి పాటలన్నీ బాలూ సంగీత దర్శకత్వ మధురిమకు స్వర దర్పణాలు. 'గీతాంజలి' పేర నేను వెలువరించిన 'క్రీస్తు గానసుధ' ఆడియో కాసెట్‌లో ప్రతిపాట మధురాతి మధురం.

ఒకనాడు - శ్రుతిలయలే జననీ జనకులు కాగ - అని ఆలపించిన బాలు ఈనాడు శ్రుతిలయల వంటి ఇద్దరు పాపలకు (కవలలు) తాత అయినారు.

గొంతులు మార్చి పాడడంలో గాత్రధారులకు కొత్తకోణాలు ఆవిష్కరించి 'దశకంఠుడు' అనిపించుకున్న బాలు 'రవైతీతి రామః' అన్నట్లు మరో నాదమూర్తి- 'బాలోచ్ఛిష్టం స్వరం సర్వం' అంటే అతన్ని కొంతైనా అర్థం చేసుకున్నట్లే!

అన్నిటికి మించి బాలూని కళాకారుడిగా పెంచినది.పూర్వులు, పెద్దలు అయిన సంగీత సాహితీవిదులపట్ల అతనికున్న భక్తిభావం. ఘంటసాలగారి యందు అతనికిగల భక్తి, గౌరవాలు ఆరాధన ఆదర్శప్రాయమైనవి.

మహామహులైన సంగీతదర్శకుల, రచయితల మధుర గీతాలెన్నో పాడే అవకాశం ఇతరగాయకుల కన్న ఎక్కువగా అతనికి దొరికింది. చరిత్ర సృష్టించిన చిత్రాలకు పాడి చరితార్థుడైనాడు. ఎప్పుడో ఒక మహాయతిని గూర్చి ఆయన అతీతశక్తులకు ప్రణమిల్లి

'మనిషికిన్ని మహిమలా
ఘనసిద్ధుల గరిమలా
ఎదలోనే దైవమున్న హనుమలా
ఎదిగితే నీ దేహం తిరిగే తిరుమల' అని

పాడుకున్నది బాలూ విషయంలోనూ నిజమైంది. లేకపోతే ఇన్ని వైవిధ్యంగల పాటలతోపాటు, పాండితీ ప్రమాణాలు మెండుగా నిండుగావున్న వాగ్గేయాలవంటి పాటలు బాలూ పాడగలిగి వుండేవాడా! స్ఫుటమైన తెలుగు సంస్కృత తమిళ కన్నడ పదాలను ఉచ్చారణా సౌలభ్యంతో పాడడానికి మానవ శక్తి కన్న దేవదత్తమైన గళం వుండాలి. అతని కంఠం నిజంగా దేవదత్తమే - ధ్వన్యనుకరణలో గాత్రదానంలో గాత్రపరమైన నటనలో ఇంతటి కళాకారుడు ఇంతవరకు రాలేదు.

బాలూకి సాహిత్యమంటే అమితమైన అభిమానం. ఎక్కడెక్కడి పద్యాలో, గీతాలో అవలీలగా అతని స్మృతిపథంలోనుండి వస్తాయి. 'పెళ్లినాటి ప్రమాణాలు' చిత్రంలో పింగళివారు రాసిన డైలాగులన్నీ నోటికి వచ్చు. రఘురామయ్య గంధర్వగానంలోని 'తాన్'లను అనునాసికంగా ఆ మహానుభావుడే అంటున్నాడా అన్నంతగా వినిపించగల చేవ అతని సొత్తు. డబ్బింగ్ రంగంలో అతని నేర్పు ప్రథమపంక్తిలో నిలబెట్టింది. నిద్రలేచింది మొదలు నిద్రపోయేవరకు నిర్నిద్రగాత్రావధానమే అతని జీవితం. 'నేను సైతం విశ్వఘోషకు తీపిగొంతుకనిచ్చి మ్రోశాను' అనగల మొనగాడు. చిత్రవాణిజ్యంలో తెలుగుపాట విలువ, మర్యాద కాపాడుతూ పాడుతున్నవాడు- పాటల్లోనే కాదు. మాటల్లోను మంచి చమత్కారి. హాస్యం అంటే ఇష్టం. సంగీతం అంటే ప్రాణం. వెరసి అతనొక 'హాసం'! నటుడుగానూ రాణించాడు. వ్యాపారవేత్తగా కొన్ని సినిమాలు నిర్మించి వేలు పోగొట్టుకొని చేతులూ కాల్చుకున్నాడు. ఇటువంటి పనులే ఒకటి రెండు ఇళయరాజా కూడా చేశాడు. ఆమాటకొస్తే ఘంటసాలగారి పేరు ముందు చెప్పాలి.

నేనంటే అతనికి వున్న ప్రేమ, అభిమానం ఇతరులు చెప్పగా వినడానికి అలవాటు పడిపోయాను. కానీ సమక్షంలో ఎప్పుడూ విమర్శించడమే పనిగా పెట్టుకున్న కఠినాత్ముడు. ప్రేమ ఎంత మధురం ప్రియురాలు అంత కఠినం! ఆత్రేయ మాటకు తిరుగేముంది!

ఈ చిరంజీవి నూరు వసంతాలు తెలుగుపాట కోసం ఆరురుతువులూ ఆమనులై పుంస్కోకిలా కల రవంతో నిరంతర గాన గంధర్వుడై వర్ధిల్లాలని తల్లి సరస్వతిని ప్రార్థిస్తున్నాను.

**చిత్రగాన కల్పవృక్షానికి ఫలపుష్పభరితమైన కొమ్మలెన్నో! అందులో ఇళయరాజా ఒక చిటారు కొమ్మ. బాల రసాలసాల అభినవ ఘంటసాల బాలసుబ్రహ్మణ్యం ఒక పుంస్కోకిల ఏ కొమ్మనుంచి పాడినా ఈ కోకిల గానం మధురమే. స్వరాయురస్తు అని దీవించ వలసింది రసజ్ఞ లోకమే....** ■

# అర్థం చేసుకుందాం ఆస్వాదిద్దాం

ఒరే ఒరు ఊరిలే ఒరే ఒరు రాజా
ఒరే ఒరు రాజావుక్కు ఒరే ఒరు రాణి
ఒరే ఒరు రాణి పెట్రాళ్ ఒన్బదు పిళ్లై - అంద
ఒన్బదిలే ఒన్బు కూడ ఉరుప్పడి ఇల్లై
పడిచ్చిరున్దుమ్ తంధైతాయై మదిక్క మఱన్దాన్ - ఒరువన్
పడుక్కైయిలే ముళ్ళై వైత్తుప్పార్తు మగిళ్న్దాన్
పిడిచ్చ ముయల్ అత్తనైక్కుమ్ మూన్రు కాలెన్రాన్ - ఒరువన్
పెండాట్టియిన్ కాల్ గళుక్కుక్కావల్ ఇరున్దాన్
పిళ్ళై పెట్ర రాజా ఒరునాయై వళర్త్తార్ - అదై
పిళ్ళైక్కుమేల్ కణ్‌గళైప్పోల్ కాత్తు వళర్త్తార్
ఉణ్మై అన్బు సేవై ఎన్ఱ మూన్రుమ్ కొడుత్తార్ - అదన్
ఉళ్ళత్తిలే వీడు కట్టి తానుమిరున్దార్
సొన్దమెన్రు వన్దదెల్లామ్ సొన్దము మిల్లై - ఒరు
తుణై యిల్లామల్ వన్దదెల్లామ్ బారము మిల్లై
నన్ఱి ఉళ్ళ ఉయిర్ గళెల్లామ్ పిళ్ళై తానడా - తంబి
నన్ఱికెట్ట మగనైవిడ నాయ్‌గళ్ మేలడా



'పడిక్కాద మేదై' (తమిళం) చిత్రం లోని ఒక సన్నివేశంలో
షావుకారు జానకి, శివాజీ గణేశన్

'పడిక్కాద మేదై' (చదువుకోని మేధావి) అనే తమిళ చిత్రం కోసం కణ్ణదాసన్ రాసిన ఈ పాటకు కె.వి.మహదేవన్ సంగీతం సమకూర్చారు. చిత్రంలో నాయికా నాయకులు షావుకారు జానకి, శివాజీగణేషన్‌ల కోసం శూలమంగళం రాజలక్ష్మి టి.ఎం.సౌందరాజన్ ఈ పాట పాడారు.

'పడిక్కాడ మేదై' తమిళ చిత్రాన్ని సారథీ స్టూడియోస్ వారు తెలుగులో 'ఆత్మబంధువు'గా నిర్మించారు. 'ఆత్మబంధువు' చిత్రానికి దర్శకులు 'భరణి' రామకృష్ణ. సంగీతదర్శకులు కె.వి.మహదేవన్. తెలుగుపాట రచయిత డాక్టర్ సి.నారాయణరెడ్డి. 'ఒరే ఒరు ఊరిలే ఒరే ఒరు రాజా' అనే పాట తెలుగులో 'అనగనగా ఒక రాజు' గా రూపొందింది. నాయికా నాయకులు సావిత్రి ఎన్.టి.రామారావు. సుశీల, ఘంటసాల పాట పాడారు.

తెలుగు పాట గురించి ముచ్చటించే ముందు తమిళగీతం భావం ఏమిటో చూద్దాం:

"ఒకానొక ఊరిలో ఒకానొకరాజు (ఒకే ఒక రాజు)
ఒకానొక రాజుకు ఒకానొక రాణి (ఒకే ఒక రాణి)
ఒకే ఒక రాణి కన్నది తొమ్మండుగురు పిల్లలను - ఆ
తొమ్మండుగురిలో ఒక్కరూ ప్రయోజకులు కారు
చదువుకొన్నా తల్లిదండ్రులను గౌరవించడం మరిచాడు -ఒకడు
పడకమీద ముళ్లుంచి చూచి సంతసించాడు
పట్టిన కుందేళ్ళు అన్నిటికే మూడే కాళ్ళన్నాడు - ఒకడు
పెళ్లాం కాళ్ళకు కావలి కాచాడు
పిల్లలను కన్న రాజు ఒక కుక్కను పెంచారు - దాన్ని
బిడ్డకన్న ఎక్కువగా కళ్లలాగా కాపాడి పెంచారు
సత్యం ప్రేమ సేవ అనే మూడూ ఇచ్చారు - దాని
గుండెలోన ఇల్లుకట్టి తానూ ఉన్నారు
సొంతమంటు వచ్చినదంతా సొంతం కాదు ఏ
తోడులేక వచ్చినదంతా భారమూ కాదు
నెనరు (కృతజ్ఞత) గల జీవులన్నీ పిల్లలేనురా - తమ్ముడూ
నెనరు లేని కొడుకు కన్న కుక్కలు మేలురా"

ఆత్మబంధువు- ఒక పెద్దింట్లో పెరిగిన మంచి మనసున్న మామూలు మనిషి కథ. ఆ ఇంటి పెద్ద ఎస్.వి.రంగారావు రాజు. కన్నాంబ రాణి. తమిళ చిత్రంలోనూ వాళ్ళు ఆ పాత్రలే ధరించారు.

తెలుగుపాట నేపథ్యం గురించి డాక్టర్ సి.నారాయణరెడ్డి తమ 'పాటలో ఏముంది - నా మాటలో ఏముంది'లో ప్రస్తావించారు-

"మూలగీతం... పల్లవి 'ఒరే ఒరు ఊరిలో ఒరే ఒరు రాజా'- ఒకానొక ఊరిలో ఒకనొకరాజు ఈ పంక్తికి అర్థం ఆ తరువాత పంక్తిలో 'ఒకానొక రాజుకు ఒకానొక రాణి' అని ఉన్నట్టు జ్ఞాపకం.

ఆ ట్యూన్‌లోనే ఈ భావాన్నే పొదిగితే బాగుంటుందని దర్శకుని సూచన.

పాప్యులర్ అయిన పాటను అనుసరించకుండా ఎవరు వదులుకుంటారు? పాడే గుణం ఉంది కాబట్టి ఆ ట్యూన్‌లో ఇంచుమించుగా ఆ తెలుగు మాటలనే పాడి చూసుకున్నాను. బాణీ వింటుంటే కలిగిన సంతోషం మాటలకు మనసులో అల్లుకుంటుంటే ఎగిరిపోయింది. అలానే రాస్తే అది తెలుగు పాటలా ఉండదు. ఎలా మరి? కాసేపట్లో దారి దొరికింది. ఆ లయలోనే ఆ బాణీలోనే మాత్రల కూర్పులో కొంచెం స్వేచ్ఛ తీసుకుంటే మంచి తెలుగు పాట రావడానికి వీలుంటుందని దర్శకుడికీ సంగీత దర్శకుడికీ సూచించాను. తెలుగు జానపద గాథల్లో 'అనగనగా ఒకరాజు' అనే ఎత్తుగడ ఉన్నట్టు మొదటి పంక్తిలో ఒరే ఒరు ఊరిలో అనే నిడివికి తగినట్టుగా 'అనగనగా ఒకరాజు' అంటే బాగా సరిపోయిందని ఆ పంక్తినే తరువాతి భాగాన్ని పాడి

వినిపించాను. వెంటనే రామకృష్ణ గారు మహదేవన్ గారు 'బాగుందండీ అలాగే రాయండి' అనేశారు" అని సినారె పేర్కొన్నారు.

తమిళ గీతంలో పల్లవి- 'ఒకే ఒక ఊరిలో ఒకే ఒక రాజు, ఒకే ఒక రాజుకు ఒకే ఒక రాణి, ఒకే ఒకే రాణి కన్నది తొమ్మిదిమంది పిల్లలను ఆ తొమ్మిదిమందిలో ఒక్కరూ అక్కరకు వచ్చేవారు కారు' అని ఉండగా- సినారె రాసిన పల్లవిలో మూలగీతంలో లేని 'రాజు గుణము మిన్న రాణి మనసు వెన్న' అనే పంక్తులు అదనంగా ఉన్నాయి. అందువల్ల మూలగీతంలోని పల్లవిలోని తొమ్మిదిమంది పిల్లల ప్రస్తావన కోసం తెలుగులో ఒక అను పల్లవి జతపడింది. మన జానపదకథల్లో రాజులకు ఏడుగురు పిల్లలు ఉండడం పరిపాటి. ఆ సంప్రదాయాన్ని గుర్తుచేస్తూ సినారె 'ఆ రాజుకు ఏడుగురు కొడుకులున్నారు వారు చదువు సంధ్యలుండి కూడ చవటలయ్యారు ఒట్టి చవటలయ్యారు' అని రాశారు. ఈ చదువు సంధ్యల ప్రసక్తి తమిళగీతంలో తొలి చరణంలో కనిపిస్తుంది.

తమిళగీతంలో నలుగురు కొడుకుల గుణగణాల ప్రస్తావన ఉంది. ఒకడు చదువుకొన్నవాడయినా తల్లిదండ్రులను గౌరవించడు. మరొకడు పడకమీద ముళ్ళు పేర్చేవాడు. మూడోవాడు తాపట్టిన కుందేళ్ళన్నిటికి మూడేసి కాళ్లే అనే మొండి ఘటం. ఇంకొకడు పెళ్లాం కాళ్ల దగ్గర కాపలా ఉండేవాడు. తెలుగులో- పడకమీద తుమ్మముళ్లు పరిచే వాడు, ఇంటిదీపం ఆర్పేవాడు, తల్లిదండ్రులను విషమని తలచినవాడు, పడుచు పెళ్లాం బెల్లమని భ్రమసినవాడు - కనిపిస్తారు.

రాజు కుక్కను పెంచిన వృత్తాంతం తమిళగీతంలో ఉన్నట్టే తెలుగులోనూ ఉన్నా - తెలుగుపాటకు జాతీయత కలిసివచ్చింది.

రాజు పెంచిన కుక్క- కథానాయకుడే.

రాజు- పిల్లలకన్న మిన్నగా కళ్లలాగా పెంచాడని తమిళంలో ఉన్న భావం తెలుగులో 'కంటిపాప కంటె ఎంతో గారవించెను' అని రూపొందింది. తమిళ గీతంలో 'రాజు గుండెలో ఇల్లు కట్టుకొని అందులో ఉన్నాడని' ఉండగా- తెలుగుపాట 'గుండెలో గూడు కట్టి' ఉన్నాడని తెలుగు పలుకుబడిని వినిపిస్తుంది. తమిళంలో రాజు కుక్కకు సత్యాన్ని ప్రేమనూ సేవనూ ఇచ్చాడు. తెలుగులో ప్రేమ అనే పాలుపోసి పెంపుచేశాడు.

అయినవారు అనుకొనే వాళ్ళంతా అయినవారు కారనీ- తోడు నీడ లేకుండా వచ్చి పంచను చేరినవారు భారం కాదనీ తమిళగీతంలో ఉంటే అభిప్రాయం తెలుగులో 'నాది నాది అనుకొన్నది నీది కాదురా నీవు రాయన్నదె ఒకనాటికి రత్నమౌనురా' అని మరొక తీరులో మరింత సూటిగా ఉంది. ఆ ఇంట్లో సేవకుడిగా ఉన్న కథానాయకుడు రాయిలాగా కనిపిస్తున్న రత్నం.

రాజు కన్నుమూశాక కొడుకుల నిర్వాకం వల్ల ఆ కుటుంబం కూలిపోతుంటే - విశ్వాసపాత్రుడైన కథానాయకుడు ఆ ఇంటిని నిలబెడతాడు. 'నీవు రాయన్నదె ఒకనాటికి రత్నమౌనురా' అన్నది తెలుగులో అదనంగా ఉన్న పంక్తి- నాయకుడి పాత్ర గురించి భవిష్య సూచన చేస్తున్నది.

తమిళంలోనూ తెలుగులోనూ కూడా చిత్రం చివర- రాజు పెంచిన కుక్క చేసిన సేవ వల్ల ఆ ఇల్లు నిలిచిన ప్రస్తావన ఉంది. రికార్డులో వినిపించని ఆ తెలుగుపాట భాగం:

కొడుకులతో బాటు రాజు కుక్కను పెంచీ
ప్రేమయనే పాలుపోసి పెంపు చేసెను
కొన్నాళ్ళకు ఆ రాజు కన్నుమూసెను
కుక్క చల్లనైన చూపువలన ఇల్లు నిలిచెను'

తమిళ గీతం పల్లవి ఎత్తుగడకూ తెలుగుగీతం పల్లవి ఎత్తుగడకూ కొద్దిపాటి తేడా కనిపిస్తుంది. తెలుగు గీతానికి తగ్గట్టు మహదేవన్ చేసిన మార్పు అది.

**-పి.ఎస్.గోపాలకృష్ణ**

**ఆత్మబంధువు చిత్రం కోసం డాక్టర్ సి.నారాయణరెడ్డి రాసిన తెలుగుగీతం ఇక్కడ:**

అనగనగా ఒక రాజు అనగనగా ఒక రాణీ
రాజు గుణము మిన్న రాణీ మనసు వెన్న
అనగనగా ఒకరాజు అనగనగా ఒకరాణీ
ఆ రాజుకు ఏడుగురు కొడుకులున్నారు
వారు చదువు సంధ్యలుండి కూడ చవటలయ్యారు
వట్టి చవటలయ్యారు ॥ అనగనగా॥
పడక మీద తుమ్మ ముళ్ళు పరచెనొక్కడు
అయ్యో... ఇంటి దీపమార్పివేయ నెంచెనొక్కడు
తల్లీ తండ్రులు విషమని తలచెనొక్కడు
పడుచు పెళ్ళామె బెల్లమని భ్రమసెనొక్కడు
భ్రమసెనొక్కడు ॥అనగనగా॥
కొడుకులతో పాటు రాజు కుక్కను పెంచీ
ప్రేమయనే పాలు పోసి పెంపుచేసెను
కంటిపాప కంటె ఎంతొ గారవించెను
దాని గుండెలోన గూడు కట్టి ఉండసాగెను
తానుండ సాగెను ॥అనగనగా॥
నాది నాది అనుకున్నది నీది కాదురా
నీవు రాయన్నదె ఒకనాటికి రత్నమౌనురా ॥నాది॥
కూరిమి కలవారంతా కొడుకులేనురా ॥కూరిమి॥
జాలి గుండె లేని కొడుకుకన్న కుక్క మేలురా ॥అనగనగా॥

**సంగీతం: కె.వి.మహదేవన్ గానం: ఘంటసాల, సుశీల**



'ఆత్మబంధువు' చిత్రంలో ఎస్వీ రంగారావు, కన్నాంబ, సావిత్రి, ఎన్.టి.రామారావు

జూన్ 15 శ్రీశ్రీ వర్ధంతి సందర్భంగా...



# చిత్రగీతాల్లో శ్రీలు... సంపదలు....

'సినిమాకతలు చెప్పమాక!' అంటూ ముళ్ళపూడి వారు 'ముత్యాలముగ్గు'లో కాంట్రాక్టర్ పాత్ర చేత అనిపిస్తారు. అంటే సినిమా కథలేవీ నిజం కావు. అవన్నీ ఉత్త అబద్దపు పోగులేనని ఆయన స్పష్టమైన కితాబు ఇచ్చారన్నమాట. అలాటి కథలున్న సినిమాల్లో కొన్ని పాటలూ ఉంటున్నాయి. సినిమాకు కథలు పునాది. ఆ పునాదే అస్తవ్యస్తంగా ఉన్నప్పుడు దానిమీద లేచే భవనంలాంటి పాటలు ఇంకెలా ఉంటాయోనని మనం అనుకునే ప్రమాదం ఉంది. కానీ అలాటి ప్రమాదం ఏదీలేదని సినిమా పాటల్లోనూ ఉత్తమ సాహిత్యాన్ని సృష్టించ వచ్చునని నిరూపించిన ప్రజ్ఞాశాలి శ్రీశ్రీ.

అసలు పాటెలాపుడుతుంది? కష్టంలో సుఖంలో ఉన్నవాడెవడూ గొంతెత్తి పాట పాడడనేది అక్షరాల నిజం. ఎదుట జరిగిన సంఘటనను చూసి చలించిపోయి, కరడుకట్టిన హృదయంతో దారిదోపిడీలు చేసి బ్రతికినవాడు "మానిషాద"! అంటూ శోకాన్ని శ్లోకంగా చెప్పటం ఎంతో అరుదు. ఇంక ప్రకృతిలో వరవశించిపోవటం, ఏదోభావన ఎదలోచేరి గిలిగింతలు పెట్టటం - ఫలితంగా గొంతెత్తి రాగం తీయటం... ఇదంతా చెప్పుకోవటానికి బాగానే ఉంటుంది కానీ, సమాజానికి మాత్రం బహుదూరంగా ఉంటుంది. ఇదంతా గుర్తించే శ్రీశ్రీ ఒకసారి నిర్మొహమాటంగా అన్నారు "సినిమాలలో పాటలన్నీ పెద్దఫార్స్!" అని ఆత్మవిమర్శ చేసుకొని, తనమీద తనే జోకులేసుకుని హాయిగా నవ్వుకో గలగటం ఎంతటి ధీమంతులకో తప్ప అందరికీ సాధ్యమయ్యే పనికాదు. సినీరంగంలో ఉంటూ సినిమాలకు పాటలురాస్తూ, ఆ పాటలన్నిటి పుట్టుకా పెద్ద ఫార్స్ అంటూ చెప్పుకోగలగటం శ్రీశ్రీకే చెల్లింది. అది ఆయనలోని నిక్కమైన నిజాయితీకి నిదర్శనం.



అయితే ఇలాటి ఫార్స్ పాటలనుసైతం ఆషామాషీగా రాయలేదు. 'చాలా సినిమాలకు నేను పాటలు రాశాను. ఆ పాటలలో వ్యక్తమయిన భావాలు చాలావరకు నావికానేకావు. డబ్బిచ్చి రాయించుకొనే నిర్మాతలకు వాళ్ళు ఏంకావాలని కోరారో అవే రాసిపెట్టాను. అది నావృత్తిధర్మం' అని శ్రీశ్రీ అన్నా కానీ నిజానికి చాలాపాటలలో ఆయన తన అభిప్రాయాల్నే స్పష్టంగా చెప్తూ వచ్చారు.

కవిగా సుస్థిరమైన స్థానాన్ని పొందాకనే శ్రీశ్రీ సినీరంగంలోకి

జననం - విశాఖపట్నం - 2-1-1910; తల్లి అప్పన్నకొండ.
తండ్రి - వెంకటరమణయ్య. ఎ.వి.ఎన్ కాలేజి హైస్కూల్లో లెక్కల మాష్టారు.
తల్లిపోయిన ఏడాది - 1911
అ ఆ ఇ ఈ అ ఊలు - 1915
ఎ.వి.ఎన్. కాలేజీ హైస్కూల్లో చదువు మొదలు - 1920
సవతి తల్లి సుభద్రమ్మ పోయిన ఏడాది - 1924
శ్రీశ్రీ ఎస్.ఎస్.ఎల్.సి. - 1925
వెంకట రమణమ్మ గారితో పెళ్ళి - 1925
ఇంటర్మీడియేట్ దాటారు - 1928
మద్రాసు క్రిస్టియన్ కాలేజీలో బి.ఎ. ( జూఆలజీతో జూనియర్) క్లాసులో చేరాడు.
63 రోజులు శ్రీశ్రీకి టైఫాయిడ్ - 1930
బి.ఎ.పూర్తి. 1931
ఏ.వి.యన్. కాలేజీలో డిమాన్‌స్ట్రేటర్ (కప్పల మేస్టారు)
మద్రాసు ఆంధ్రప్రభలో సబ్ ఎడిటర్ - 1938
ఆలిండియా రేడియోలో కొత్త ఢిల్లీలో ఉద్యోగం - 1942
లక్నోలో మిలట్రీలో లేబరేటరీ అసిస్టెంట్ - 1942
తండ్రి వెంకటరమణయ్య కాలధర్మం - 1945
నిజాం నవాబు గారి రిఫార్మ్ సెక్రటేరియట్‌లో ఉద్యోగం - 1946
ఆనందవాణిలో ఉద్యోగం - 1946-49
మద్రాస్ రాయపేటలో మకాం - గుర్రపు పందాలు సరదా - 1947
చుట్టాలమ్మాయిని పెంచుకుని - "లెనినా" అని పేరు పెట్టుకున్నాడు - 1949
నళినికుమార్‌తో స్నేహం - 1950
హెల్సెంకీలో జరిగిన ప్రపంచ శాంతి మహాసభకు ప్రతినిధి. రష్యా, పారిస్, లండన్ పర్యటన - 1954
ఆంధ్ర పత్రికలో దుమారం - శ్రీశ్రీకి పిచ్చెక్కింది - 1955
ఉపద్రష్ట సరోజినితో వివాహం - 1956
కూతురు పుట్టడం - 1959
కుమారుని జననం - 1963
సోవియట్ రష్యాకు రెండవసారి - 1967
విశాఖపట్టణంలో షష్టిపూర్తి మహోత్సవాలు - 1970
శ్రీశ్రీ సాహిత్యం కె.వి.ఆర్. సంపాదకత్వాన ఆరు వాల్యూములుగా ప్రచురణ.చలంగారిని కలుసుకోవడం -
ప్రపంచ తెలుగు మహాసభలలో అరెస్ట్ / విడుదల - 1975
చైనా యాత్ర - 1976
శ్రీ రాజాలక్ష్మి ఫౌండేషన్ వారి మొదటి అవార్డ్ పదివేల రూపాయల బహుమతి - 1979
కాకినాడలో సప్తతి పూర్తి సభ - 1980
విరసం సభ్యత్వం రద్దు - పురిపండాతో లండన్ ప్రయాణం
శ్రీశ్రీ అమెరికా ప్రయాణం శ్రీమతితో - 1981
జూన్ 15న అస్తమయం - 1983



శ్రీశ్రీ 1950 లలో 'ప్రపంచం' అనే సినిమాలో కనబడ్డారు. తరువాత చాలా కాలానికి జి.వరలక్ష్మి నిర్మించి, దర్శకత్వం వహించిన 'మూగజీవులు' అనే చిత్రంలో కొంతమంది కవులతో పాటు కనిపించారు. పెళ్ళిపెద్దగా అభినయించిన ఈ దృశ్యం మాదల రంగారావు నిర్మించిన 'మహాప్రస్థానం' చిత్రంలోనిది.

ప్రవేశించారు. ఇది నిజంగా ఇప్పటి పరిస్థితికి పూర్తి భిన్నం. కొందరి పేర్లు మనం తెరమీద చూసాకాకానీ, వాళ్ల అసలు కవులని, వాళ్ళేదో కవిత్వం వెలగబెట్టగలరని మనకు తెలీదు. ఆ తర్వాత అదృష్టం కలిసివచ్చి, పాటలు హిట్ "అయ్యో", కాకుంటే ఆ పాటల్లో ఉండే అసలు అర్థం అందరికీ పట్టటం వల్లనో ఆ పాటకారుడు కవి అయి కూర్చుంటున్నాడు. ఇది ఇప్పటి పరిస్థితి. కానీ శ్రీశ్రీ ముందు కవి, ఆ తర్వాతే ఆయన సినీ కవి అయ్యాడు. ఆయన సినిమాలకోసం రాసిన తొలిపాట ''ఆహుతి'' చిత్రంలో ఉంది. "ప్రేమయే జనన మరణ లీల!" అనేది ఆ పాట. ఆ పాట రాయటానికి చాలకాలం ముందే "మహాప్రస్థానం" పాట "కాలచక్రం" చిత్రంలో వచ్చింది. "ప్రేమయే జనన మరణ లీల" పాట రచయిత శ్రీశ్రీ అని మనం వినకపోతే నిజంగా ఆ పాట శ్రీశ్రీ రాశారనుకోం. ఆ పాటలో అధిక భాగం సంస్కృత సమాసాలే. మృత్యుపాశం, అమరబంధం, యువప్రాణులు, హృదయనందనం, సుకృతజన్మం, మధురమధురతనం- నిజంగా ఈ పదాలేవి శ్రీశ్రీ సొంతంగారాసి ఉంటారనుకోనక్కర్లేదు, ఆహుతి చిత్రమే డబ్బింగ్ కాబట్టి పెదాల కదలికకు కలిసే విధంగా భాషను చూసుకోవటం శ్రీశ్రీకి తప్పనిసరైంది. అంటే శ్రీశ్రీ రాజీపడటం ఆరంభమైందన్నమాట!!



అయితే ఈ రాజీ ఆ తర్వాత ఆయన సినీ జీవితంలో చాలా తక్కువగా కనిపిస్తుంది. నిలదొక్కు కోవటంకోసం ఆయన "చెవిలోరహస్యం" లాటి అరవడబ్బింగ్ చిత్రాన్ని తీసినా ఆ తర్వాత చెంపలేసుకున్నారు. నేర్చుకోదల్చినవాడికి జీవితం అంతా పాఠాలు నేర్పుతోందన్నట్లుగా ఆయన ఆ చిత్రనిర్మాణానుభవంతో పెట్టుబడిదారీ వ్యవస్థను ద్వేషించటం ఆరంభించారు. ఆ ద్వేషం ఆ తర్వాత ఆయన రాసిన ఎన్నో పాటల్లో కనిపిస్తుంది.

'ప్రపంచమంతా పైసాకోసం ఒకటే ఆరాటం
పైసాశక్తి పైసాముక్తి కాసే కైలాసం' అన్న నిజాన్ని చెప్పినా
'ప్రతి మనిషి మరియొకని దోచుకొనేవాడే
తన సౌఖ్యం తన భాగ్యం చేసుకొనేవాడే'
అని నిరసించినా
'అధికారం వీరికి కత్తి
అపకారం వీరికి వృత్తి
దేశాన్నే ఇరుకున పెట్టి
సిరులన్నీ దోచేస్తారు' అని వారి నైజగుణం బయటపెట్టినా శ్రీశ్రీ చెప్పేదంతా ఒకటే - పైసా కోసం ప్రతివాడూ ఇంకొడినే కాదు, దేశాన్నేదోచేస్తున్నాడని!

కానీ అలా ఎంత కాలం??
"ఇతరులకష్టం దోచుకుతినటం
ఇకపై సాగే పనికాదు!"
"ఏకమైన శ్రమశక్తికి
ఎదురులేదు ఈ లోకంలో"
"ప్రజాబలం పేదల విప్లవం
చెలరేగేవరకే చెలగాటం!" అని శ్రీశ్రీ ఆ దోపిడి ఎపుడు ముగుస్తుందో, ఎలా ముగుస్తుందో కూడా చెప్తారు.

శ్రీశ్రీ పాటల్ని కొంచెం జాగ్రత్తగా పరిశీలిస్తే కొన్ని కొన్ని భావాల్ని ఆయన పదే పదే చెప్పటం కనిపిస్తుంది. మొద్దబ్బాయిలు విద్యార్థులుగా ఉంటే మాస్టారు తన పాఠం పదే పదే చెప్పితీరాల్సి ఉంటుంది. శ్రీశ్రీ బహుశా ఆ టెక్నిక్కే ఉపయోగించి, తను ఏం చెప్తున్నారో గ్రహించేంతవరకు వదలనన్న రీతిలో గీత రచన సాగించారనిపిస్తుంది.

ఆత్రేయగారి దర్శకత్వంలో వచ్చిన "వాగ్దానం" చిత్రంలో ఓపాట ఉందది. ఆపాటలో ఓచోట శ్రీశ్రీ- "ఎవరోవచ్చి సాయం చేస్తారనుకోవటమే పొరపాటు!" అని. ఆదే పాట మళ్ళీ "భూమికోసం"లో "ఎవరో వస్తారని, ఏదో చేస్తారని ఎదురుచూసి మోసపోకుమా!" అంటూ మళ్ళీ ప్రయోగించాడు. ''అల్లూరి సీతారామరాజు'' చిత్రంలోని పాట "తెలుగువీర లేవరా!"లో "శృంఖలాలు పగులగొట్టి, తుదిసమరం మొదలుపెట్టి...." అంటూ ఓ చరణం ఉంది. అదే భావం మళ్ళీ ప్రజాశక్తి చిత్రంలోని టైటిల్ సాంగ్‌లో 'బంధనాలు పగులగొట్టి, ప్రాణాలను పణంపెట్టి... తుది సమరం సాగిస్తూ...." అన్నచోట ప్రతిధ్వనిస్తుంది. అలాగే వెలుగునీడలు చిత్రంలో " ఓ రంగయో పూలరంగయో" పాటలో "కడుపారగ కూడులేని, తలదాచగా గూడులేని ఈ దీనుల జీవితాలు మారుటెన్నడో?.... కలవారలు లేనివారల కష్టాలను గుర్తించి తీర్చగలిగినపుడే...." అంటారు. అదే భావం అంతక్రితం ఎపుడో వచ్చిన శ్రీశ్రీ సొంత చిత్రం 'చెవిలోరహస్యం' లో 'గుణవంతులు, ధనవంతులు భగవంతుని సాక్షిగా ధనహీనుల కష్టాలను తొలగించుట ధర్మము అని వినిపిస్తుంది! తోడికోడళ్ళు చిత్రంలోని "నలుగురు కలిసి పొరుపులు మరిచీ" పాటలో "నేలా నీరూ గాలీ వెలుగూ కొందరి సొత్తని అనరాదూ, అవి అందరి హక్కై అలరారు" అన్న భావం మళ్ళీ ఏళ్ళ 'పాడిపంటలు'



శ్రీశ్రీ ఇంటి లోపలి భాగం

లోని 'పనిచేసే రైతన్నా' పాటలో 'నేల మనది నింగి మనది గాలినీరు వెలుగు మనది!' అన్న చరణంలో పునర్దర్శనం ఇస్తుంది. ఇలా ఎన్నో భావాలు మళ్ళీ మళ్ళీ మనకు శ్రీశ్రీ పాటల్లో కనిపిస్తొంటే "నా పాటలోని భావాలేవీ నావి కావు, నా నిర్మాతలు ఏంచెప్తే అదే పాటలోకి దింపాను!" అని శ్రీశ్రీ అంటే మాత్రం నమ్మటం ఎలా సాధ్యం!



శ్రీశ్రీకి సమైక్యశక్తి మీద అపారమైన నమ్మకం. వ్యవసాయానికి నాగలి పట్టినా, విప్లవం కోసం ఆయుధాలెత్తినా ఐకమత్యంతో ఉండాలనేది ఆయన సూత్రం. "ఒక్కొక్క వ్యక్తీ సమస్త శక్తీ ("సమస్త వృత్తుల సహస్ర చిహ్నాల్...') ధారపోసి పని చెయ్యాలి!" అని కలసి మెలసి నిలబడదాం, వ్యథలు బాధలు పోగొడదాం!" అనీ, 'కలసిరండి కదలిరండి తెలుసుకొండి మనగమ్యం' అనీ, ప్రజాశక్తి "కలసిమెలసి ఒకటయింది, తన సత్తువ తెలుసుకొంది" అని శ్రీశ్రీ సమైక్య శక్తిని ప్రతిచోట గుర్తుచేస్తూ వచ్చారు. అంతటి సమైక్య శక్తితోటి ఏం సాధించాలి?-" సమసమాజ నిర్మాణమే నీ ధ్యేయం, సకల జనుల సౌభాగ్యమే నీ లక్ష్యం!" కాదా మరి చెప్పండి!



కవి అన్నవాడికి భవిష్యయద్దర్శనం ఉండి తీరాలి, రేపు రవిగాంచేది నేడు కవిగాంచాలి. ఆ గొప్పతనమూ శ్రీశ్రీలో పుష్కలంగా ఉంది. ఏళ్లూ పూళ్లూ వెనుకనెపుడో శ్రీశ్రీ రాసిన పాట ఒకటి అక్షరమ్ముక్క మార్పు చేసుకోకపోయినా నేటికీ అది అక్షరసత్యంగా నిలుస్తోందనేది నిజం- అపుడు ఆనాటి సమాజం గురించి శ్రీశ్రీ రాసినా, ఆ రచనలన్నీ నేటి సమాజానికి అక్షరాలా వర్తిస్తున్నాయి.

**"అవినీతి బంధుప్రీతి చీకటిబజారు**

**................**

**పదవీ వ్యామోహాలు కులమత భేదాలు**

**భాషా ద్వేషాలు చెలరేగె నేడు...."**

ఏ పేపరు తిరగేసినా తేదీలో మార్పు తప్ప వార్తల్లో ఇంతకు మించిన విశేషాలు ఏముంటున్నాయో చెప్పండి! శ్రీశ్రీ ఎపుడో గోలపెట్టి గగ్గోలు చేసి ప్రపంచం దృష్టికి "పతితులారా, భ్రష్టులారా బాధాసర్ప దష్టులారా...." అంటూ అందర్నీ పరిచయం చేసి "తాజ్‌మహల్ నిర్మాణానికి రాళ్లెత్తిన కూలీల"కు గంగా గోదావరి నాగరికతల్లో నివసిస్తున్న సామాన్యులకూ ఈ ప్రపంచపు సిరిసంపదలలో భాగం ఏదీ, ఎక్కడుందీ? అనడిగినా భాగం సంగతి దేవుడెరుగు కనీసం వారికి వార్తాపత్రికలలో సైతం చోటు లేకుండా శ్రీశ్రీ చెప్పిన అవినీతి... ఎట్‌సెట్రాలే దేశాన్ని ఆక్రమించేస్తున్నాయన్న నిజాన్ని ఎవరు కాదనగలరు?

అందుకే శ్రీశ్రీ చివరి క్షణాల వరకూ ఆ అన్నార్తులు, బాధార్తుల గురించే పలవరించి వెళ్ళిపోయాడు. "బలవంతులు దోచేసిన రాజ్యం, ప్రజలందరకీ భోజ్యంకాదా?" అని ప్రశ్నించుకుంటూ సందేహిస్తూనే ఆయన తన చివరి గీతాన్ని పూర్తిచేశారు.

ఇప్పటి పరిస్థితి చూస్తే సామాన్యుని జీవితం మరీ దుర్భరమవుతోంది. రోజురోజుకూ బతుకుకు ఉరి బిగిసిపోతోంది. ఇలా బిగిసిన ఉరికి ఏదో ఓ రోజు అంతం తప్పదు. ఆ రోజే మానవుడుదయించే వేళ అవుతుంది. ఆరోజుకోసం ఆత్రంగా ఎదురు చూడటమే మనకు మిగిలిందనుకొంటే పొరపాటే. **"అదునుచూసి పదును చేసి అన్నిటినీ అదుపుచేసి మన దారికి మళ్ళిద్దాం! తరుగులేని సంపదనే కురిపిద్దాం!!"**

శ్రీశ్రీ ఓ మహోన్నత శిఖరం. ఉత్తుంగ తరంగం. ఆ శిఖరాన్ని ఓ చిన్న అద్దంలో చూపటం సాధ్యం కాదు. ఆ ఉత్తుంగ తరంగాన్ని చెమ్చాతో కొల్చేదీ సాధ్యం కాని పని. ఆయన బహుముఖ ప్రజ్ఞలో సినిమా సాహిత్యం ఓ కోణం మాత్రమే. అక్షరరాస్యులకు శ్రీశ్రీ పెట్టిన భిక్ష మహాప్రస్థానమైతే, నిరక్షరాస్యులకు శ్రీశ్రీ ఇచ్చిన వరం సినిమా పాట. మనిషి ఉన్నంత కాలము శ్రీశ్రీ పాటలు "అక్షరాలై" నిత్యమూ నిలుస్తాయి. శబ్దాన్ని, అర్థాన్ని శాసించిన శబ్ద బ్రహ్మ శ్రీశ్రీ గురించి వివరంగా చెప్పాలంటే తెలుగు భాష మరిన్ని అక్షరాలను సంపాదించుకోవాలన్నది నిజం.

**-పాలకోడేటి సత్యనారాయణరావు**

# సినిమా పాటల గురించి శ్రీశ్రీ

'ప్ర.జ' శీర్షిక ద్వారా పాఠకులు అడిగిన ప్రశ్నలకు శ్రీశ్రీ జవాబులిచ్చేవారు. సినిమా పాటల గురించి ఆయన సమాధానాలు కొన్ని -

- ఉద్యోగం కోసం నేను గోల్డ్‌స్మిత్ 'వికార్ ఆఫ్ వేక్‌ఫీల్డ్'లో 'ప్రిమ్‌రోజ్' లాగ ఆసేతుహిమాచల పర్యంతం పర్యటన చేశాను. ఆఖరికి మద్రాసు సినిమాలో సెటిలయాను. అది కేవలం యాక్సిడెంటల్.
- పాశ్చాత్య దేశాలలో మ్యూజికల్స్ అని వేరే ఉంటాయి- 'మై ఫేర్ లేడీ' (ఒపేరా) లాంటివి. మన సినిమాల్లో కత్తిసామూ దాన్లోనే ఉండాలి. రేప్‌లూ దాన్లోనే ఉండాలి. పాటలూ కావాలి. ఇప్పుడున్న పరిస్థితుల్లో కమర్షియల్ సినిమాలో పాటలు చాలా అవసరం.



- జానపదరూపాలని ఇమిటేట్ చేయడమే ఈనాడు సినిమా పాటలు ఇంత పాపులర్ కావడానికి కారణమని నేను నిస్సందేహంగా చెప్పగలను.
- కొన్ని సినీ గీతాల్లో విప్లవ భావాలు విరజిమ్మే శ్రీశ్రీ, జేమ్స్‌బాండ్ చిత్రాలకు సాధారణ గీతాలు రాసిన శ్రీశ్రీ ఒకడే. సినీ అవసరాలకు సాధారణ గీతాలు కూడా కావాలి.
- ప్రొడ్యూసర్లు భక్తి చిత్రాలు తీస్తున్నంత కాలం నేను లేకపోతే మరొకరు పౌరాణిక చిత్రాలకు రాస్తారు. రావలసింది ప్రజల్లోనే భక్తి మీద తిరుగుబాటు.
- సినిమా పాటల్లో ఎప్పుడో తప్ప నా సొంత అభిప్రాయాలు ప్రకటించడానికి అవకాశముండదు. ప్రొడ్యూసర్ల ఇష్టానికి, వారు తీసే కథల స్వభావానికి అనుగుణ్యంగా పాటలు రాయాలి.
- నేను రాసిన వాటిల్లో ఎక్కువ విప్లవాత్మకమైన పాట - సినిమాల్లో అయితే 'అల్లూరి సీతారామరాజు' చిత్రంలోని 'తెలుగువీర లేవరా' అనే పాట. విడిగా రాసిందయితే 'ఊగరా ఊగరా' అనే పాట.

# శ్రీశ్రీ సినీగీతాలు

## చిత్రం : ఆహుతి

సంగీతం :యస్.రాజేశ్వరరావు  గానం: ఘంటసాల

ప్రేమయే జనన మరణ లీల
మృత్యుపాశమే అమరబంధమౌ
యువప్రాణుల మ్రోల ॥
ఆకాశమె చేరువయై తోచె
అలలే పొంగి హాయిగ వీచె
జీవితమంతా ఒకే పాటగా
ఎప్పటికీ మనమే ॥
మధుర మధురతరమైన వాంఛలే
హృదయ సదనమును పరిపాలించె
సుకృతజన్మము మాదే సఫలం
సుఖమే ఏ వేళ ॥
తను సాంగత్యము త్రుటియే కాదా
నిలుచు దృఢముగా మానసగాధ
మృత్యుపాశమే అమరబంధమౌ
యువప్రాణుల మ్రోల ॥

## చిత్రం : వెలుగు నీడలు

సంగీతం : పెండ్యాల  గానం: ఘంటసాల, పి.సుశీల

పాడవోయి భారతీయుడా - ఆడి
పాడవోయి విజయగీతిక ॥పాడవోయి॥
నేడే స్వాతంత్ర్య దినం-వీరుల త్యాగఫలం
నేడే నవోదయం - నీదే ఆనందం ॥పాడవోయి॥
స్వాతంత్ర్యం వచ్చెననీ సభలే చేసి
సంబరపడగానే సరిపోదోయి
సాధించినదానికి సంతృప్తిని పొంది
అదే విజయమనుకుంటే పొరపాటోయి
ఆగకోయి భారతీయుడా - కదలి
సాగవోయి ప్రగతిదారుల ॥పాడవోయి॥
ఆకాశం అందుకొనే ధరలొకవైపు
అదుపులేని నిరుద్యోగమింకొకవైపు
అవినీతి, బంధుప్రీతి, చీకటి బజారు
అలముకొన్న నీ దేశం ఎటు దిగజారు?
కాంచవోయి నేటి దుస్థితి - ఎది
రించవోయి ఈ పరిస్థితి ॥పాడవోయి॥
పదవీ వ్యామోహాలు, కులమత భేదాలు
భాషాద్వేషాలూ చెలరేగే నేడు
ప్రతి మనిషి మరియొకని దోచుకొనేవాడే
తన సౌఖ్యం, తన భాగ్యం చూచుకొనేవాడే
స్వార్థమిూ అనర్థకారణం - అది
చంపుకొనుటె క్షేమదాయకం
సమసమాజ నిర్మాణమె నీ ధ్యేయం
సకలజనుల సౌభాగ్యమె నీ లక్ష్యం
సమసమాజ నిర్మాణమె నీ ధ్యేయం
సకలజనుల సౌభాగ్యమె నీ లక్ష్యం
ఏక దీక్షతో గమ్యం చేరినవాడే
లోకానికి మన భారతదేశం
అందించునులే శుభ సందేశం
లోకానికి మన భారతదేశం
అందించునులే శుభ సందేశం

## చిత్రం : ఆరాధన

సంగీతం : యస్.రాజేశ్వరరావు  గానం: ఘంటసాల

నా హృదయంలో నిదురించే చెలీ!
కలలలోనే కవ్వించే సఖీ
మయూరివై వయారివై నేడే
నటనమాడి నీవే
నన్ను దోచినావే  ॥నా హృదయంలో॥
నీ కన్నులలోన
దాగెనులే వెన్నెలసోన
చకోరమై నిను వరించి
అనుసరించి నానే
కలవరించి నానే  ॥నా హృదయంలో॥
నా గానములో నీవే
ప్రాణముగా పరిమళించినావే
పల్లవిగా పలుకరించరావే
నీ వెచ్చని నీడ
వెలసెను నా వలపుల మేడ
నివాళితో చేయిచాచి ఎదురు చూచినానే
నిదుర కాచినానే  ॥నా హృదయంలో॥

## చిత్రం : మనుషులు మారాలి

సంగీతం:కె.వి.మహదేవన్  గానం:యస్.పిబాలు, పి.సుశీల

తూరుపు సిందూరపు
మందారపు వన్నెలలో
ఉదయరాగం, హృదయగానం
మరలమరల ప్రతియేడూ
మధుర మధుర గీతం
జన్మదిన వినోదం  ॥తూరుపు॥
వేనవేల వత్సరాల కేళిలో
మానవుడుదయించిన శుభవేళలో
వీచె మలయమారుతాలు
పుడమి పలికె స్వాగతాలు
మాలికలై తారకలే
మలిచె కాంతి తోరణాలు  ॥తూరుపు॥
వలపులోన పులకరించు కన్నులతో
చెలిని చేరి పలుకరించు మగవాడు
మనసులోన పరిమళించు వెన్నెలతో
ప్రియుని చూసి పరవశించు ప్రియురాలు
జీవితమే స్నేహమయం
ఈ జగమే ప్రేమమయం
ప్రేమంటే ఒక భోగం
కాదు కాదు అది త్యాగం  ॥తూరుపు॥

## చిత్రం : డాక్టర్ చక్రవర్తి

సంగీతం:యస్.రాజేశ్వరరావు  గానం:ఘంటసాల

మనసున మనసై బ్రతుకున బ్రతుకై
తోడొకరుండిన అదే భాగ్యము అదే స్వర్గము॥
ఆశలు తీరని ఆవేశములో
ఆశయాలలో ఆవేదనలో
చీకటి మూసిన ఏకాంతములో
తోడొకరుండిన అదే భాగ్యము అదే స్వర్గము॥
నిన్ను నిన్నుగా ప్రేమించుటకు
నీకోసమె కన్నీరు నించుటకు
నేనున్నానని నిండుగ పలికే
తోడొకరుండిన అదే భాగ్యము, అదే స్వర్గము॥
చెలిమియె కరువై, వలపే అరుదై
చెదరిన హృదయమె శిలయైపోగా
నీ వ్యధ తెలిసీ నీడగ నిలిచే
తోడొకరుండిన అదే భాగ్యము అదే స్వర్గము॥

## చిత్రం : పునర్జన్మ

సంగీతం: టి.చలపతిరావు  గానం:ఘంటసాల

ఓ సజీవ శిల్ప సుందరీ
నా జీవనరాగ మంజరీ
ఎవరికో...ఎవరికో
ఎవరివో నీ వెవరివో
ఎవరివో ఎవరివో
నా భావనలో నా సాధనలో
నాట్యము చేసే రాణివో  ॥ఎవరికో॥
దివినే వదలి భువికేతెంచిన
తేనెల వెన్నెల సోనవో
కవితావేశమె కలలై అలలై
కురిసిన పూవుల వానవో  ॥ఎవరికో॥
నవ వసంతమున నందనవనమున
కోయిల పాడిన పాటవో
వలపు కొలనులో కలకల విరిసిన
కలువల కన్నుల కాంతివో  ॥ఎవరికో॥
నీ కర కంకణ నిక్వణమా - అది
వాణీ వీణా నినాదమా
నీ పద నూపుర నిస్వనమా - అది
జలధి తరంగ మృదంగ నాదమా
రావే మోహన గీతమా
రావే నూతన తేజమా
రావే రావే

## చిత్రం :వెలుగు నీడలు

సంగీతం:పెండ్యాల  గానం:ఘంటసాల

కలకానిది, విలువైనది - బ్రతుకు
కన్నీటి ధారలలోనే బలిచేయకు  ॥కల॥
గాలివీచి పూవుల తీగ నేల రాలిపోగా
జాలి వీడి అటులే దాని వదలివైతువా
చేరదీసి నీరుపోసి చిగురించనీయవా  ॥కల॥
అలముకొన్న చీకటిలోనే అలమటించనేలా
కలతలకే లొంగిపోయి కలవరించనేలా
సాహసమను జ్యోతిని చేకొని సాగిపో  ॥కల॥
అగాధమౌ జలనిధిలోన ఆణిముత్య మున్నటులే
శోకాల మరుగునదాగి సుఖమున్నదిలే
ఏదీ తనంతతానై నీ దరికి రాదు
శోధించి సాధించాలి, అదియే ధీరగుణం॥కల॥

# హరి నాగభూషణం (1884 - 1959)






ద్వారం వెంకటస్వామి నాయుడు పేరు స్మరించగానే వాయులీనం..

వాయులీనాన్ని తల్చుకోగానే ద్వారం వారు స్ఫురించడం సహజం.... అంత మమేకమైపోయాయి ఆ రెండూ.....

అయితే ద్వారం వారి సమకాలీకుల్లో గూడా ద్వారం వారి అంతటి విద్వత్తు ఉండీ కూడా..... అంత పేరు ప్రతిష్టలు లేకపోవడం కేవలం దురదృష్టం....

రాజకుమారి మొగుణ్ణి 'ఏరాల్సిన' ఏనుగు.... దండపుచ్చుకుని... సమాన ప్రతిభ ఉన్న ఎంతమంది దగ్గరికొచ్చినా దండేసేది ఒకడి మెళ్ళోనే గదా!....

అయనే రాకుమారి భర్తయిపోతాడు... ఉత్తరోత్తరా రాజైపోతాడు... రాజ్యం ఏల్తాడు!! మిగతావాళ్ళు... ప్రజల్లా ఉండిపోతారు! అయితే.... వీళ్ళంతా దురదృష్టవంతులు కాకపోవచ్చు.

అందులో కొంతమంది... నిష్కామ కర్ములుంటారు.

అదిగో అలాంటి నిష్కామ కర్ముడు

హరినాగభూషణంగారు.

కృష్ణాజిల్లా మచిలీపట్టణంలో

24.12.1884 లో జన్మించారు.

ఆయన తండ్రి నృసింహశాస్త్రిగారు. ఆయన 13వ ఏటనే ఆనందభైరవి, రీతిగౌళ, మలయమారుత రాగాల్లో తాన వర్ణనలు రాసిన దిట్ట...

అంతటి తండ్రిగారే స్వయంగా సంగీత శిక్షణ ఇచ్చారు నాగభూషణానికి.

హరి నాగభూషణం... సంగీతం ఆరంభించాడు.....

పురందరదాసు కీర్తనలు, అన్నమాచార్య కీర్తనలు... ముత్తుస్వామి దీక్షితారు కీర్తనలు, రామదాసు కీర్తనలు.....!

అయితే... హరినాగభూషణానికి ఓ విచిత్రమైన అలవాటు ఉండేది! పురందరదాసు కీర్తనలు పాడుతూ... కళ్ళు మూసుకునీ ధ్యానంలోకి వెళ్ళిపోయీ.... పురందర దాసే పాడుతున్నట్టు భావన చేసేవాడు....

అదిగో పురందరదాసు కర్ణాటక వీధుల్లో పాండురంగని సేవించుకుంటూ.... అన్ని వీధుల్లోనూ తిరుగుతోంటే....

బుల్లి హరి నాగభూషణం... ఆయనతో వెళ్తున్నట్టు... ఆయన గొంతుతో గొంతు కలుపుతున్నట్టూ.....

అలాగే.... త్యాగరాజస్వామి కృతుల దగ్గరకొచ్చీ ఎంత తాదాత్మ్యం చెందేవాడంటే... తన మనస్సు ఆ రాగాల్లో తేలీ... త్యాగరాజస్వామివారి ఇంటికెళ్ళిపోయీ... ఆయన శ్రీరామ పంచాయనం ముందు ఘనరాగ పంచకాలు పాడ్తోంటే....

రెప్పవాల్చకుండా.... త్యాగరాజస్వామినే చూస్తో... ఉండేవాడు.

అయన హారతి ఇస్తే... కళ్ళకద్దుకునేవాడు.

ఆయన ప్రసాదం పెడ్తే తినేవాడు.

తను త్యాగరాజ స్వామివారి పక్కనున్నట్టు కొన్నిసార్లూ... తను పాడ్తోంటే త్యాగరాజస్వామి వారు నవ్వుతో సరిదిద్దినట్టూ... బుగ్గ పుణికిపుచ్చుకొని ముద్దాడినట్టూ...

సంగీతం అంతా వచ్చేసరికి హరినాగభూషణం త్యాగరాజస్వామి వారికి ఏకలవ్య శిష్యుడై పోయాడు...

శిష్యుడై పోవడమేమిటీ... త్యాగరాజస్వామి వారికి భక్తుడైపోయాడు!

కళ్ళుమూస్తే త్యాగరాజస్వామి... కళ్ళు తెరిస్తే త్యాగరాజస్వామి!

ఆయనే ఆవహించినట్టు గానం చేసేవాడు...

ఆయనే విని ఆనందిస్తున్నట్టు ఉప్పొంగిపోయేవాడు!

ఈలోగా ఒక శుభవార్త....

మచిలీపట్టణానికి త్యాగరాజస్వామి శిష్యుడైన 'నయక్కారుపట్టై' సుబ్బయ్య కుమారుడు... శేషయ్య సంగీత కచేరీ ఇవ్వడానికి వొస్తున్నట్టు....

అంతే.... హరినాగభూషణం ఆనందానికి అంతులేదు

సాక్షాత్తు త్యాగరాజస్వామి వారి శిష్యుడి కొడుకు...

అంతే ఇతను కూడా స్వామివారిని చూసి ఉంటాడు... పట్టుకుని ఉంటాడు... ముట్టుకుని ఉంటాడు... ఆ మహానుభావుడు సంచరించిన ప్రదేశంలో తిరిగి ఉంటాడు... చాలు!! తనకి అది చాలు.... అంతే.... స్వయంగా శేషయ్య విడిది చేసిన దగ్గరకెళ్ళిపోయీ.....

ఆయన కాళ్ళమీదపడీ!... 'ప్రవర' చెప్పాడు!!

తనకి వాయులీనం వాయించడం వొచ్చుననీ కనీసం ఒక్క కీర్తనకి సహకార వాయిద్యం వాయిస్తాననీ కళ్ళతో వేడుకున్నాడు!!

ముచ్చటపడిపోయాడు శేషయ్య...

"ఒక్కటేమిటీ కచేరీ మొత్తం నువ్వే వాయించు"!!

దొరకునా ఇటువంటి సేవా... అనుకుంటూ వెళ్ళిపోయాడు.

మర్నాడు మచిలీపట్నంలో శేషయ్య కచేరీ... హరినాగభూషణం వాయులీనం...

స్వరగంగ పొంగుతోంది!...

ఫిడేలుమీద కమానులో సంగీత సాగర మథనం చేస్తున్నాడు హరి - నాగభూషణం...

అమృతం చిందుతోంది... ఆస్వాదిస్తున్నారు శ్రోతలు

సభముగిసింది!... 'అద్భుతంగా వాయించావోయి కుర్రాడా' అన్నట్టు చూశాడు శేషయ్య...

అంతా 'త్యాగరాజస్వామికృప' అనుకున్నాడు బాల హరి!!

ఇంకెందుకు పద.... అంటూ చెన్నపట్నం పట్టుకుపోయాడాయన

పెద్ద పెద్ద విద్వాంసులందరి దగ్గరగా.. కచేరీలు చేస్తూ...

ఒక్కసారి... త్యాగరాజస్వామి వారి ఆరాధనోత్సవాల్లో పాల్గొన్నాడు!!

హరి నాగభూషణం

అంతే!...

త్యాగరాజస్వామి వారి సమాధి మీదకెళ్ళి సాష్టాంగపడీ....

ఏడున్నా కీర్తన అందుకున్నాడు... 'గురుదేవా వినవా' అంటో....

పులకించిన త్యాగరాజాత్మ... ఆశీర్వదించింది!

చిటికెడు విభూదిని నోట్లో వేసుకునీ.. ఆంధ్రదేశం బైలుదేరాడు!

(బాలాంత్రపు రజనీకాంతరావుగారు రాసిన ఆంధ్రవాగ్గేయకార చరిత్రము చదివి, స్పందించి)

-భరణి

ఈ వ్యాసంపై అభిప్రాయాన్ని శ్రీ తనికెళ్ళ భరణికి తెలియజేయ దలచుకునే వారు

**తనికెళ్ళ భరణి,**

**కేరాఫ్: "హాసం", 502, శ్రీబాలాజీ నిలయం, 13-1-212,**

**మోతీనగర్, హైదరాబాదు - 500 018**

**అడ్రసుకు ఉత్తరాలు పంపాలి.**

రావడం రావడం... ఇంట్లో త్యాగరాజస్వామి వారి విగ్రహాన్ని ప్రతిష్ట చేసి ఆ సంవత్సరం తన ఇంట్లోనే ఆరాధనోత్సవాలకి శ్రీకారం చుట్టారు...

ఆ పదిరోజులూ ఊరంత పండగ.... పగలు షడ్రసోపేతమైన భోజనము సంతర్పణలు... రాత్రిళ్ళు... నవరసాల్తోటి సమారాధన్లు...

ఎన్నో వందలమంది సంగీత విద్వాంసుల్ని దేశం నలుమూలల్నించి రప్పించి... ఒక్క త్యాగరాజకృతైనా పాడించీ... సన్మానించీ పంపేవాడు!!

ఇంతమందిని సన్మానించిన హరినాగభూషణం 1916లో మాత్రం ఒక్కసారి బరోడాలో జరిగిన సంగీత పరిషత్‌లో ఆ సంస్థానాధిపతి ఆహ్వానం మేరకు వెళ్ళి.... 22 శ్రుతుల గురించి తన వాయిలీన వాదనను ఆ సభలో ప్రదర్శించీ అందర్నీ మెప్పించీ.... 'గాయకరత్న' అన్న బిరుదాన్ని పొందారు...

1912లో మద్రాసులోని మహావిద్వాంసులు తచ్చూరి సింగరాచార్యుల చేత సువర్ణ ఘంటా కంకణాన్ని తొడిగించుకున్నారు...

ఈయన 'మాధవప్రియ' అనే రాగాన్ని సృష్టించీ ఆ రాగంలో ఒక సంస్కృత కీర్తన రాశారు...

పల్లవి: మాధవప్రియే మహిమాతిశయే
మంగళలయేభాలయే త్వం-
సాధుజనా వనేక్షేవ వసనే
శశి నిజసదనే - సారస నయనే..



త్యాగరాజస్వామి జీవిత చరిత్ర గూడా రచించిన హరినాగభూషణం గారి సంగీత ముద్ర ఏమిటంటే "త్యాగయోగ"

'సద్గురు శ్రీ త్యాగరాజుని భక్తి సంగీతములు స్వరూపములు'

అన్న పుస్తకం రాశారు.. దాన్ని నూజివీడు జమిందారు ఎం.రామచంద్ర అప్పారావు బహదురు గారు ప్రచురించారు!...

ఏదేమైనా... సంగీత జగద్గురువు త్యాగరాజస్వామి ఏకలవ్య శిష్యుడై.... భక్తుడై... ఆజన్మాంతం... అనుక్షణం ఆయన స్మరణ చేసుకుంటూ... త్యాగరాజ తత్వాన్ని ప్రచారం చేసిన హరినాగభూషణం గారు కారణజన్ములు..

ఒకసారి ఎవరో అభిమాని... మీరు ద్వారం వారూ కలిసి కచేరి చేస్తే ఎలా ఉంటుందీ అని అడిగితే... దానికి సమాధానంగా హరి నాగభూషణంగారు.. 'హరిద్వారం' అవుతుంది అని శెలవిచ్చిన సరసహృదయులు...

-తనికెళ్ళ భరణి

# భలే తాత మన బాలూజీ



ప్రముఖ గాయకుడు శ్రీ యస్.పి.బాలసుబ్రహ్మణ్యం తనయుడు, వర్ధమాన గాయకుడు అయిన యస్.పి.చరణ్ ఇటీవల తండ్రి అయ్యాడు. మే 16వ తేది శుక్రవారం ఉదయం 6 గం॥ 13 ని॥కు ఒక అమ్మాయి, 6 గం॥ 14 ని॥కు మరొక అమ్మాయి జన్మించారని ఎంతో ఆనందంగా పాత్రికోత్సాహంతో 'హాసం'కు తెలియజేశారు బాలూ. ఈ వార్త వినగానే 'శృతిలయలే జననీ జనకులు కాగా అని పాడేడు కాబట్టి శృతిలయల్లాంటి మనవరాళ్ళు ఒకేసారి ఆ దేవుడు ప్రసాదించాడు బాలూకి' అంటూ ఎంతో సంబరపడిపోయారు వేటూరి. 6.13కి పుట్టిన అమ్మాయికి జాహ్నవి అని, 6.14కి పుట్టిన అమ్మాయికి మయూఖ అని చరణ్ దంపతులు పేర్లు పెట్టారు. తన కుమార్తె పల్లవికి జన్మించిన సంతానం ద్వారా బాలూ ఎప్పుడో తాత అయ్యారు. ఇప్పుడు చరణ్ సంతానం ద్వారా తాతగా మరోసారి రావలసిన ప్రమోషన్ డబుల్ ప్రమోషన్ కావటం వల్ల 'భలే తాత మన బాలూజీ' అంటూ బాలూ మిత్రబృందం ఆయన్ని సరదాగా కా(ంప్లి)మెంట్ చేస్తున్నారు.

## కొంటెకొశ్చెన్లు - తుంటరి జవాబులు




ఏజర్ల సత్యనారాయణ - హైదరాబాద్

ప్ర: లైబ్రేరియన్ తిక్క కుదిరేదెప్పుడు?

జ: వస పిట్ట లాగ వాగే భార్య దొరికినప్పుడు

కుర్మాన వెంకట సుబ్బారావు - విశాఖపట్నం

ప్ర: పెళ్లిపెటాకులు లేకుండా ఎదిగిన కూతురు గుదిబండ అయితేమరి ఉద్యోగం సద్యోగం లేకుండా ఎదిగిన కొడుకు?

జ: అనకొండ

నవీన్‌కుమార్, హైదరాబాద్.

ప్ర: మా యింటి పక్కన ఓ అమ్మాయి వుంది. తను పార్వతీదేవి అంశ అని చెబుతూ ఏవేవో భ్రమల్లో బ్రతుకుతోంది. తనకు పేరు మార్చుకోవాలనుందిట. ఏ పేరు సజెస్ట్ చేస్తే మంచిదంటారు?

జ: భ్రమరాంబ

## పేరు - రిపేరు

నిజం - మా బాపు బొమ్మకు పెళ్లంట

ఒట్టేసి చెబుతున్నా - ఒట్టు ఈ అమ్మాయెవరో తెలీదు- నిజం

గంగోత్రి - నిను చూడక నేనుండలేను

తారక్ - నాగ - బ్రహ్మచారులు

-దేవులపల్లి రామమూర్తి, విజయవాడ




## ఈ రూటేవేరు




డ్యూ టీ (Due Tea) = మిగిలిన చాయ్

-సౌమ్య శరత్

నైపుణ్యం = పుణ్యము లేదు

- బి.వి.రావు, చందానగర్

విలేజ్ సిల్క్ = పల్లెపట్టు

-బద్ది నాగేశ్వరరావు, అనకాపల్లి



## చిలిపి లిపి




Key row sin = కిరోసిన్

-మామిడి శ్రీలత, పూణే

Y2 = తెలుపు

C2 = ఆసనము

-వి.వి.యస్.మహాలక్ష్మి, బొబ్బిలిపల్లి.

## పేరడీ పేరడ్



అ: నన్ను పీక్కు తిందువటే వన్నెల నా భార్యా
ఆ: అన్నములో నంజుకుందు నిన్నే నా సూర్యా....
నిన్నే నా సూర్యా ॥నన్ను పీక్కు తిందువటే॥
ఆ: హరియింతును నీ సొమ్మును సరదాలకు ఖర్చుపెట్టి
గడ్డిపరకవోలె కర్పూర కళికవోలె.... కర్పూర కళిక వోలె
అ: ఎంతటి పగవాడివో నా కొంపముంచినావు నీవు
కలకాలం ఊడని గొళ్ళెమును వేసినావు... గొళ్ళెమును వేసినావు
॥నన్ను పీక్కు తిందువటే॥
ఆ: నా మనసే గాలము యై నీవే చిరు చేపవుయై
దొరికినావు బాబూ నిను కొరికి తిందు రోజూ
కొరికితిందు రోజూ
అ: ఏనాటిదో ఆ పాపం, ఎరుగరాని విధి కోపం
ఎన్ని యుగాలైనా ఇది వదిలిపోని శాపం వదిలిపోని శాపం
॥నన్ను పీక్కు తిందువటే॥
("గులేబకావళికథ" చిత్రంలోని "నన్ను దోచుకుందువటే" పాటకు పేరడీగా)

- తాళాభక్తుల లక్ష్మీప్రసాద్, విశాఖపట్నం.

## చిలిపి కవిత



పెసరట్లలో మా ఆవిడ ది బెస్టు
ఉంటాయి వేసుకుంటే నోట్లో బహు టేస్టు
లాగించా అల్లం చెట్నీతో ఆరు రోస్టు
మొదలయ్యింది కడుపులో అన్ రెస్టు
ఇచ్చాడు డాక్టరు బిల్లు బహు కాస్టు
దెబ్బతో అయింది గుండెకి కార్డియాక్ అరెస్టు

- చాడా వెంకటశాస్త్రి, ఒరిస్సా.

## డబుల్ రోల్




'నస' మాని ఆ 'పనస' తొనలు తింటావా!?

-బద్ది నాగేశ్వరరావు, అనకాపల్లి

వాడేరా 'కేవీ రావు' నిజం చెప్పాలంటే 'వాడికేవీ రావు'

-అనుపమ.వి. ఖమ్మం

ఆ 'తాను'లో బట్ట ఒక్క మీటరు తగ్గినా 'తంతాను' అని సేల్స్‌మన్‌తో షాపు యజమాని అన్నాట్ట

-పి.వి. మురళీకుమార్, హైదరాబాద్

## షార్ట్‌కట్స్

పీలా పార్వతి = పీపా

-బద్ది నాగేశ్వరరావు, అనకాపల్లి

పెండేకంటి కుమారస్వామి = పెంకు

-టి.యల్.ప్రసాద్, విశాఖపట్నం.

పంగనామాల దివాకర్ = పంది

-పి.యస్.యస్.పవన్‌గణేష్, తాడేపల్లిగూడెం.





# చిరపురాతనం నిత్యనూతనం శుభాముద్గల్ గానవాహిని



కబీర్‌దాస్, తులసీదాస్, సూరదాస్, మీరాబాయిల ప్రాచీన సాహిత్యాన్ని తన సంగీతంతోనూ, గాత్రంతోనూ సుసంపన్నం చేసి, ఈ తరానికి అందించిన ఖ్యాతి శుభాముద్గల్ 'ఆలీ మోరే అంగనా' అంటూ ప్రేమ గీతాలను ఆలపించేసరికీ సంగీత ప్రపంచం కాస్త ఖంగుతింది. నిజమే మరి కళ్ళనిండా కాటుక పెట్టుకుని, సంప్రదాయ రీతిలో చీర కట్టుకుని, నుదుటిన నిండైన బొట్టు పెట్టుకుని ముద్ద మందారంలా కనిపించే శుభను చూస్తే ఇండీపాప్‌లోనూ తనకో ప్రముఖ స్థానం ఉందని నిరూపించుకుంటుందని ఎవరి ఊహకు తట్టదు. ఏది ఏమైనా ఆమె గానవాహిని చిరపురాతనం, నిత్యనూతనం అనేది సుస్పష్టమైంది.

1959లో అలహాబాద్‌లో ఓ సంప్రదాయ సంగీత కుటుంబంలో జన్మించిన శుభ, తల్లిదండ్రుల ప్రోత్సాహమే తానింతదానికి కావడానికి కారణమని చెబుతుంది. "మా అమ్మానాన్న అలహాబాద్ యూనివర్శిటీలో ఇంగ్లీషు విభాగంలో ప్రొఫెసర్లుగా చేస్తున్నారు. కాలేజీలో చదివే రోజుల్లో నాకు సంగీతం పట్ల మమకారం ఏర్పడింది. అదీ తల్లిదండ్రుల ప్రోత్సాహం కారణంగానే. వారి కోరిక మేరకు అలహాబాద్‌లోని రామ్ ఆశ్రయ్ ఝా వద్ద సంగీతంలో ప్రాథమిక విషయాలను తెలుసుకున్నాను. ఆ తర్వాత మేం 1982లో ఢిల్లీకి వెళ్ళాం. అక్కడ పండిట్ వినయ్‌చంద్ర మొద్గల్యా, పండిట్ వసంత్ థాకరే, పండిట్ జితేంద్ర అభిషేకీ దగ్గర సంగీతాన్ని అభ్యసించాను. వీరిందరి కంటే కూడా పండిట్ కుమార గంధర్వ నాకు సంగీతంలో ఎన్నో మెళకువల్ని నేర్పారు. నేనీ స్థితిలో ఉండటానికి ఆయన ప్రోత్సాహం, సహకారమే కారణం" అని చెబుతోంది శుభ. అయితే శ్రీమతి నైనాదేవీ దగ్గర టుమ్రీ గానం అభ్యసించడం కూడా తనలో వైవిధ్యానికి ఓ కారణమని అంటోంది. శుభాముద్గల్ గ్వాలియర్ ఘరానాకు చెందిన అమ్మాయే అయినా సంగీ తంలో నిష్ణాతులైన విద్వాంసుల శిష్యరికంతో ఏదో ఒక సంప్రదాయానికి




కట్టుబడకుండా తన నైపుణ్యాన్ని వైవిధ్యభరితం చేసుకుందామె.

అలానే కేవలం గాత్రానికే పరిమితం కాకుండా కెరీర్ ప్రారంభ దశలోనే కబీర్‌పర్వ, మీరా పర్వ, తులసీ పర్వ, సుర్‌పర్వ పేరుతో స్వీయ సంగీత దర్శకత్వంలో భక్తి మార్గాన్ని సుసంపన్నం చేసిన ప్రముఖుల గీతాలను స్వరపరచింది. 'సాంగ్స్ ఆఫ్ ద సీజన్స్' పేరుతో సెమీ క్లాసికల్ ఆల్బమ్‌ను, 'క్లాసికల్లీ యువర్స్' పేరుతో క్లాసికల్ ఆల్బమ్‌ను విడుదల చేసింది. ఆ తర్వాత 'వెడ్డింగ్ సాంగ్స్ ఆఫ్ ఉత్తరప్రదేశ్' పేరుతో రెండు ఆల్బమ్స్‌ను రూపొందించింది. సంప్రదాయ సంగీత పోకడలతోనే పాటల ఆల్బమ్స్‌ను తొలుత విడుదల చేసినా, తనలోని వైవిధ్యాన్ని ప్రదర్శించడం కోసం 'అలీమోరే అంగనా', 'అబ్ కే సావన్', 'ప్యార్ కే గీత్', మన్ కె మంజీరే', 'ఆంఖే' మొదలైన ఇండీపాప్ ఆల్బమ్స్‌ను రూపొందించింది. 'ఆలీ మోరే అంగనా'తోనే శుభలోని ప్రతిభను యువతరం గుర్తించింది. 'అబ్ కేసావన్' చాలాకాలం టాప్ టెన్ లిస్ట్‌లో నిలిచింది. శుభలోని వైవిధ్యాన్ని గమనించిన రాజశ్రీ సంస్థ 'ప్యార్ కే గీత్' ఆల్బమ్‌ను రూపొందించింది. ఇందులో 8 పాటలూ మధురమైనవే. ప్రేమ, విరహం, ఎడబాటు, సమర్పణ, హృదయ వేదన ఇవన్నీ... ఈ ఎనిమిది పాటల్లోనూ శ్రోతలు ఆస్వాదించగలిగారు. శుభకు టైలర్‌మేడ్ ఆల్బమ్‌గా దీన్ని చెప్పుకోవచ్చు. ఏ రకమైన సంప్రదాయ రీతులకు లొంగకుండా శుభ ఎలా అయితే తన వ్యక్తిగత ప్రతిభను అప్పటివరకూ చాటుకుంటూ వచ్చిందో ఆ రకమైన కొత్తదనం, వైవిధ్యం ఈ పాటలలో కనిపించింది. కేవలం ఇలాంటి ఆల్బమ్ శుభ మాత్రమే తీసుకురాగలదనే పేరు వచ్చింది.

కేవలం మ్యూజిక్ ఆల్బమ్స్‌కే పరిమితం కాకుండా శుభ తన ప్రతిభను అవకాశం ఉన్న మాధ్యమాల్లో కనబరుస్తూనే వస్తోంది. మీరానాయర్ రూపొందించిన 'కామసూత్ర: ఏ టేల్ ఆఫ్ లవ్' సినిమాకు నేపథ్య సంగీతాన్ని

కెనడాకు చెందిన మైఖేల్ డన్నా సంగీతాన్ని సమకూర్చారు. ఈ సినిమాలో ఓ ప్రత్యేక పాత్రను శుభ పోషించడమే కాకుండా, నేపథ్య సంగీతంలో భారతీయ స్వరాల్ని అవసరమైన చోట వినిపించే ప్రయత్నమూ చేసింది. దీనితో పాటుగానే రాజన్ ఖోస్లా 'డాన్స్ ఆఫ్ ద విండ్' సినిమాకు శుభ సంగీత దర్శకత్వం వహించింది. 1996లో నేషనల్ ఫిల్మ్ ఫెస్టివల్‌లో ప్రదర్శితమైన మీరా దేవన్ రూపొందించిన 'అమృత్ బీజ్' అనే డాక్యుమెంటరీకి సంగీతాన్ని సమకూర్చి, ఉత్తమ సంగీత దర్శకురాలు అవార్డును శుభ కైవశం చేసుకుంది. అలానే బ్రిటిష్ మ్యూజియం ప్రారంభించిన పాదుషానామా ఎగ్జిబిషన్‌కు కూడా శుభ సంగీతాన్ని సమకూర్చింది. అంతేకాదు, నృత్య కళాకారులు సోనాల్ మాన్‌సింగ్, అదితి మంగళదాస్, ప్రేరణ శ్రీమాలి తదితరులు రూపొందించిన మీరా, పరిక్రమ, కృష్ణకథ వంటి నృత్య రూపకాలకు శుభ సంగీతాన్ని అందించింది. పలు డాక్యుమెంటరీలకు కూడా శుభ వర్క్ చేసింది. సూఫీ పాటల ఆల్బమ్‌ను శుభ వెలువరచినప్పుడు మాత్రం సాధారణ

- **శుభ సంగీత సాధన సహజంగా ఉదయం 10 గంటల నుండి మధ్యాహ్నం 1.00 వరకూ చేస్తుంటుంది.**
- **ఇతర సంస్కృతి సంప్రదాయాలలోని గొప్పదనాన్ని కూడా గ్రహించాలనేది శుభ ఆలోచన.**
- **రాబర్ట్ డెనీరో, జూలియా రాబర్ట్స్ శుభకు ఇష్టమైన సినీ కళాకారులు.**
- **శుభాముద్గల్ ఏడు కుక్కల్ని పెంచుకుంటోంది. అవన్నీ డాల్మేషియన్సే కావడం ఓ విశేషం.**

శ్రోతలు ఆమెను అభినందించినా, సంప్రదాయ వాదులు మాత్రం విమర్శించారు. శుభ తన భర్త అనీష్ ప్రధాన్ సహకారంతో వెలువరించిన 'ఆంఖే' ఆల్బమ్‌లో ఇతర గాయకుల్ని కూడా ఆమె పరిచయం చేసింది. తరానా, ఘజల్, జాజ్, బ్లూస్, ఫోక్, క్లాసికల్ అన్నీ మిళితమైన ఆల్బమ్ ఇది.

తన సంగీతాన్ని సామాజిక చైతన్యానికి కూడా ఉపయోగించాలన్నది శుభ ఆలోచన. ఆమె రూపొందించిన 'మన్ కే మంజీరే'ను వింటే ఈ విషయం అర్థమౌతుంది. తాజాగా అమితా చౌహాన్ రూపొందించిన 'ఏక్ సప్నా దేఖా హై మైనే' అనే మ్యూజిక్ ఆల్బమ్‌లో కూడా శుభాముద్గల్ పాట పాడింది. బాలికలలో చైతన్యాన్ని తీసుకొచ్చేందుకు రూపొందించిన ఈ ఆల్బమ్ కోసం ఔత్సాహిక గాయనిలతో కలిసి పాడటం ఎంతో ఆనందాన్ని ఇచ్చిందని శుభ చెబుతోంది.

చిన్న పిల్లగా శుభ నృత్యాన్ని అభ్యసిస్తున్న రోజుల్లో డాన్స్ టీచర్ చాలా సాధారణ ప్రశ్న అడిగారు:

''నువ్వే సంప్రదాయ నృత్యాన్ని ప్రదర్శించాలనుకుంటున్నావు? అని.

''నేను 'నా' సంప్రదాయ నృత్యాన్నే ప్రదర్శిస్తాను'' అన్నది ఆమె సమాధానం.

శుభ మదిలోని భావాలను అర్థం చేసుకోవడానికి ఈ ఒక్క ఉదాహరణ చాలు.

**- వి.అరుణ సత్యవతి.**

---



# ఘంటసాల క్విజ్

మొదటి బహుమతి : రూ. 250/-
రెండవ బహుమతి : రూ. 200/-
మూడవ బహుమతి : రూ. 150/-
} మరియు ఘంటసాల కలర్ ఫోటో

**క్విజ్ రూపకల్పన, సమర్పణ, నిర్వహణ**

డా॥ కె.వి.రావు,
వ్యవస్థాపకులు,
పద్మశ్రీ ఘంటసాల గానసభ ట్రస్ట్,
28, 1-1-79, ఆర్టీసీ క్రాస్‌రోడ్స్,
హైదరాబాద్ - 500 020.



## క్విజ్ నెం-3

1. ఘంటసాల నటిస్తూ డైలాగ్ చెప్పిన చిత్రం?
జ: ........................

2. స్వీయ సంగీత దర్శకత్వంలో ఘంటసాల నాగయ్యకు పాడిన పాట పల్లవి?
జ: ........................

3. లతా మంగేష్కర్, ఘంటసాల ఒకే ట్యూన్‌లో పాడిన పాట పల్లవి?
జ: ........................

4. స్వీయ సంగీత దర్శకత్వంలో పి.బి.శ్రీనివాస్‌చే ఘంటసాల నాగయ్యకు పాడించిన పాట పల్లవి?
జ: ........................

5. ఘంటసాల సంగీత దర్శకత్వంలో భానుమతి పాడిన ఒక పాట పల్లవి?
జ: ........................

పంపినవారి పేరు : ____________________

చిరునామా : ____________________

____________________

____________________

**నిబంధనలు:**

ఎ) పోటీలో పాల్గొనగోరేవారు పక్కన ప్రచురించిన కూపన్ మాత్రమే నింపి కవరులో పంపాలి. కూపన్ కాకుండా మరే విధంగా పంపినా ఆ ఎంట్రీ స్వీకరించబడదు.

బి) కవరుపై 'ఘంటసాల క్విజ్' అంటూ పేర్కొనటం మరచిపోకూడదు.

సి) ప్రకటించిన బహుమతులను నగదుగా గాని, ఆడియో క్యాసెట్లుగా గాని, సీడీలుగా గాని విజేతలకు 'పద్మశ్రీ ఘంటసాల గానసభ - హైదరాబాద్' వారిచే నేరుగా పంపటం జరుగుతుంది.

డి) ఏ బహుమతి కైనా ఒకరు కన్నా ఎక్కువగా విజేతలుంటే తుది నిర్ణయం 'పద్మశ్రీ ఘంటసాల గాన సభ' వారిదే!

ఇ) ధారావాహికంగా కొనసాగే ఈ క్విజ్ పోటీలలో ఏ కేటగిరీలోనైనా వరసగా 5 సార్లు విజేతగా ఎన్నికైనవారికి ఓ ప్రముఖవ్యక్తి ద్వారా హైదరాబాద్‌లో మరొక ఆకర్షణీయమైన బహుమతిని అందజేయటం జరుగుతుంది.

**కూపన్‌లు 15-6-2003 లోగా చేరాలి**

**కూపన్‌లు పంపవలసిన అడ్రసు**

'హాసం- హాస్య సంగీత పత్రిక'
502, శ్రీ బాలాజీ నిలయం, 13-1-212,
మోతీనగర్, హైదరాబాద్-500 018.






నలభై ఏళ్లుగా సినీ పరిశ్రమ
తీరుతెన్నులపై అధ్యయనం
చేసిన రచయిత, జర్నలిస్టు, నటుడు

## రావి కొండలరావు

రాసిన వ్యాసమిది

# సినిమాల్లో మీసం పాత్ర ఇంత!

సినిమా బ్రహ్మదేవుడు రెండు రకాలుగా వుంటాడు. కొన్ని సినిమాల్లో తెల్లని గడ్డం, మీసాలతో కనిపిస్తే కొన్నింటిలో రెండూ లేకుండా 'క్లీన్‌షేవ్' తో కనిపిస్తాడు. ఆ వేషం వేసే నటుడికి గడ్డం అతికించే గమ్ అలెర్జీ వుంటే, క్లీన్. కాకపోతే "బడ్జెట్ తగ్గుతుంది. మీసాలూ గడ్డాలూ ఎంతలేదన్నా ఆరేడువేల రూపాయిలవుతాయి. తీసిపారేదాం'' అని నిర్మాత అనుకుంటే బ్రహ్మదేవుడు ఇంకా క్లీన్!

బ్రహ్మదేవుడనగానే ఒకటి గుర్తొస్తుంది. అతను చతుర్ముఖుడు. అంతకు ముందు పంచముఖుడు. మనకి వచ్చిన సినిమాలన్నింటిలోనూ అతను చతుర్ముఖుడే. పంచముఖాలతో వున్నప్పటి కథలు రాలేదు, వచ్చినా బడ్జెట్ తగ్గుతుందని నాలుగు ముఖాలే తగిలించి వుండొచ్చు. ఈ బ్రహ్మ ఎవరితోనైనా మాట్లాడుతున్నప్పుడు- అసలు తలతోనే మాట్లాడుతాడు గాని, తక్కిన తలలతో ఎందుకు మాట్లాడ్డో! బ్రహ్మదేవుడికి ఎడమ వేపున సరస్వతి కూచుంటుంది. అప్పుడు ఎడమ ముఖం మాట్లాడొచ్చుగా. మాట్లాడదు. బ్రహ్మదేవుడు, నాలుగు తలలూ ఎడమవేపు తిప్పి, మధ్యముఖంతోనే మాట్లాడతాడు. (తక్కినవి అట్టముఖాలే అనుకోండి- అయినా న్యాయం, లాజిక్ ఆలోచిస్తే ఏ తలయినా మాట్లాడాలికదా).

రావణుడికి పది తలలు. పదీ వరసగా వుంటాయి. ఆ తలల ఇబ్బందేమిటో, ఆ తలాభారం మోసిన ఎన్.టి.రామారావు గారు చెప్తేనే గాని తెలియలేదు. 'రౌడీ రాముడు - కొంటెకృష్ణుడు' సినిమాలో ఆయన నాటకంలో రావణుడి పాత్రధారి. ఆ నాటకం జైల్లో జరుగుతుంది. అగ్ని ప్రమాదం వల్ల అందరూ చెల్లాచెదిరి పారిపోతారు- రావణుడితో సహా, జైలు ముఖద్వారం మధ్యలో చిన్నద్వారం ఒకటుంటుంది. అందరూ అందులో దూరి పారిపోతారు. రావణుడు మాత్రం ఇబ్బంది పడ్డాడు. తను వంగి పది తలలూ దూర్చి





పరుగెత్తడంలో రామారావు గారికి ఇబ్బంది ఎదురైంది. నాలుగైదు టేకులయ్యాయి. అప్పుడాయన చెప్పారు. "రావణుడికి పదితలలు కదా. అసలు తలకాక ఇంకో తొమ్మిది తలలూ మోల్డులూ. ఈ తొమ్మిదీ ఒక్కలా రావు. ఓ పక్క నాలుగు తలలూ, ఇంకో పక్క ఐదూ రావడంతో బాలన్స్ వుండదు. ఐదు తలల వల్ల బరువు అటు తూగుతుంది. దానివల్ల తల ఒరిగిపోతుంది ఓ పక్కకి. అలా ఒరిగిపోకుండా, నాలుగు తలలున్న పక్క పైకిలేపి బాలన్స్ చేయ్యాలి. అది బ్రదర్ ఇబ్బంది! పెట్టుకొని చూస్తారా ఓసారి?'' అని నవ్వుతూ జోక్ చేశారు.

"ఆ శిరోభారం మీదే అన్నగారూ! మాకా అర్హతలేదు'' అన్నాను నేనూ నవ్వేస్తూ. అలా, తలల్ని బాలెన్స్ చేస్తూ తర్వాతి షాట్ ఓకే చేశారు అన్నగారు.

రామారావుగారికి మొదట్లో మీసం వుండేది. ఆయన నటించిన తొలి పౌరాణికం 'మాయరంభ' (1950) అందులో ఆయన నలకూబరుడు. కనక మీసం వుండదు. కనక, ఆయన మీసం తీసేశాడు. అక్కడినుంచి- అవసరం అయితే మీసం అతికించుకోడం, లేదా ఎక్కువగా 'గ్యాప్' వస్తుందనుకుంటే (పాతాళభైరవి, మల్లీశ్వరి టైము) సొంత మీసంతోనే నటించడం చేసేవాడు. కృష్ణుడు, రాముడూ వచ్చిన తర్వాత పూర్తిగా 'క్లీన్' అయిపోయాడు.

నాగేశ్వరరావు గారికి నూనూగు మీసం వుండేది. (రత్నమాల, మాయలోకం, పల్నాటి యుద్ధం గుర్తుకుతెచ్చుకోండి) బాలరాజు, కీలుగుర్రం సినిమాల్లోనూ సొంత మీసమే. దాన్ని డగ్లస్ ఫెయిర్ బాంక్స్ కట్ మీసం అనేవారు. అదలా కంటిన్యూ అయింది. విప్రనారాయణ నుంచి 'క్లీన్ షేవ్'కి వచ్చేసి వుంటారు.

అవసరం అయితే అతికించుకోడం బెటరనిపిస్తుంది కొందరికి. కొందరికి గమ్ము మంట కంటె పెంచేసుకోవడం బెటరనిపిస్తుంది. పెద్ద గడ్డం వుంటే, పెద్ద మీసం కూడా తథ్యం. ఋషి పాత్రలకి ఈ రెండూ తథ్యం. మన సినిమాల్లో గడ్డం, మీసం లేని మునులు ఋషులూ వుండరు- బ్రహ్మర్షి నారదుడు తప్ప.

మన నటుల్లో గడ్డాలు, మీసాలు వున్న పాత్రలు ధరించిన వాళ్ళల్లో నాగయ్యగారు, గుమ్మడిగారూ కనిపిస్తారు. ఇద్దరికీ గమ్ ఎలర్జియే. అందునా, గమ్ తెగపూయవలసి వస్తుంది. "ఎండాకాలం అయితే, రెండు మంటలు నాయనా'' అనేవారు నాగయ్యగారు, చిరాకుపడిపోతూ. గుమ్మడిగారికి చెమట




ఎక్కువ. మద్రాసులో ఎండలెక్కువ. అంచేత ఎండాకాలంలో ఆ షూటింగ్ రానీయకండి" అనేవారు నిర్మాతతో గుమ్మడివారు. ఐనా తప్పేదికాదు, అది వేరే విషయం.

నాగయ్యగారు ఒకసారి అవుడ్డోర్‌లో బయటిఎండతో పాటు ఆయనా మండిపడ్డాడు. ఎండమీదకాదు- ఋషుల మీద. "ఆ ఋషులు పనీ పాటా మానుకుని అడవిలో చెట్లకింద కూచుని, గడ్డాలూ మీసాలూ పెంచుకుని ఇవాళ నా ప్రాణం తీస్తున్నారు" అన్నారు తీవ్రంగా. పైన తలమీద విగ్గు, ముక్కు, కళ్ళు, నోరూ తెలుస్తాయి తప్ప, తక్కిన మొహం అంతా వెంట్రుకలే, గమ్మే. గాలి తగలక తలపైన ఊపిరాడదు. పైగా శివుడి తలమీద వెలిసినట్టు గంగ వెలుస్తుంది. స్వేద ధారాపాతం తప్పదు. ఇవన్నీ భరించాలి. పాత్రని ధరించాలి.



నాకు 'వీరాభిమన్యు' చిత్రంలో ద్రోణాచార్యుడి పాత్ర తగిలింది. ద్రోణుడు, భీష్ముడు, కృపాచార్యులూ వీళ్ళంతా గడ్డ మీసాల వాళ్లే. నాకు ఉదయం ఏడు గంటలకి మేకప్ వేసి (వీర్రాజు) గడ్డాలూ మీసం అతికించేస్తే- అంతే. రాత్రివరకూ అలావుండవలసిందే. మధ్యలో భోజనం చేయడానికి కుదరదు. ఎంచేతంటే వెంట్రుకలు నంచుకోవలసి వస్తుంది. అవి, అలా నోట్లోకి వెళ్లిపోతూనే వుంటాయి. అంచేత, బ్రెడ్‌ముక్కలూ తిని బతికేవాళ్ళం- ఆనాడు కందమూలాలు తిని ఋషులు బతికినట్టు- నేనూ భీష్ముడూ. (ఎ.వి.సుబ్బారావు) అప్పుడుగాని గడ్డాల బాధలు అర్థం కాలేదు.

(నేను 'నర్తనశాల'కి పని చేసినప్పుడు, ఉదయమే ద్రోణ కృప, భీష్మాచార్యులకీ, అశ్వత్థామ, శకునులకీ గడ్డాలు అతికించేయమనేవాణ్ణి. పాపం, ఏ సాయంకాలానికో వాళ్ళకి పాటు వచ్చేది. ఆ పాపం, నా పాలిట శాపం అయిందను కున్నాను; లేదా ఆ నటులే నన్ను శపించివుంటారు- "నీకూ ఒకనాడు ఈ గడ్డాలు మీసాలూ ప్రాప్తమగుగాక!" అని)

మరి నారదుడూ ఋషేకదా, పైగా బ్రహ్మర్షి- అతనికెందుకు గడ్డాలూ మీసాలూ పెట్టరూ? పెట్టరు. సురభి నాటకాల నారదుడు అలవాటయిపోయాడు. అక్కడ స్త్రీలు నారదపాత్ర ధరించేవారు. పొడుగాటి జుట్టును పైకెత్తి నెత్తిమధ్య ముడిపెట్టుకునేవారు. పొడుగాటి జుబ్బా తొడిగి, వక్షస్థలం కనిపించకుండా పూలమాల (శ్రీ వెంకటేశ్వరస్వామి టెక్నిక్) వేసుకునేవారు. నడుం కనిపించకుండా అడ్డంగా వీణ. చేతిలో చిడతలూ. నారదుడంటే ఇలాగే వుంటాడని అలవాటు చెయ్యడంలో సినిమా నారదుడూ అలాగే అవతరించాడు. హిందీ సినిమాల్లో మాత్రం గుండు, పిలక పెట్టారు-




ఘటోత్కచుడికి 'మహాభారత్'లో గుండు చేసినట్టు. కుండలాంటి తల అని కాబోలు అలా పెట్టారు. మనకి 'మాయాబజార్' ఘటోత్కచుడు ఆదర్శం. రాక్షస వంశీయుడు గనక పెద్దమీసం, కొండల్లో వుంటాడు గనక పక్షుల ఈకలతో శిరస్త్రాణ అలంకరణ చేసి చూపించారు. సురులకి మీసాలుండవు గనక, అసురులకి మీసాలు ఉండాలనేదే సినిమా రూలు.

సినిమా శివుడుకి కూడా కొన్నింటిలో మీసం, గడ్డం... కొన్నింటిలో ఏమీ వుండవు. నదా శివుడి వేషాలే వేసిన సదాశివరావు (గుణసుందరి కథ, ధర్మాంగద మొ॥) కి హీరోకి పెట్టినట్టు చిన్న మీసం పెట్టారు. రవివర్మ పెయింటింగ్స్‌లో శివుడు ఋషిలా వుంటాడు గడ్డాలూ మీసాలతో. ఐనా అది అందరూ అనుసరించలేదు. ఎవరికి తగ్గట్టుగా వారు శివుడి గెటప్స్ మార్చుకున్నారు. విష్ణుమూర్తి దేవుడుగనక మీసం ప్రసక్తేలేదు. కాబట్టి అతని అంశతో వచ్చిన రాముడికి, కృష్ణుడికీ మీసం వుండదు. సినిమాలకి రాకముందు ఒక నాటకంలో కృష్ణుడి వేషం వెయ్యవలసి వస్తే ఎన్.టి.రామారావు మీసం



తియ్యనని, మీసంతోనే కృష్ణుడి వేషం వేశారని- కాంతారావు గారు చెప్పారు. దానికి కారణం అంతకుముందు వచ్చిన 'మీసాల కృష్ణుడు' రంగస్థలం మీద పాప్యులర్ కావడం కావచ్చు. బెల్లంకొండ సుబ్బారావు గారు తన పెద్ద మీసాలతోనే కృష్ణుడి వేషం కట్టి రాణించారు. "శ్రీకృష్ణునికి మీసములుండెడివా?" అని పత్రికల్లో వ్యాసాలొచ్చాయి కూడా.

తొలినాటి సినిమా హీరోలకి మీసం వుండేది కాదు. హిందీలో సైగల్, అశోక్‌కుమార్‌లను చూసికాబోలు, మన సాంఘికాల హీరోలూ మీసం తీయించే నటించారు. చిత్తూరు నాగయ్య, నారాయణరావు, గిరి, కె.యస్.ప్రకాశరావులను గుర్తుకు తెచ్చుకోండి. విలన్ పాత్రలకి మీసం, కొండొకచో కోరమీసం తప్పనిసరి! ఎందుకంటే యాక్షన్‌లో చెయ్యెత్తి మీసం దువ్వుతూ వుండాలి. ఐనా విలన్ పాత్రధారులు మీసం పెంచేవారు కాదు- పాత్ర అవసరాన్ని బట్టి పెద్దదో చిన్నదో అతికించుకునే వారు. రంగారావు, రాజనాలలతో పాటు హాస్యనటులు రేలంగి, రమణారెడ్డి, శివరావు, రామలింగయ్య, పద్మనాభం అందరూ క్లీనే.

ఇంకోటి. విష్ణువుకి మీసం లేకపోయినా విష్ణాంశగల అన్నవరం సత్యనారాయణమూర్తికీ, అరసవెల్లి సూర్యనారాయణమూర్తికీ మీసాలున్నాయి. కాని సినిమాల్లో మాత్రం సూర్యుడికీ, సత్యనారాయణస్వామికీ మీసాలు పెట్టలేదు! 'గోల్‌మాల్' అనే హిందీ సినిమాలో మీసం ప్రధాన పాత్ర వహించింది. కె.బాలచందర్ ఆ చిత్రాన్ని తమిళంలోనూ తెలుగు లోనూ తీశారు. రజనీకాంత్ హీరో. తమిళ చిత్రం ఎప్పుడో విడుదలైంది గాని, తెలుగు చిత్రం మాత్రం విడుదల కాలేదు. ఏకంగా ఆ సినిమాకి 'మీసం కోసం' అనే పేరు పెట్టారు.

ఇవాళ- దాదాపు అన్ని సినిమాల్లోనూ హీరోలు మీసం, మాసిన గడ్డంతో కనిపిస్తారు. క్లీన్‌షేవ్ ఆనాటి గ్లామరయితే, చిరుగడ్డం మీసం వుండడం- ఈనాటి గ్లామరు. సినిమాల్లో 'మీసం పాత్ర'కి అంతటి ప్రాముఖ్యతా ప్రాశస్త్యం వున్నాయిని తెలుసుకుంటే చాలు- ■



# 'ఆరుద్రగానే కంటిన్యూయింగ్‌గా వుండు'

- రావి కొండలరావు



ఒక తెలుగు మాస్టారు చాదస్తం, పాతకాలపు పట్టింపులూ గలవాడు. ఆంగ్లభాష రాదు. రాకపోయినా వచ్చినట్టు నటిస్తాడు. రాదంటే చిన్నతనం, గ్రాంథిక భాష, గ్రంథాలు తప్ప ఆధునిక రచయితలనీ రచనల్నీ ఎరగడు. ఆధునిక రచనలమీద, వ్యావహారిక భాషా రచనల మీదా మంట ఇలా- అదొక పాత్ర. ఈ పాత్రనీ, పాత్ర స్వభావాన్నీ క్షుణ్ణంగా ఆకళింపు చేసుకున్న ఆరుద్రగారు ఆ తెలుగు మాస్టారు తనతో ఇంటర్వ్యూ చేస్తే ఎలా వుంటుందని అడిగారు. ఆరుద్రగారు చాలా స్పోర్టివ్. "ఈ ఇంటర్వ్యూ తప్పకుండా వేయాలి సావనీర్లో" అన్నారాయన తన షష్టిపూర్తి సందర్భంగా వెలువడిన సావనీర్ గురించి మాట్లాడుతూ. సరదాగా ఉండే ఈ ఇంటర్వ్యూని ఆయన వర్ధంతి సందర్భంగా అందిస్తున్నాను -రావికొండలరావు

ప్రకాష్ స్టూడియో ఆవరణ,
కొన్నేళ్ళ క్రితం, ఒక సాయంకాలం,

ఆరుద్రగారిని కలుసుకోవాలని, తెలుగు మాస్టారొచ్చారు. స్టూడియో ఆవరణలో వున్న ఒక చెట్టుకింద కూచుని, ఆరుద్ర డబ్బింగ్ డైలాగులు రాస్తున్నాడు. మాస్టారు అటూ ఇటూ చూసి ఆయన దగ్గరకే వచ్చి -



"అయ్యా... ఇక్కడ ఒక రచయిత... ఆశ్వనీ అని... అశ్వనా... మృగశిరా?... భరణీ.... ఆఁ రేవతి! రేవతేనా ఏదో నక్షత్రప్పేరు ... ఆఁ.... ఆరుద్ర! ఆరుద్ర అనీ. ఆయన ఇక్కడుంటానూ రమ్మన్నాడు ఇక్కడెక్కడుంటారాయన?" అని అడిగారు.

"నేనే ఆరుద్ర."

"ఆఁ! తమరా... తమరేనా ఏమిటి అది?... ఇక్కడీ బయట ఇలా చెట్టుకింద కూచుంటే, వాచ్‌మన్ ఎవడో అనుకున్నాను, తమరేనా ఏమిటి ఆరుద్ర?... అలాగా- తెలియలేదు నాకు.... అసలేమిటి, మిమ్మల్నిలా చెట్టుకింద పడేశారు, లోపలకి రానివ్వరా?"



ఆరుద్ర నవ్వి "ఎందుకు రానివ్వరూ... రానిస్తారు, నేనే, ప్రశాంతంగా గాలీ అదీ బావుంటుందిగదాని ఇక్కడ కూచుని రాసుకుంటున్నాను" అన్నారు.

"ఆహాఁ! అవును!... కవులకు ప్రశాంతత... ఆ వాతావరణము అవసరము. బావుంది. అందుకని తమరిలా ఒంటరిగా చెట్టుకింద కూచుని రాసుకుంటూ వుంటారన్న మాట. బావుంది అవునూ... తమరు తెలుగు భాష శుభ్రంగానే మాట్లాడుతున్నారే..."

"అదేమిటలా అడిగారు?"

"తమరు తెలుగువారేనా, లేక బెంగాలీయులా అని"



"మీ కెందుకొచ్చిందీ ఆ అనుమానం?"

"అంటే, ఆరుద్ర అని వుందిగదా తమ పేరు... అంచేత తెలుగువారా, లేక ఇతర భాషీయులా అని...."

"శుద్ధ పదహారణాల తెలుగువాణ్ణి"

"అయితే మరి, ఈ ఆరుద్ర ఏమిటి?"

"అది... నా పెన్ నేము"

మాస్టారు ఓ నిమిషం ఆలోచించారు.

"పెన్ నేమా?"... అంటే, తమరు రాసే పెన్ పేరు ఆరుద్రన్న మాట. ఆ పేరే మీరు పెట్టుకున్నారా? ఏదో పైలటూ, పార్కరూ అని వుంటాయి గదూ పెన్నుల పేర్లు... తమ పెన్ను పేరు కొత్తగా వుంది."



"అంటే, అలాగేం కాదు పెన్ నేమ్ అంటే, ఆ పేరు పెట్టుకుని, రాస్తానన్నమాట... కలం పేరు అని తెలుగులో అంటారు"

"అదెందుకలాగ కలం పేరూ అదీనీ? అంటే తమ అసలు పేరు వేరే వుందన్నమాట"

"వుంది. భాగవతుల శంకరశాస్త్రి"

"ఏమిటి... భాగవతుల శంకరశాస్త్రి!.... అద్భుతంగా వుందే ఈ పేరు! చాలా బావుంది. పండితులన్న స్ఫురణ పేరులోనే వుంది. అలాంటి పేరు తీసేసి. ఇదెందు కిలా ఆరుద్ర అనీ.... ఎవడికీ తెలియకుండా?"

"ఎందుకో అలా పేరు పెట్టుకుని రాయడం అలవాటై పోయింది"



"దేనికని? ఎందుకలా దొంగపేరు పెట్టుకోడం? ఏదో నేరస్థుల్లాగా, దొంగల్లాగా పేరు మార్చుకుని తిరగవలసిన అవసరం ఏమొచ్చిందని? శుభ్రంగా వున్న తమ నామధేయాన్ని తీసి పారేసి ఈ కలం పేరు, పెన్సిలు పేరూ ఎందుకని తమకీ? చూడూ... తమ తలిదండ్రులు, ఏ శుభముహూర్తంలోనో, తమకీ శంకర శాస్త్రి అని నామకరణం చేసివుంటారు. తల్లిదండ్రుల మాట జవదాటి, ఈ దొంగపేరుతో రాయడం భావ్యమా... తగదు మీ కక్కడ! మంచి ఇంటి పేరు, మంచి పేరూ వున్నప్పుడు, తీసేసి తెలుగు వాడో కాదో అన్నట్టు ఈ ఆరుద్ర, అశ్వనీ, పునర్వసు - ఎందుకీ పేర్లు?... ఆఁ... అందుకని, తమరు శంకరశాస్త్రి పేరుతోనే వ్యవహరిస్తే బావుంటుందని నా సలహా".

"ఆలోచిస్తాను".

"ఆలోచించడానికేముంది ఇందులో - ఈ రెండు పేర్లూ డబుల్ నేమింగ్సు.... కన్ఫ్యూషను.... ఆఁ.... ఇంతకీ..... ఇక్కడ ఏమిటి రాస్తున్నారు మీరు....?"

"డబ్బింగ్ సినిమాకి మాటలు"

"డబ్బింగ్ సినిమా ఏమిటి..అదో భాషా? లేక...."

"అంటే, ఒక భాషలో తీసిన సినిమాకీ, తెలుగులో మాటలు అనువాదంచేసి, ఆ బొమ్మతో కలుపుతారు."

"ఏం- వేరే తెలుగువాళ్ళు ఆ వేషాలు వెయ్యలేరా ఏమిటి?"

"వెయ్యలేక కాదు. మళ్ళీ సినిమా పూర్తిగా తియ్యాలంటే డబ్బు ఎక్కువ ఖర్చు అవుతుంది. అంచేతేమిటంటే ఇలా పెదవుల కదలిక చూసుకుంటూ తెలుగులో మాటలు తర్జుమా చేస్తాం."



"ఓహో! ఇలాంటి తర్జుమా మాటలన్నమాట తమరు చేసేది! దీనిక్కూడా పెద్ద పెద్ద రచయితలూ వాళ్ళూ ఎందుకు- తమరు అంత పెద్ద రచయిత కాదా..."

"పెద్దా చిన్నా అని కాదిక్కడ. ఇదో టెక్నిక్కు. ఈ టెక్నిక్‌లో రాయడానికి అలవాటు ఉండాలి".

"సరే, తమరు అన్నీ ఇలాంటివేనా - వేరే నిజాయితీగా రాసినవి వున్నాయా?"



"చాలా వున్నాయి. గేయాలు రాశాను. పాటల, కథలూ రాశాను అన్నీ పత్రికల్లో వచ్చాయి కొన్ని పుస్తకాలుగా వచ్చాయి."

"గేయాలు! 'గేయంలూ" అంటే, ఏదో మాట్లాడుకుంటున్నట్టుగా వుంటాయి అవేనా...అంటే...

"నువ్వూ నేను ప్రేమించుకుందాం... అక్కడో చెట్టుంది

దానిమీద కోయిల కూసింది

"అనీ...ఇలా వుంటాయి అవేనా గేయాలూ అంటే... అవెందుకని? కవితాధోరణి, భాష, పాండిత్యమూ లేకుండ ఏదో నోటికొచ్చిన భాషతో రాయడం - కవిత్వమూ అది? కడు ధూర్తము! ఏమిటి దానివల్ల ప్రయోజనం!"



"ప్రయోజనం ఏమిటో, 'గాయాలూ గేయాలు' ఉన్నా పుస్తకము ఇస్తాను చదవండి".

గేయాలే వద్దో అంటూంటే, గాయాలొకటా! గాయాలెందుకు మళ్ళీ? ఎవరికి, చదివినవాళ్ళకా లేక రాసినప్పుడు మీకు తగిలాయా- చూడు బాబ్జీ! ఇలాంటి ఆధునిక కవిత్వాలూ, భావగీతాలూ అనవసరం నాకు! ఒకప్పటి బమ్మెరపోతన, అల్లసాని పెద్దన, తిక్కన సోమయాజి, అద్వితంగా రాయడానికి భాషాపటిమతో రాయడానికి ప్రయత్నించండి అంతేగాని, ఇదెందుకిలా.... ఇలా రాయాలంటే, తమరే రాయాలా ఏమిటి... ఎవడేనా రాస్తాడు?

పెన్సిలు చెక్కు
ఇదిగో ముక్కు
అదిగో బుక్కు- అని కలగాపులగంగా రాయడానికి, తమకి చెట్టునీడ ప్రశాంతత కూడానా ఏమిటి.... చూడండి, అంటున్నందుకు క్షమించండి! ఇలాంటి కవిత్వం రాయడానికి తమకి మారుపేరే అవసరం! మీ అసలు పేరుతో రాయదగ్గ కవిత్వం కాదది. వుండనీండి - ఈ రాతలకి, మీ మారుపేరే, ఏదది?... ఆరుద్ర ఆఁ..... అలా దొంగ పేరుతోనే రాస్తే, ఎవడు రాశాడో నాబోటి వాడికి తెలీదు! బావుంది... అందువల్ల, తమరు ఈ పేరే కంటిన్యూయింగ్‌గా వుండండి?... ఎందుకీ పేరు పెట్టుకున్నారో నాకు అర్థమైంది వొస్తాను ఆఁ!" ■

---




## ఇది యస్పీబాల సుబ్రహ్మణ్యం సమర్పిస్తున్న శీర్షిక

**మీకు తెలుగు ఎంత బాగా తెలుసో, మీ పదసంపద ఎటువంటిదో బేరీజు వేసుకోవడానికి ఉద్గ్రంథాల దాకా పోనక్కరలేదు. ఈ సంచికలో కనబడే సినిమాపాటలలోని మాటలతో కూర్చిన ఈ శీర్షికలో సరైన అర్థం అనుకున్న మాటపై టిక్కుపెట్టి బాలూ గారిచ్చిన సమాధానాలతో సరిచూసుకోండి.**

1. చెంచిత (చెంచులక్ష్మి- చెట్టు లెక్కగలవా)
   ఎ) సాహసికురాలు బి) ప్రేయసి
   సి) చనువైన ఆడది డి) ఎఱుక స్త్రీ

2. నాణెముగా (చెంచులక్ష్మి- చెట్టు లెక్కగలవా)
   ఎ) అపాయములేకుండా
   బి) ఒడుపుగా
   సి) శ్రేష్ఠముగా డి) న్యాయముగా

3. జాలము (చెంచులక్ష్మి-కానగరావా)
   ఎ) విరహము బి) ఆలస్యము
   సి) జాలి డి) కష్టము

4. మదనము (చెంచులక్ష్మి- మందారమకరందం)
   ఎ) స్త్రీ బి) మధ్యశాల
   సి) ముల్లు డి) ఉమ్మెత్త చెట్టు

5. నీహారము (చెంచులక్ష్మి- మందార మకరంద)
   ఎ) నగ బి) పేరిన మంచు
   సి) వెన్నెల డి) ఆహారము

6. మాయి (ఆహుతి -ప్రేమయే)
   ఎ) సుడిగాలి బి) సుడిగుండం
   సి) సముద్రపుగాలి డి) అగ్ని

7. సదనము (ఆహుతి -ప్రేమయే)
   ఎ) ఇల్లు బి) సీమ
   సి) ఐశ్వర్యము డి) రాజ్యము

8. సోన (పునర్జన్మ -ఓ సజీవ శిల్ప)
   ఎ) ప్రవాహము బి) కాంతి
   సి)-చల్లదనము డి) తొన

9. నిక్వణము (పునర్జన్మ - ఓ సజీవ శిల్ప)
   ఎ) బంగారము బి) ధ్వని
   సి) వెలుగు డి) తాడు

10. మంజరి (పునర్జన్మ - ఓ సజీవ శిల్ప)
   ఎ) ప్రవాహము బి) బాట
   సి)తీగె డి)ప్రేయసి

### జవాబులు

1) d 2) c 3) b
4) d 5) b 6) d
7) a 8) a 9) b
10) c

బాలు







# సప్తస్వరసుందరి
# లతామంగేష్కర్



ప్రముఖ నేపథ్య గాయకుడు, బహుభాషా కోవిదుడు, కవి, రచయిత, కళైమామణి, గానకళా సార్వభౌమ బిరుదాంకితులు

**డా॥ పి.బి.శ్రీనివాస్**

'హాసం' పాఠకుల కోసం తన అభిమాన గాయని జీవిత చరిత్రను అక్షరబద్ధం చేస్తున్న సీరియల్ ఇది

**ఆయెగీ ఆయెగీ ఆనేవాలీ ఆ ఏగీ! గాయేగీ**
**ఆయెగీ ఆయెగీ గానేవాలీ ఆఏగీ ఆయేగీ గాయెగీ**

అని నేను స్కూల్లో చదువుకుంటున్న రోజుల్లో సదా పాడుతుండే వాణ్ణి. అది అక్షరాలా నిజమైంది! అతి త్వరలోనే! చలనచిత్ర సంగీత చరిత్రలో ఒక సువర్ణాధ్యాయం ప్రారంభమైంది, ఆ దివ్య గాయికా నాయిక కంఠ స్వరం నుండి ప్రవహించే స్వరసుధాధారలు రసజ్ఞ లోకాన్నంతటినీ అలరించి పారవశ్యపుటాన ందాన్ని పంచి యిస్తూ వుండడం వల్ల! తదాదిగా ఆ సుధా ప్రవాహం ఆగలేదు ఈనాటికీ. ఏనాటికి ఆగబోదు - అది నిత్యసత్యమధుమకరంద స్రవంతి - రాగభావలయతాళ సమ్మిళితమైన అజరామర సంగీత జలపాతం! జగతికి దైవ వరప్రసాదం-

అసంతుష్ట జీవితాల ఆవేదనని తొలగించి, ఊరడించి, ఆశ్వాసమూ విశ్వాసమూ కలిగించి, అందరి జీవితాలనీ అలరించి రంజిల్ల చేసి, జీవంత చైతన్యభరితాలుగా పరిణమింపజేసి, ఉత్సాహంతో ముందు సాగే విధాన, అడుగడుగునా నడిపించే శక్తి గల అద్భుత కంఠస్వరం ఆ భూలోక గాన సరస్వతి అనదగిన సప్తస్వరసుందరిది.

ఇంతకీ ఆమె పాడిన గీతం "ఆయెగా ఆయెగా ఆనేవాలా" 'మహల్' చిత్రంలో వీనస్ అనిపించుకున్న మధుబాల పాత్ర కోసమని ఇప్పుడు తలుచుకుని ఆ పాట పాడుకున్నా ఒళ్ళు ఝుల్లుమంటుంది, పులకిస్తుంది. ఆ వచ్చేవాడు ఎవర్‌గ్రీన్ హీరో ఎండ్ కారెక్టర్ ఏక్టర్‌గా స్వర్ణోత్సవ సరిహద్దుని దాటి చిత్ర సీమలో ధ్రువతారగా వెలిగిన ఏకైక మహానటుడు అశోక్‌కుమార్!

నేను పాడిన "ఆయెగీ గానేవాలీ" వేరెవరో కాదు, రెండక్షరాల, రెండు జడల "లత" అన్న పేరుతో ఈనాటికీ చిత్ర సంగీత సామ్రాజ్యాన్ని నిరుపమానంగా ఏలుతున్న మహారాజ్ఞి - ఆమెకి సాటి ఆమెయే! నాటికీ, నేటికీ, యేనాటికీ "లత" అద్వితీయ సప్తస్వర విశ్వపాలిని-

కుఞ్ఞతనంలో గళస్వరం స్త్రీ కంఠస్వరంలా వుండడం వలన "లత" పాడిన పాట ఎన్నో నేర్చేసుకుని నాలో నేనే కాకుండా, కాలేజీ చదువు చదివి డిగ్రీ పొందేవరకూ కచ్చేరీల్లో కూడా పాడుతూ వెండికప్పులు, బహుమతులూ, బిరుదులు గడించేవాడిని... క్రమంగా బేస్‌వాయిస్ రూపొందినప్పుడు మహమ్మద్ రఫీ, మన్నాడే, తలత్ మెహమూద్, ముకేశ్ మొదలైన మహా గాయకుల చిత్ర గీతాలు కూడా పాడి శ్రోతల మెప్పులందుకునేవాణ్ణి. ఆ రోజుల్లోనే "లత"తో యుగళగీతం (డ్యూయెట్) తప్పక పాడాలి అనే సువర్ణ స్వర్ణ స్వప్నం రూపొంది పెరిగిపెరిగి మహోన్నత వృక్షంగా విలసిల్లింది. ఆ స్వప్నం ఒకనాడు నెఱవేఱుతుంది అని "స్వప్నం"లో కూడా అనుకోలేదు నేనెన్నడూ - కల మాత్రం నిరంతరం కనేవాణ్ణి!

గాయనీమణులలో చాలామంది "లత" బాణీని అధ్యయనం చేసి, పేరు ప్రఖ్యాతీ సంపాదించుకున్నవాళ్లే - ఆమె గాయికా గాయిక అనగా సాంగ్‌స్ట్రెస్ ఆఫ్ సాంగ్‌స్ట్రెస్ - అలా ఆమె గాన ఫణితి ఎందరెందరికో ఆదర్శ ప్రాయమయింది. "అచ్చం లతాలా పాడుతుంది అనిపించుకోడం ప్రతీ అమ్మాయికీ మహానంద యుత గర్వకారణం.

కాని "లత" జీవితంలో చిన్నప్పుడు జరిగిన వింత సంఘటనలు ఎన్నో ఎవరూ ఎఱుగరు. ఇటీవలనే, నవ్య భవ్య దివ్య చరిత్ర సృష్టించిన ఆ మహాగాయని జీవిత చరిత్రలోని అనేక ఘట్టాలూ, సన్నివేశాలూ పుస్తకాల రూపాన్ని దాల్చాయి. అవి చదివినా, విన్నా, కన్నీళ్లు కురుస్తాయి. ఆ కన్నీళ్లల్లో, సంతాప సంతోష పారవశ్యప్రద బాష్పాలు రాలుతాయి నవరసమయ పుష్పాలై ఆమె జీవితానుభవాలు వచ్చిన, వచ్చివున్న, కాక రానున్న పలు మంది నూతన గాయనీమణులకి ఆదర్శప్రాయం అనక తప్పదు.

నా బాల్య దశలో "లత" పాట వింటున్నప్పుడల్లా ఒక బక్క పలచని చిన్న అమ్మాయి ఉత్సాహంగా పాడుతున్నట్లుగా వూహించుకునేవాడిని. లత పాటంటే చెవి కోసుకునే నన్ను నా స్నేహితుల్లో కొందరు చిలిపివాళ్లు కూడబలుక్కుని "లత" చాలా లావుగా, ఇంచుమించు "టున్‌టున్" అనే కామెడీ క్వీన్ లాగా (ఆమె అసలు పేరు ఉమాదేవి), వుంటుందని ఒకానొక భీకరమైన ఊహాచిత్రాన్ని చిత్రించి నా మనోనేత్రాల ముందు నిలబెట్టేవారు. దాంతో, వినోదంతో పాటు విషాదం కూడా నన్ను దొలిచేసేది. అంత లావైన దేహం నుంచి ఇంత మృదువైన సన్నని స్వరం ఎలా వస్తుందో కదా అని తలుచుకుని విస్మితుడిని అవుతూ వుండేవాడిని. ఆమెతో కలిసి ఏదో రోజున తప్పకుండా పాడి తీరాలనే ఆకాంక్ష ఏ మాత్రం తరుగే లేకుండా ఎదుగుతూ వుండేది.

నేను మద్రాసుకి వచ్చిన కొత్తల్లో, తరువాత మా బావగారైన కీ॥శే॥ వి.రంగనాథ్ (మా మొదటి చెల్లెలి భర్త) లజ్ ఎవెన్యూలో తెల్ల ఇల్లు అనబడే వైట్‌హౌస్‌లో వుంటూ వుండేవారు. ఆ భవనానికి కుడివైపున "జూపిటర్ పిక్చర్స్" వారి సంస్థ వుండేది. సోమసుందరం గారు దాని అధినేత. ఆయన ఆ రోజుల్లో నిర్మిస్తూ వున్న హిందీ చిత్రంలో పాడేందుకు లతా, ముకేశ్ లిద్దరు మద్రాసు (ఇప్పటి చెన్నై) వచ్చారనే వార్త నా చెవిలో పడే సరికి, నా ఆనందానికి మేరలేదు. ఇద్దరూ నా అభిమాన గాయికా గాయకులే. ముఖ్యంగా "లత"ని చూడాలనే ఉబలాటం ఇంతా అంతా కాదు. అందువలన నేను ఆ సంస్థ వున్న స్థలం చుట్టూ తిరుగుతూ "లతా ముఖ దర్శనం" కోసం తహతహలాడుతూ వుండేవాడిని. కాపలా వాడు లోపలికి వెళ్లనిచ్చేవాడు కాడు ఓ పట్టాన. అనుకోకుండా ఓ రోజున ఎలాగో లోపలికి చేరుకుని ఆదుర్దాగా కాచుకుని

వున్నాను. పొరపాటుననైనా లత బైటకొచ్చి దర్శనం ఇప్పిస్తుందేమోనని. అనుకున్నట్లే తటాలున ప్రత్యక్షమైంది, లేడిపిల్లలా గంతులేస్తూ అక్కడ పెరిగిన లతల్లోనూ మొక్కల్లోనూ తన కిష్టమైన కొన్ని పువ్వులు కోసుకుంటూ చలాకీగా. అక్కడ వున్న ఒక ఆసామిని కనుక్కొని ఆమెయే లతా దిగ్రేట్ అని తెలిసే సరికి, నా ఆనందాశ్చర్యాలు మిన్నుముట్టాయి. ఇంత చురుకైన పిల్లని, ఎంత భయంకరంగా వర్ణించారో తలుచుకుని, నా స్నేహితులకి పరోక్షంగానే తిట్ల బొబ్బట్లు తినిపించేశాను. కాని ఒక తృప్తి. నేను ఊహించుకున్న రీతిగా అతి భీకరంగా వుండకుండా తన పేరుకి తగ్గట్టే లత లాగే కోమలంగా, సన్నగా, తీగలాగ కాకపోయినా ఒకింత బొద్దుగా వున్న సరూప స్వరూపాన్ని చూసి, ఎంతైనా "థ్రిల్లు" పొంది, ఆమె అలా అక్కడ ఉన్నంతసేపూ ఆమెనే గమనిస్తూ, ఆమె పాడిన పాటలు నేను సదా పాడుతూ వుండే అద్భుత గీతాలని నెమరు వేసుకుంటూ, నా అదృష్టాన్ని నేను మెచ్చుకునే వాడిని నా ప్రియతమ గాయనీమణిని కళ్లారా చూడగలిగినందుకు. ఆమె మృదుమధుర గాత్రంతో శృతి కలిపి యుగళగీతం పాడగలిగే స్వర్ణావకాశం వస్తుందోలేదో ఆ సువర్ణ స్వప్నం (బంగారు కల) నెరవేరుతుందో లేదో అనే సందేహం నా తలపులని కలతపరుస్తూ వుండేది.

ఆ హిందీ చిత్రంలో కీ॥శే॥ ఎస్.వి.వెంకట్రామన్ గారు స్వరపరిచి లతా, ముకేశ్‌ల చేత పాడించిన పాట, "రజనీ హై తారోంభరీ" అని నా కొకింత జ్ఞాపకం, "నక్షత్ర భరితమైనదీ రాత్రి" అని దాని అర్థం -రి$^2$ గ సా సాసారిస తారో సరీ భరీ" అని సాగిన ఆ ట్యూన్ ఎస్.వి. గారి ప్రతిభకి నిదర్శనం. రజనీలోని రకారం రిషభంతో మొదలై, భరీ అనే పదంలో "రీ" కారం (రీఙ్కారం) కూడా రిషభంలోనే సమకూరేలాగ స్వరపరచడం అందరికీ అలవడే సులభ ప్రత్యేకత కాదు, నాకు అప్పట్లో స్వరజ్ఞానం బొత్తిగా శూన్యం. కొన్నాళ్ల తర్వాత, క్రమంగా కొన్ని వందల పాటలకి స్వరాలు రాయడం అభ్యసించడం వల్ల, స్వరం రాసే దాకా పాట గుర్తుండేది కాదు. అది నిరంతర తపోదీక్షా బలం, ఫలం అని ఈనాడు తోస్తుంది. ఓనాడు ఆ పాటని నెమరు వేసుకుంటూ వున్న సందర్భాన ఈ స్వరాక్షరి అనబడే ప్రయోగం నాకు విధితమైంది.

లతా ముకేశ్‌లు పాడిన ఎన్నెన్నో డ్యూయెట్లు అప్పటికే విపరీతంగా పాప్యులర్ అయి ఉండడం వల్ల ఆ ఇద్దరినీ ఒకేసారి చూసిన "అపురూపానుభవం" నాకు సంతృప్తి కలగజేసేది. - లతాది లత లాంటి సన్నని గొంతు, ముకేశ్‌ది నాసికా (ముక్కు) నాద విలసితమైన టింబర్ గల బేస్‌వాయిస్. ఆ కాంబినేషన్ కాంట్రాస్ట్ వల్ల చాలా షైనై శ్రోతల్ని ముగ్ధుల్ని చేసేసేది. ముకేశ్ అప్పటికే పహ్‌లీనజర్ (మొదటిచూపు) అనే చిత్రంలో "దిల్ జల్‌తా హై, తో జల్‌నే దే, ఆసూ: న బహా ఫరియాద్ నకర్" అనే హిట్‌సాంగ్, అచ్చంగా "సైగల్" లాగే పాడారు. ముకేశ్‌కి "సైగల్" ఐడియల్. సైగల్ గాన విధానం ముకేశ్ గాన విధానంపైన గొప్ప ప్రభావాన్ని సృష్టించింది. ఉత్తరోత్తరా, ముకేశ్ ముకేశ్‌లాగే పాడడం ప్రారంభించి, తనదైన వ్యక్తిత్వాన్ని నిరూపించుకున్నారు.

గాయకులందరికీ ఇది చాలా అవసరం. మొదట్లో సీనియర్ సింగర్స్‌ని అనుకరించినా, క్రమంగా తమ బాణీని తప్పక మలచుకోక తప్పలేదు లేకపోతే, వట్టి ఇమిటేటర్‌గానే మిగిలిపోవలసి వస్తుంది. "లత"కి ఇన్స్‌పిరేషన్

## లతా మాతృభాష గుజరాతీయా?

**మా**తృభాష అంటే తల్లి భాష అని అర్థం తీస్తే లతా మాతృభాష గుజరాతియే అనాలి. ఎందుకంటే లతా తల్లి షెవాంతీ గుజరాతీ! తాపీ నది ఒడ్డున ఉన్న థాల్‌నేర్ అనే చిన్న ఊరు వాళ్ళది. ప్రస్తుతం మహారాష్ట్ర, గుజరాత్ రాష్ట్రాలకు సరిహద్దు గ్రామంగా నిలిచినా 1910 ప్రాంతాల్లో సంయుక్త మహారాష్ట్రలో భాగంగా ఉండేది. ఆ ఊరిలో నివసించే సేఠ్ హరిదాస్ రామ్‌దాస్ లాడ్ అనే గుజరాతీ వ్యాపారస్తుడు షెవాంతీ తండ్రి.

లతా తండ్రి కుటుంబం గోవాకు చెందినది. వాళ్ల ఇంటిపేరు హర్డీకర్. పోర్చుగీసువారి బారినుండి కులదైవాలను రక్షించు కోవడానికి రక్తం చిందించి, దేవుడికి రక్తాభిషేకం చేయడం వల్ల అభిషేకీ అనేది ఇంటిపేరుగా మారింది. సాధారణంగా మగవాళ్ల పేరు చివర భట్ అని వస్తుంది. నిజానికి లతా బాబాయి బాలూ భట్ అభిషేకీ ఇంకా పూజారివృత్తిలోనే ఉన్నారుట. నాటకరంగంలోకి దిగి 'భ్రష్టుపట్టిపోయినందుకు' దీనానాథ్ కుమారుడైన హృదయనాథ్‌ను గుడిలోకి రావద్దంటాడటాయన.

దీనానాథ్ తండ్రి గణేష్‌భట్ అభిషేకీ 'కర్‌హదీ' శాఖకు చెందిన బ్రాహ్మణుడు కాగా, తల్లి యశుబాయి మరాఠా. రాణే కుటుంబానికి చెందినది. తల్లిప్రోద్బలంతో సంగీతం చేర్చుకున్న దీనానాథ్ తన ప్రత్యేకత నిలుపుకోవడానికి కొత్త ఇంటిపేరు పెట్టుకున్నాడు. తన గ్రామం పేరైన మంగేషీ పేరుమీదుగా మంగేష్కర్ అనే ఇంటిపేరు పెట్టుకుని ప్రముఖుడయ్యారు. అతని 22వ యేట షెవాంతీ అక్కగారైన నర్మదాతో 1922 లో వివాహం అయింది. నాలుగేళ్ళ వైవాహిక జీవితం తర్వాత ప్రసూతిసమయంలో నర్మదా మరణించటంతో 1927లో భార్య చెల్లెలైన షెవాంతీతో దీనానాథ్ పునర్వివాహం జరిగింది.



చిన్నతనంలో అమ్మమ్మ దగ్గిర కొంతకాలం పెరిగిన లతా మరాఠీ లావణీ (జానపదగేయాలు) లతో బాటు గుజరాతీ 'గర్బా'లు కూడా నేర్చుకుంది. ఆమె గుజరాతీ స్వచ్ఛంగా మాట్లాడగలదు కూడా.



**లతా అభిమాన గాయకుడు సైగల్. కాస్త డబ్బు రాగానే లతా ఓ రేడియో కొనుక్కుంది. అది 'ఆన్'చేయగానే ఆమె విన్న మొదటి వార్త 'సైగల్' మరణించారని. హతాశురాలైన లతా ఆ రేడియోను విసిరి పారేసిందట!**

ఇచ్చిన గాయకుడు కూడా కె.ఎల్.సైగలే. ఆయన ఆ రోజుల్లో సంగీత సామ్రాజ్యానికి మకుటం లేని మహారాజు. నేను కూడా సైగల్ గానాన్ని అనుకరించేవాణ్ణి. ఆయన పాటలు పాడేటప్పుడు మాత్రం ముఖ్యంగా "షాజహాన్" చిత్రంలో "గందిఏ ముస్తికిల్", "ఇత్‌నా నాజుక్ హై దిల్ యేనా జానా" అని సంగీత సామ్రాట్టు నౌషాదు స్వరపరిచిన గజల్, నాకు హాట్ ఫేవరేట్. అదీ, "దీదార్"లోని రెండు పాటలు మహమ్మద్ రఫీ పాడినవీ, బైజుబావ్‌రాలో నౌషాద్ ట్యూను "ఓ దునియాకే రఖ్‌వాలే, సున్ దర్ద భరే మేరేనాలే - అనే పాటలు నేను తరచూ సంగీత కార్యక్రమాల్లో పాడే అభిమాన గీతాలు.

సైగల్ పాటంటే లతకి ప్రాణం అని చిన్ననాటనే ఋజువైంది. ఒక చిత్రంలో సైగల్ పాట విని అత్యంత ప్రభావితురాలై ఇంటికొచ్చి, జీవితంలో తను పెళ్లంటూ చేసుకుంటే సైగల్నే అని నిర్ణయించుకున్నది అని ప్రతీతి. ఆమె తన సంపాదనలో కొన్ని వందలు ఖర్చు చేసి, ఒక చిన్న రేడియో కొనుక్కుని, మొదటిసారిగా విన్న వార్త "సైగల్" చనిపోయారని! ఆ వార్త వినగానే ఆ రేడియోనే విసిరిపారేసిందట లతా బాలిక. మరే ప్రోగ్రాము వినకుండా చాలా తక్కువ వెలకి ఆ రేడియోని అమ్మేసి, దాని బాధ వదుల్చుకున్నట్లు నేను చదివినప్పుడు, చిన్ననాటి మనసు ఎంత కోమలమైనదైవుంటుందో అనిపించింది.

ఇటీవల ఆమె, "శ్రద్ధాంజలి" అనే పేరున వెలువరించిన ఆల్బంలో తనకిష్టమైన 'మైం క్యాజానూం క్యా జాదూహై జాదూహై' అని సాగే సైగల్ పాటని తు.చ. తప్పకుండా పాడి ఆయనపై తనకు గల అభిమానాన్నీ గౌరవాన్నీ తెలియజేశారు - ఆ "శ్రద్ధాంజలి" ఆల్బంలో కీర్తిశేషులైన అభిమాన గాయకులు కొందరికి ఆమె వారి పాటలనే పాడి నివాళులర్పించిన వైనం "లత" ఔచిత్య పరిజ్ఞానానికి నిదర్శనం.

ఒక విధంగా గాయనీమణులలో లత కి ఇన్‌స్పైరింగ్ ఐడియల్ సింగర్ నూర్జహాన్. ఆనాటి "గాయికా నాయిక" అయిన నూర్జహాన్‌ని కలుసుకుని మాటాడినప్పుడు లత పొందిన "థ్రిల్లు" కన్న లతను నేను మొదటిసారిగా కలుసుకొని మాట్లాడి తదుపరి ఆ మహా గాయికతో యుగళ గీతం పాడిన "థ్రిల్లు" చాలా చాలా అధికం అని నా నమ్మకం.

మొదట్లో లత నూర్జహాన్ని అనుకరించినా, అతి త్వరలోనే తన బాణీని ఖచ్చితంగా రూపొందించుకోవడం వలన, ఈనాడెందరెందరో 'లత'లా పాడాలని ఉవ్విళ్లూరుతూ, నిరంతర కృషి చేస్తూ వున్నారు. ఆదిలో "లత" గానం వలన అత్యంత ప్రభావితులై అనుకరించి పిదప తమ స్వంతమైన బాణీని మలచుకున్న దక్షిణ భారత గాయనీ మణులలో సుశీల, జానకీ ముఖ్య ప్రముఖులనుకునేవారు లతాభిమాను లందరూ. జిక్కి పైనా, లీల పైనా, జమునారాణీ, ఎల్లారీశ్వరి మున్నగు వారిపైనా, లతా ప్రభావం అక్కడక్కడ కనిపించకపోదని వారి అభిప్రాయం. ఆ ప్రభావం లేకుండా పాడటం ప్రారంభించిన వాళ్లల్లో భానుమతీ, ఎ.స్వరలక్ష్మి, బాలసరస్వతీ మున్నగువారు అల్ప సంఖ్యలో వుండేవారు.

ఈ విధంగా అధిక సంఖ్యాకులకి ఆదర్శప్రాయమైన గాన ఫణితి "లతా"కే స్వంతం. మొత్తం మీద చిత్ర సంగీత చరిత్రలో ప్రత్యేక చరిత్రని సృష్టించి, విచిత్రోన్నతోత్తమ స్థాయి కెదిగిన ఘన వనిత "లత" అంటే అతిశయోక్తి కాదేమో!!



**లతా ఐడాల్ నాటి సింగింగ్ స్టార్ నూర్జాహాన్. ఆమెను మొదటిసారిగా కలిసి మాట్లాడినప్పుడు లతా ఎంతో 'థ్రిల్' ఫీలయిందట.**

"28-9-1929 తేదీ అనగా సెప్టెంబరు మాసంలో ఇరవై ఎనిమిదవ తేదీన ఇందోర్ నగరంలో దేవీత్రయ శక్తుల ప్రత్యేకాంశాలతో విద్యాధన పత్రిష్ఠల నిధులతో భారతదేశంలో అవతరించిన దివ్యగాన భవ్యమూర్తి లత"!

ఆమెని కళారసజ్ఞ లోకానికి వరప్రసాదించిన మహనీయుడు ఆనాటి రంగస్థల మహాగాయక నటశేఖరుడు దీనానాథ్ మంగేశ్కర్! - మంగేశ్ ఆయనకి ఇష్టదైవం. ఆయన ప్రథమ భార్య పరమపదించింది, ఒక అమ్మాయిని కని. ఆ అమ్మాయి పేరు కూడా "లత"యేం కాని బాల్యంలోనే ఆమె చనిపోయింది. భార్య చెల్లెలైన "షేవంతి" అనే శ్రీమతిని దీనానాథ్ ద్వితీయ భార్యగా స్వీకరించారు. తన పుట్టినింట అనేక కష్టాలకోర్చి బ్రతుకు బరువు మోయసాగిన శ్రీమతిని 'పనిమనిషి'లా పనిచేసేవారట. దీనానాథ్ ఆ సంగతి తెలిసి తన మామగారితో అన్నారట. "నేను భార్యగా స్వీకరించిన "శ్రీమతి" ఇకపై రాణిలాగ వ్యవహరించాలే తప్ప ఏ మాత్రం కష్టపడకూడదు." అని అంతటి దయార్ద్ర హృదయం. బహుశః దీనానాథ్ అనే పేరు ఆయనకి సముచితమైనదని అనిపించడానికి కారణం ఆయన కరుణాపూర్ణ దీనజనావన దీక్షయేనేమో!

అద్భుతమైన కీర్తి ప్రతిష్టలన్నీ, ధన నిధుల్నీ సంపాదించుకున్న ఆయన నాటక సంస్థ సన్నగిల్లి నష్టం వలన సతమతమైనప్పుడు కూడా దీనానాథ్ తమ ఆశ్రితులకి మాత్రం కష్టం కలగనిచ్చేవారు కారట. తన నాటక సంస్థ మరీ దీనస్థితికి గురి అయినప్పుడు తన అనుయాయులే తన యింట్లోని వస్తువులెన్నిటినో తీసుకువెళ్తున్న వేళ, ఏ మాత్రం చలించకుండా, కోపమేం తెచ్చుకోకుండా, తన తంబూరా మీటుతూ

## చిన్నారి లతా చిలిపిచేష్టలు



తండ్రిలాగానే లతాకు కూడా మసాలాలు, మాంసం చాలా ఇష్టం. ఓ రోజు అందరూ భోజనాలకు కూర్చున్నప్పుడు లతా తన వంతు తిండి గబగబా కానిచ్చేసింది. ఇంకా తింటున్న చెల్లెళ్ల కంచాలమీద ఆమె చూపు పడింది. "నాకు నిన్న రాత్రి కల వచ్చింది చెప్పనా.." అంటూ మొదలుపెట్టింది. "నేను ఓ ఎలుక తింటున్నానట. నములుతూండగా అది బాగా ఉడకలేదని అనిపించిదట. దాంతో అనుమానం వచ్చి నోట్లోంచి బయటకి లాగి... కాస్త కొరికి చూసి..." అని చెబుతూండగానే చెల్లెళ్ళకు ఒళ్ళు గగుర్పొడిచి, బాబోయ్ అంటూ కంచాలు వదిలేసి పరిగెత్తుకుని పారిపోయారు. "నువ్వూ, నీ వెధవ కలలూను.... చూడు వాళ్లు ఛస్తే మళ్లీ ముద్ద నోట్లో పెట్టరు. వండినదంతా వేస్టు" అని తల్లి తిట్టిపోసింది. "నీకేం భయం లేదమ్మా, నేనున్నానుగా అన్నీ తినేస్తా" అంటూ లతా శుబ్బరంగా అవీ తినేసింది.



**లతా ఎంతగానో ప్రేమించి అభిమానించిన తండ్రి దీనానాథ్ మంగేష్కర్. నలుగురు గాయనీ మణులకు ఒక సంగీత దర్శకుడికి జన్మనిచ్చిన మహానీయుడు. ఈయన పేర లతా ఎన్నో సామాజిక కార్యక్రమాలు నిర్వహిస్తారు.**

రాగాలాపన చేస్తూ, కూర్చుండిపోయారుట. ఆ సన్నివేశం సినిమా సన్నివేశంలా జరిగిన నిజ జీవిత సన్నివేశం అనిపించక తప్పదు ఎవరికైనాగానీ! బ్రతుకుబాటలో ఎత్తుపల్లాలు రెండింటినీ దర్శించి, అనుభవించి, అనుభవజ్ఞాన పాండిత్యం వలన చెదిరిన ధైర్యాన్ని తిరిగి చేర్చుకుని, తన చివరి ఊపిరి దాకా ఆత్మ గౌరవాన్ని నిలబెట్టుకునేందుకు అమేయ కష్టభారాన్ని అవలీలగా మోయగలిగిన స్థైర్యశీలి, దీనానాథ్ అనే "లతా జనకుడు". ఆయనలో గల సువర్ణ సదృశ సుగుణాలెన్నో "లతా"కి కూడా సంక్రమించి, ఆమెకి ప్రత్యేక వ్యక్తిత్వాన్ని ప్రసాదించాయి.

చిన్న లతా 'దీనానాథ్‌ని "బాబా" అని ఆప్యాయంగా పిలిచేదట. తన పెద్ద కూతురు, సంగీతజ్ఞాన నిధి అని తెలుసుకున్న నాటి నుండి, ఆ నిధిని పెంపొందించేందుకు, దీనానాథ్ నిరంతర కృషి చేసేవారుట! - స్వయంగా రాగాలాపనల వినూత్న ప్రక్రియలూ అవీ తెలిపి, ఆమె అతి త్వరగా సూక్ష్మాలని గ్రహించి, వెంటవెంటనే పాడిచూపించి, నిరూపించే సరికి, ఆయన విస్తుపోయేవారట. 'మన పెద్దమ్మాయి, త్వరలోనే సంగీత ప్రపంచాన్నం తటినీ ఏలగలిగే ప్రతిభావంతురాలు' అని చెప్పి మురిసిపోయేవారట. "లత" కంఠస్వరంలో గాంధారనాదం సదా మ్రోగుతూ వుంటుందని భవిష్వాణి సాయించేవారట. ఆనాటి ఆ తలిదండ్రుల ఆనందాతిరేకమే ఈనాటికీ లతా మంగేష్కర్-కి సర్వదా, సర్వథా, రక్షాకవచమై కాపాడుతూ వుందనీ, వుంటుందనీ నా హంబుల్ ఒపీనియన్.

లతకి, మీనా, ఆశా, ఉషా అనే ముగ్గురు చెల్లెళ్లు. అందరూ శృతిబద్ధంగా, లయయుతంగా సకల జనరంజకంగా ఎట్టి క్లిష్ట సంగీతాన్నైనా, సంగతులనైనా ఇట్టే పాడి పలికించగల గాన కళానిపుణులు. సహజాత వివిధ కళా ప్రాభవులూ, స్వరరాగలయమయ దివ్య విద్యా పండితులూ. ఒక్క ముక్కలో చెప్పాలంటే, వాళ్లందరిదీ, సంగీత జ్ఞానపూర్ణ విద్యామయా పూర్వ పరివారం. 101, ప్రభుకుంజ్, పెడ్డార్‌రోడ్ ముంబై - 26 వారి నివాసమందిరం - సంగీతాభిమానులెందరో తరుచూ వారి నివాసానికి, దర్శనార్థమై వస్తూపోతూ వుంటారు. మాయీ (అమ్మా) ప్రభృతుల ఆదరాభిమానాలని అందుకుని, సంతుష్టాంతరంగులై -

దీనానాథ్ రెగ్యులర్‌గా నాటక ప్రదర్శనలు జరిపేవారు. ఆయనది చాలా విజయవంతమైన సంస్థ. పైగా వారిది అత్యున్నతమైన కళాభిరుచి. దాంట్లో చౌకబారు ప్రయోగాలకి తావే యిచ్చేవారు కాదు.

ఒకనాడు ఒక పౌరాణిక నాటకంలో నారద పాత్రధారి సమయానికి హాజరవలేకపోయే సరికి, దీనానాథ్‌కి పెద్ద సమస్య ఎదురైంది. ఏం చెయ్యడం, ఆనాటి ప్రదర్శన రద్దు చేయవలసిందేనా అని బాధపడుతున్న సమయాన కూతురు లతా "బాబా! నాకు నారదపాత్ర బాపతు డైలాగులే కాక పాటలు అన్నీ బట్టీ. మీరేమీ చింత చెందవలసిన పనిలేదు." అంది ఆపద్బాంధవురాలై!

తండ్రి చకితులై ఆలోచించసాగారు. "ఇది వేలెడంతైనా లేదు. దీనికెంత జ్ఞాపకశక్తి! అంతా బాగానే వుంది కాని, నాయక పాత్రధారిగా వేసేది నేను. నారద పాత్రలో ఈ లతా బాల! వయస్సులో మా ఇద్దరి అంతరం చూసి, ఆడియన్సు ఎలా రియాక్టు అవుతారో ఏమో!" అని భయపడుతూనే లత చేత నారదుడి పాత్ర ధరింపజేశారు. వేరే దారిలేక!

లతా స్టేజి మీదికి రాగానే, ఆడిటోరియంలో ఈలలూ, పిల్లి, నక్క కూతలు దద్దరిల్లేలా వినిపించాయి. లత బెదరక, చెదరక, వణకక, నారదుడి ప్రథమ గీతాలాపన ప్రారంభించిందో లేదో, హాలంతా నిశ్శబ్దం. చెవులూ మనసూ లతా గానానికి అంకితం అయిపోయాయి. ఒక్కొక్కరి ముక్కుపైనా చూపుడు వేలు అతుక్కుపోగా, నోళ్లు విప్పారి ఆశ్చర్యం ప్రకటించగా, లతా శ్రావ్య దివ్యగానం, శ్రోతలందరికీ ఆనంద సుధారస సారాన్ని పంచిపెట్టింది. అలా ప్రారంభమయింది లతా సంగీత ప్రస్థానం!

(ఇంకావుంది)

## తండ్రి కడియమే కూతురు కిరీటం!

"సుభద్ర" నాటకంలో అనుకోకుండా నారదపాత్రను ధరించిన లతా ప్రేక్షకుల మెప్పు పొందడంతో ముగ్ధుడయిపోయిన ఆమె తండ్రి వెంటనే లతాను దృష్టిలో పెట్టుకుని చిన్న నాటిక తయారు చేయించాడు. ప్రముఖ నాటకరచయిత కోరీవాలే కు చెప్పి "గురుకుల్" అనే స్కిట్ తయారుచేయించి, దానిలో కృష్ణుడి పాత్ర లతా చేత, కుచేలుడి (సుదామ) పాత్ర లతా చెల్లెలు మీనా చేత వేయించాడు. అప్పటికి లతా ఎంత చిన్నదంటే దీనానాథ్ భుజానికి వేసుకునే కడియం బాలకృష్ణుడి నెత్తిమీద కిరీటంగా అమరింది!

## లతా గానలహరి

**చిత్రం: మహల్ రచన: నక్షబ్ సంగీతం: ఖేమ్‌చంద్‌ప్రకాష్**

ఆవో యే జమానా ఛుప్ జా యే సితారే
ఆరామ్ సే హై దునియా బేకల్ హైఁ దిల్ కే మారే
ఐసే మెఁ కోయీ ఆహట్ ఇస్ తరహా ఆ రహీ హైఁ
జైసే కి చల్ రహా హో మన్ మే కోయీ హమారే
హమారా యే దిల్ ధడక్ రహా హై... ఇస్ ఆస్ కే సహారే
ఆయెగా ఆయెగా ఆయెగా
ఆయెగా ఆనే వాలా ఆయెగా ఆయెగా ఆయెగా ॥ఆయెగా॥
దీప్ బగైర్ కైసే పర్వానె జల్ రహే హైఁ (2)
కోయీ నహీఁ చలాతా ఔర్ తీర్ చల్ రహే హైఁ (2)
తడ్‌పేగా కోయీ కబ్ తక్ బేఆస్ బేసహారే (2)
లేకిన్ యె కెహ్ రహే హైఁ దిల్ కే మెరే ఇషారే ॥ఆయెగా॥
భట్‌కీ హుయీ జవానీ మంజిల్ కో ధూండ్‌తీ హై (2)
మాఝీ బగైర్ నైయ్యా సాహిల్ కో ధూండ్‌తీ హై (2)
క్యా జానె దిల్‌కీ కష్తీ కబ్ తక్ లగే కినారే (2)
లేకిన్ యె కెహ్ రహే హైఁ దిల్ కే మెరే ఇషారే ॥ఆయెగా॥



లతాను గాయకురాలిగా ఎస్టాబ్లిష్ చేసిన పాట ఇది. కెమాల్ అమ్రోహీ ఒక అందమైన 'కామినీ పిశాచాన్ని' (మధుబాల) తెరపై సృష్టిస్తే ఒక 'హాంటింగ్ ట్యూన్'తో ఆ పాత్రకు జీవం పోశాడు ఖేమ్‌చంద్ ప్రకాష్. మధుబాల లేతదనానికి లతా లేత వాయిస్ తోడయింది. పాట అజరామరమయింది.

జూన్ 15 సురయా జన్మదినం సందర్భంగా...

# సుస్వర గాయక నటి సురయా

**హిందీ సినీ జగత్తులో సింగింగ్ స్టార్స్‌లో సురయా అనగానే మంద్ర స్వరంలోంచి జాలువారే పాట, గజల్ గాన వైభవం తొలినాటి సినిమా ప్రియులకు కళ్లముందు కదలాడుతాయి. నటనకు, గానానికీ దూరమై 40 ఏళ్లయినా సురయా నిత్యనూతన తారకయే.**



1929 జూన్ 15న లాహోర్‌లో పుట్టిందామె. ఆమె మేనమామ జహీర్‌రజా తొలినాటి నటుడు. ఒకసారి అతని వెంట సెట్స్ పైకి వెళ్లగా పక్క ఫ్లోర్‌లో షూటింగ్ జరుపుకుంటున్న ''తాజ్‌మహల్'' చిత్రంలో అనుకోకుండా నటించింది బాల సురయా. మరో నాలుగు చిత్రాల్లో బాలతారగానే నటించిన సురయా ''స్టేషన్ మాస్టర్'' (1942)లో తొలిసారి ప్లేబ్యాక్ పాడింది. 'శారదా'లో మెహతాబ్ కోసం ''పంఛీ జా'' పాడగా హిట్ అయింది. ఆ వెంటనే 'కానూన్'లో ''ఎక్ తుమ్ హో ఎక్ మైహూ'' పాడగా అదీ హిట్ సాంగ్ అవడంతో మెహతాబ్ ఎక్కువగా సురయా చేతనే పాడించుకుంది.

ఒకవైపు నాయికగా నటిస్తూ, గానం చేస్తూ ఉన్న సురయాకు దేశ విభజన తరువాత ఖుర్షీద్, నూర్జహాన్‌లు పాకిస్తాన్ వెళ్లిపోవడంతో ఎవరూ పోటీలేకుండా పోయారు. లత, ఆషా, షంషాద్ బేగంలు అప్పుడే పైకి వస్తున్నారు. దాంతో ఆమె ప్లేబ్యాక్ పాడటం మానుకుని తనకు మాత్రం పాడుకునేది. నాయికగా సైగల్‌తో 3, దేవ్ ఆనంద్‌తో 7, మోతీలాల్‌తో 4, జైరాజ్‌తో 5, రెహమాన్‌తో 4 చిత్రాల్లో నటించారామె. ఒక్క 1949లోనే 11 చిత్రాల్లో నటించడం ఒక రికార్డు. గాయక తారగా ఉచ్ఛ దశలో ఉండగానే రుస్తుంసొహ్రాబ్ (1963) తరువాత పరిశ్రమ నుండి దూరమైన సురయా 'మిర్జా గాలిబ్' చిత్రానికి రాష్ట్రపతి పురస్కారం అందుకుంది. ప్రస్తుతం ముంబైలో ఒంటరిగా గడుపుతోందామె.

ఆమెను ఆరాధించి, పెళ్లాడమని వెంటపడి విఫలమనోరథుడైన దేవ్ ఆనంద్ మాటల్లో చెప్పాలంటే-

''సురయా నటించే కాలంలోనే గాక ఇప్పటికీ ఆమె అభిమానులు లక్షల్లో ఉన్నారు. ఓ అభిమానిగా సెట్స్‌పై నేనామెను కల్సుకున్నపుడు గొప్ప అందగత్తెగా అనిపించలేదు. నేను సినిమాల్లోకి వచ్చిన తరువాత చూస్తే స్టార్‌గా ఆమె ఎదిగింది. మితిమీరిన అభిమానుల వైఖరి పట్ల ఆమె ఎప్పుడూ భయపడేది.

నిజానికి ఆమె ఒక సాధారణ అందగత్తె. అయినా తన స్వర సౌందర్యంతోనే అభిమానులకు ఆరాధ్య దైవమైంది. ఇప్పటికీ సినీ గీతాల అభిమానులు సురయా పాటలను మంత్రముగ్ధులై వింటూ పరవశించిపోతున్నారు. తెరమరుగవకుండా సంగీత ప్రియులకు చేరువగా ఉండటం ఆమెకే సాధ్యమైంది.''

**హెచ్.రమేష్‌బాబు**

## సురయా స్వరకర్తలు

సురయా ఎక్కువగా పాడింది నౌషాద్ సంగీతంలో. 'చార్ దిన్‌కి చాంద్‌నీ', 'మన్ లేతా హై అంగ్‌డాయీ' (అన్‌మోల్‌ఘడి), 'చలే దిల్‌కి దునియా' (దర్ద్), 'మెరా నాజూక్ బదన్' (దీవానా) పాటలు నౌషాద్ సంగీతంలోనివే. తొలి జంట సంగీత దర్శకులు 'హుస్న్‌లాల్-భగత్‌రామ్'ల వద్ద 'తేరెనైనో నె చోరీకియా', 'ఓ దూర్ జానెవాలే' (ప్యార్ కీ జీత్), 'వో పాస్ రహె' (బడీబహన్), 'మెరా దిల్‌దార్ న మిలాయా' (షమా పర్వానా), గులాం మహమ్మద్ సంగీతంలో ''జహాకోయీ న హో (మీర్జాగాలిబ్), ''మస్త్ ఆంఖోమె షరారత్ (షమా), అనిల్ బిశ్వాస్ స్వరాల్లో 'ముఝె తుమ్‌సె మొహబ్బత్ హై' (దో సితారె), 'దూర్‌పపీహాబోలా' (గజ్‌రే) అన్నీ హిట్‌సాంగ్సే.

## సురయా మెచ్చిన స్వీయ గీతాలు

గమే ఆషియానా సతాయేగా కబ్ తక్ (సినిమా -1857), పర్‌వానే సే ప్రీత్ సీఖ్‌లే షమాసే సీఖే (బిల్వమంగళ), ఏ క్రైసీ అజబ్ దాస్తాన్ హోగయీ హై (రుస్తుం సొహ్రాబ్), బిగ్‌డీ హుయీ తక్‌దీర్ బనాయీ నహీజాతీ (జగ్‌బీతీ), దూర్ హోతే నహీ జో దిల్ మె రహా కర్‌తేహై (వారిస్), మేరిజిందగీ మే తుమ్ క్యోం ఆయే (గూంజ్), తూనెమేరా దిల్‌దార్ న మిలాయా (షమా పర్‌వానా), జబ్ తుమ్ నహీ అప్‌నే దునియా హీ (పర్వానా), నామ్ తెరా జుబాపర్, యాద్ తేరే దిల్ మె హై (దాస్తాన్), కొయీ దునియా మే హామారీ తరహ్ బర్‌బాద్‌నహో (ప్యార్ కీ జీత్)

## సురయా సినిమాలివి....

బాలతారగా- తాజ్‌మహల్, అబలా (1941), స్టేషన్ మాస్టర్, తమన్నా (1942), హమారీబాత్ (1943)

హీరోయిన్‌గా- ఇషారా (1943), మైక్యా కరూఁ, ఫూల్, సమ్రాట్ చంద్రగుప్త, తద్‌బీర్, మతీమ్ (1945), అన్‌మోల్ ఘడీ, 1857, హస్రత్, జగ్‌బీతీ, ఉమర్ ఖయ్యాం, ఊర్వశి (1946), డాక్ బంగ్లా, దర్ద్, దోదిల్, నాటక్, పర్వానా, దోనైనా (1947), ఆజ్‌కీ రాత్, గజ్‌రే, కాజల్, ప్యార్‌కీ జీత్, రంగ్‌మహల్, షక్తి, విద్య (1948), అమర్‌కహానీ, బడీ బహెన్, బాలమ్, చార్‌దిన్, దిల్లగి, దునియా, జీత్, తఖ్, నాచ్, షాయర్, సింగార్ (1949), అఫ్సర్, దాస్తాన్, కమల్ కే ఫూల్, ఖిలాడీ, నీలీ, షాన్ (1950), దో సితారే, రాజ్‌పూత్, షోఖియా, సనమ్ (1951), దీవానా, గూంజ్, ఖూబ్‌సూరత్, లాల్ కువర్, మోతీమహల్, రేషమ్ (1952), మాషూకా (1953), బిల్వమంగళ, మీర్జాగాలిబ్, షమాపర్వానా, వారిస్ (1954), ఇనామ్, కంచన్ (1955), మిస్టర్ లంబూ (1956), మాలిక్, మిస్ 1958, ట్రాలీ డ్రైవర్ (1958), షమా (1961), రుస్తుం సొహ్రాబ్ (1963).



దర్శక నిర్మాత సంతోషీ 'పాగల్‌ఖానా' సినిమాకై స్టిల్.

# ఎక్కువ ప్రభావం మాత్రం ఆ ఇద్దరు రచయితలదే.....



- భాస్కరభట్ల రవికుమార్

**పాత్రికేయ వృత్తిని వదిలిపెట్టి పాత్రతెరిగిన పాటల ద్వారా ఇటీవల బాగా పాప్యులర్ అయిన సినీ గీత రచయిత భాస్కరభట్ల రవికుమార్. ఇంటిపేరులోను, ఒంటిపేరులోను ఇద్దరు సూర్యుళ్ళను నింపుకొని సినీ పరిశ్రమలో పెరిగిపోతున్న ఈ గీత రచయిత పుట్టింది జూన్ 5న. పత్రిక తుది మెరుగులు దిద్దుకుంటున్న క్షణంలో ఈ విషయం తెలిసింది కనుక పాఠకులకు 'హాసం' అందిస్తున్న అర్జంటింటర్వ్యూ యిది:**

- **మీరు కూడా జూన్‌లోనే పుట్టారా?**
  అవునండీ. అందుకే 'జులాయి'గా తిరగట్లేదు.

- **ఈమధ్య మీరు రాసిన కొన్ని పాటల్లో రాముడు, సీత, ఆంజనేయుడుకి సంబంధించిన కొన్ని పదాలు పాదం పెట్టాయి. ఇది మీరు గమనించారా? మీ రియాక్షన్ ఏమిటి?**
  నిజంగానే నేను గమనించలేదు. కానీ మీలాంటి ఫ్రెండ్స్ చెబితే ఈ మధ్యే తెలిసింది. అదేంటంటే రాముడు, సీత, ఆంజనేయుడు...ఈ దేవుళ్ళ సిరిపాదం మోపిన రామసక్కని బంగారు బొమ్మ(ఇట్లు...శ్రావణి సుబ్రమణ్యం), సీతాకోక చిలకా(ఔను..వాళ్ళిద్దరూ ఇష్టపడ్డారు), జై వీరాంజనేయా...(ఇడియట్) పాటలు విడుదలయ్యాక నాకు మంచి గుర్తింపు లభించింది. ఈ సెంటిమెంటేదో బాగుందనిపించి 'ఓ రాధ ఇద్దరు కృష్ణుల పెళ్లి' సినిమాలో కూడా 'శ్రీ రామచంద్రా...' పల్లవితో పాట రాశాను.

- **ఇలాంటి సెంటిమెంట్ ఇంకెక్కడైనా వర్కవుట్ అయిందా?**
  'ధనలక్ష్మీ ఐలవ్ యూ!' సినిమాకు ముందు నేను ఆర్థికంగా కొన్ని ఇబ్బందులు ఎదుర్కొన్నాను. ఆ సినిమాలో మొత్తం ఎనిమిది పాటలూ నేనే రాశాను. దాంతో నా ఫైనాన్షియల్ ప్రాబ్లెమ్స్ ఎగిరిపోయాయి.

- **మాస్ పాటలు ఎక్కువగా రాసే మీరు 'గోరువంకా గోదారివంకా...'(కబడ్డీ కబడ్డీ) నిజం చెప్పమంటే( అమ్మాయిలు -అబ్బాయిలు) తో క్లాస్ సాంగ్స్ వైపు దృష్టిని మళ్లించటం వెనక కారణం?**
  మాస్ పాటలు 'పదిసార్లే వింటారు, క్లాస్ సాంగ్స్‌ని పదేపదే వింటారు. అప్పుడప్పుడూ నా పాటల్ని పదే పదే అందరూ వినాలనే మెలోడీస్ రాస్తుంటాను.

- **మాస్ సాంగ్స్ విషయంలో మీ మీద వేటూరి, భువనచంద్ర ప్రభావం ఎక్కువగా కనిపిస్తుంటుంది. ఉదా :'అమ్మ నాన్న ఓ తమిళమ్మాయి'లో 'మస్తుగా శ్రీరస్తుగా శుభమస్తు"గా వస్తగా పుస్తెలేకొని తెస్తగా...', నువ్వే నా కందిపొడి, రావే నా నైటుబడి, నీకే నా పెట్టుబడి...' దీనికి మీరెలా స్పందిస్తారు?**
  మీరు ఇంత డిటెయిల్డ్‌గా చెప్పాక వాళ్ల ప్రభావం నా మీద లేదని ఎలా అంటాను? నేలా, బెంచీ ఆడియన్స్‌ని ఉర్రూతలూగించడం ఎలాగో వేటూరి గారికీ, భువన చంద్ర గారికీ బాగా తెలుసు. ఈ విషయం నాకు ఎలా తెలుసంటే, నేను కూడా ఎక్కువగా నేల, బెంచీలో కూర్చునే సినిమాలు చూశాను కాబట్టి. అప్పటినుంచే ఈ ఇద్దరూ నాకు బాగా ఇష్టం. స్వతహాగా నేను సీతారామశాస్త్రి గారి పిచ్చి అభిమానిని. ఆయన ప్రభావం కొన్ని పాటల్లో తప్ప, అన్ని పాటల్లోనూ ఉండదు. ఎక్కువ ప్రభావం మాత్రం మీరు చెప్పిన ఆ ఇద్దరు రచయితలదే!

- **ఎక్కువగా రాత్రి పూట రాస్తారా? పగలు రాస్తారా?**
  బుర్ర'పగలు'గొట్టుకునే రాస్తాను. రాత్రివేళ నిద్రని జయించడం ఇంకా అలవాటవలేదు.

- **మీ పాటలకి మొదటి శ్రోత ఎవరు?**
  మొదటి శ్రోత, మొదటి బాధితురాలు నా శ్రీమతే!

- **రాస్తున్న సినిమాలు?**
  ఆంధ్రావాలా, శివమణి, ఓ రాధ ఇద్దరు కృష్ణుల పెళ్లి, ఉషాకిరణ్‌మూవీస్, అన్నపూర్ణ స్టూడియోస్, వెంకీ దర్శకత్వంలో శ్రీకాంత్ హీరోగా వస్తున్న చిత్రం.

## భాస్కరభట్ల హిట్స్

| | | |
|---|---|---|
| 1. రామసక్కని బంగారు బొమ్మ | - | ఇట్లు శ్రావణి సుబ్రమణ్యం |
| 2.నూజివీడూ సోనియా | - | ఔను...వాళ్లిద్దరూ ఇష్టపడ్డారు |
| 3.సుబ్బలచ్చిమీ...సుబ్బలచ్చిమీ | - | కనులు మూసినా నీవాయె |
| 4.లేలేత నవ్వులా | - | ఇడియట్ |
| 5.సుబ్బారావూ...సుబ్బరావూ | - | అమ్మాయిలు -అబ్బాయిలు |
| 6.నిజం చెప్పమంటే | - | అమ్మాయిలు -అబ్బాయిలు |
| 7.గోరువంకా గోదారివంకా | - | కబడ్డీ కబడ్డీ |
| 8.కోకిల...కోకిల | - | కబడ్డీ కబడ్డీ |
| 9.జాబిల్లీ బుగ్గను గిల్లీ | - | కబడ్డీ కబడ్డీ |
| 10. చుమ్మాచుమ్మాదె చుమ్మా | - | అమ్మ నాన్న ఓ తమిళమ్మాయి |




స్వరపరిచిన ప్రతిపాటా, ప్రతిపద్యం, ప్రతిస్వర ఖండికా వీనులవిందుగా ఉండడమేకాకుండా తర్వాతి తరంవారికి సగర్వంగా చెప్పుకోగలిగిన ప్రమాణాలతో కూడిన చిత్రాలు కొన్ని వచ్చాయి. అటువంటి వాటిలో బిఎయస్ ప్రొడక్షన్స్ వారి

# చెంచులక్ష్మి

ఒకటి. 1958 లో విడుదలయిన ఈ చిత్రంలోని అయిదు పాటల గురించి గత సంచికలో చర్చించుకోవటం జరిగింది. ఈ సంచికలో మరో 5 పాటల గురించి...

కనలేరా కమలా కాంతుని
అదిగో కనలేరా భక్తపరిపాలుని
ఇదిగో కనలేరా శంఖచక్రధారిని
నారాయణా హరి నారాయణా
శ్రీమన్నారాయణా లక్ష్మీనారాయణా
నారాయణా హరి నారాయణా
శ్రీమన్నారాయణా లక్ష్మీనారాయణా
దీనావన నీ దివ్య స్వరూపము
మూర్ఖులు మదిలో కనగలరా ॥దీనా॥ ॥నారాయణా॥
పాపాత్ములు నిను పరికింపరుగా.. ॥పాపా॥
నీపై కోపము, వైరము పూని
హే పరమేశా... హే పరమేశా
ఎటు చూచిన నీ రూపమెకాదా లోకేశా ॥నారాయణా॥



సదాశివబ్రహ్మం రాసిన ఈ పాటను పి.సుశీల పాడగా మాస్టర్ బాబ్జీ అభినయించాడు. ప్రహ్లాదుని గురువులైన చండామార్కుల పాత్రలను ధరించిన వంగర వెంకటసుబ్బయ్య, ఎ.యల్.నారాయణ, మహావిష్ణువు పాత్రధారి అక్కినేని నాగేశ్వరరావు కూడా ఈ పాట అభినయంలో పాలుపంచుకుంటారు. హిందోళ రాగంలో స్వరపరచబడిన ఈ పాట కూడా సుశీల జీవం పోసి పాడిన పాటలలో ఒకటిగా చెప్పుకొని తీరాలి. ఈ పాటను తాదాత్మ్యంతో ఆలపించుకుంటూ పోతే చాలాచోట్ల కనులు చెమరిస్తాయి. ఆ అనుభూతికి యస్.రాజేశ్వరరావు, సుశీల ఎంత కారణమో ఈ పాటను ఒక్కసారి వింటే చాలు తెలిసిపోతుంది.

హే దేవా! దివ్య ప్రభావా!
పావనా - భక్త జనావనా
సేవింతును - నీ పాదాబ్జములే...
ఎంత దయామతివయ్యా - అనంతా!!
సంతతమూ నిను స్మరించు వారికి ॥2॥
చింతా? వంతా? కమలాకాంతా ॥ఎంత దయామతివయ్యా॥
నారాయణా యని ఒకమారైనా
నోరారగ నీ నామము తలచిన ॥నారా॥
ఘోర దురితములు - దూరము చేసి
దయసేయుదువట! ॥ఎంత దయామతివయ్యా॥







మహరాష్ట్ర సంగీత సంప్రదాయాన్ని గుర్తు చేస్తూ మాండ్ రాగంలో సాగిన ఈ పాటకు రచన సదాశివబ్రహ్మం, గానం పి.సుశీల, అభినయం మాస్టర్ బాబ్జీ తదితరులు. మాండ్ రాగం ఆధారంగా ఎన్నో పాటలు వుండవచ్చు. కానీ ఈ పాటను ఒకసారి హృదయానికి పట్టించుకునే ఆ రాగం ఎప్పుడు ఏ రూపంలో వినిపించినా వెంటనే పోల్చుకునే శక్తి వచ్చేస్తుంది. ఈ పాటలో 'నారాయణ యని ఒక మారైనా' అనే చరణం వింటుంటే కలిగే రసస్పర్శను అనువదించడానికి అక్షరాలు తూగవు. అంతటి రసస్పందన కలగడానికి రాజేశ్వరరావు, సుశీల.

చెట్టులెక్కగలవా ఓ నరహరి
పుట్టలెక్కగలవా
చెట్టులెక్కి ఆ చిటారు కొమ్మల
చిగురు కోయగలవా
ఓ నరహరి చిగురు కోయగలవా
చెట్టులెక్కగలనే ఓ చెంచిత పుట్టలెక్కగలనే
చెట్టులెక్కి ఆ చిటారు కొమ్మల
చిగురు కోయగలనే ఓ చెంచిత
చిగురు కోయగలనే
ఉరకలేయగలవా ఓ నరహరి
పరుగులెత్తగలవా ॥ఉరక॥
ఊడ పట్టుకుని జారుడు బండకు
ఊగి చేరగలవా ఓ నరహరి
ఊగి చేరగలవా
ఉరకలేయగలనే ఓ చెంచిత
పరుగులెత్తగలనే ॥ఉరక॥
ఊడపట్టుకుని జారుడు బండకు
ఊగి చేరగలనే ఓ చెంచిత
ఊగి చేరగలనే
గురిని చూసుకొని కనులు మూసుకొని
బాణమేయ గలవా ఓ నరహరి
బాణమేయగలవా
గురిని చూసి వెనుదిరిగి నాణెముగ
బాణమేయగలనే ఓ చెంచిత
బాణమేయగలనే
ఓ చెంచిత నిన్ను మించగలనే ॥చెట్టు॥
తగువులేల ఎగతాళికాదు
నను తాళికట్టనీవా ఓ చెంచిత
తాళి కట్టనీవా
మనసు తెలుసుకొని మరులు చూపితే
మనువునాడనిస్తా ఓ నరహరి
మనువునాడనిస్తా ఓ నరహరి
మాల తెచ్చి వేస్తా ॥చెట్టు॥











'చెట్టులెక్కగలవా' పాట పూర్తిగా జానపద రీతులపై ఆధారపడి మలచిన గీతం. హరి కాంభోజి, శంకరాభరణం రాగాల స్వరాలను కలుపుకుంటూ చతురస్ర గీతిలో సాగిన ఈ పాట నేటికీ ఎందరి పెదవులపైనో నర్తిస్తూనే ఉంది. ఒకరడిగిన ప్రశ్నకు ఇంకొకరు కొద్దిపాటి మార్పులతో అడిగిన వారి మాటలలోనే సమాధానం ఇవ్వడమే పాటలోని ముఖ్యాంశం. కొద్దిపాటి మార్పులతో అలా సాహిత్యం పునరుక్తి అవుతున్నా ఎక్కడా విసుగు చెందనీయని విధంగా పాట సాగిందంటే కారణం ట్యూన్‌కున్న బలమే. ఈ పాట రచన ఆరుద్ర; గానం ఘంటసాల, జిక్కి; అభినయం అక్కినేని, అంజలీదేవి. ఇదేపాట పి.బి.శ్రీనివాస్, సుశీల పాడగా మరో వెర్షన్‌లో రికార్డులుగా రిలీజయింది. సినిమాలో ఉపయోగించిన ఘంటసాల, జిక్కి వెర్షన్ కూడా రికార్డులుగా రావడంతో కాలక్రమేణా సుశీల, పి.బి.శ్రీనివాస్‌ల వెర్షన్ మరుగునపడిపోయింది. ఇటీవల హెచ్.ఎం.వి. వారి ధర్మమా అని మెలొడీస్ ఆఫ్ పి.బి.శ్రీనివాస్ అనే డబుల్‌ప్యాక్ ఆడియోలో ఈ వెర్షన్ మళ్ళీ వెలుగుచూసింది. వీలైతే ఈ రెండు వెర్షన్‌లూ సంపాదించి మార్చి మార్చి వినడానికి ప్రయత్నిస్తే భలేగా ఉంటుంది. తమతమగాత్రాల పరిధులు తెలిసిన గాయనీగాయకుల ప్రతిభావిష్కరణ ఎలాుంటుందో గమనించవచ్చు కూడా!

కానగ రావా ఓ శ్రీహరి రావా ॥కానగ॥
ప్రాణసఖా నను చేరగరావా
జాలిగొని బేలనని ఏలగరావా
నన్నేలగరావా ॥కానగ॥
బాసచేసి మరచావా ఓ చెంచితా ॥బాస॥
వేచివేచి కనులేమో కాయలు కాచే ॥వేచి॥
నీవులేక క్షణమైనా నిలువజాలనే ॥నీవు॥
జాలమాయె తాళలేను ఏలగరావే
నన్నేలగరావే ॥కానగరావా॥
కంటినీరు చెరువాయె
కథలేమారె ॥కంటి॥
శాంతమొంది నరసింహా
చెంతకురావా ॥శాంత॥
జీవితాన అంతులేని చీకటులాయె ॥జీవి॥
దేవదేవ ఈ వియోగ మెన్నిదినాలో
ఇంకెన్ని దినాలో ॥కానగ॥



ఈ పాటను ఆరుద్ర వ్రాయగా ఘంటసాల, జిక్కి గానం చేశారు. అక్కినేనితో పాటు ద్విపాత్రలలో అంజలీదేవి అభినయించిన ఈ పాటను భీంప్లాస్ స్కేల్‌మీద స్వరపరిచారు. భీంప్లాస్ రాగాలాపనలో యస్.రాజేశ్వరరావుకి ఓ ప్రత్యేకమైన శైలి ఉంది. ఆ శైలికి ఆయన సంతకాన్ని కలిపి మరీ ప్రింట్ కొట్టినట్టు ఉంటుందీపాట. జాగ్రత్తగా వింటే - వేచివేచి కనులేమో కాయలు కాచే దగ్గర శాంతమొంది నరసింహా చెంతకు రావా దగ్గర వచ్చే ఇంటర్లూడ్; నీవు లేక క్షణమైన నిలువ జాలనే దగ్గర జీవితాన అంతులేని చీకటులాయె దగ్గర వచ్చే ఆలాపన ఆ ముద్రను మన హృదయాలలో మరింత స్ఫుటంగా పదిలపరుస్తాయి. గాయని జిక్కి గొంతులో 'ఖ', 'హ' వంటి అక్షరాలు కొత్తందాలను కలుపుకొని వెలువడుతూ ఉంటాయి. త్రిశగతిలో సాగిన ఈ పాటలో - 'ప్రాణసఖా' దగ్గిర 'శాంతమొంది నరసింహా' దగ్గర, జిక్కి గొంతులో పలికిన ఆ వినూత్న వర్ణాలను గమనించవచ్చు.

చిలకా గోరింకా కులికే పకాపకా
నేనే చిలకైతే నీవే గోరింకా రావా నావంక
చిలకా గోరింకా కులికే పకా పకా
నీవే చిలకైతే నేనే గోరింకా రావా నావంక
చెలియా నేటికి చెలిమీ ఫలించెనే
కలలూ కన్నట్టి కలిమీ లభించెనే ॥చెలియా॥
మనసే నిజమాయే తనువులు ఒకటాయె
మదిలో తలంపులే తీరే తీయగా
మారే హాయిగా ॥చిలకా॥
కలికీ నీవిలా ఎదుటా నిలాబడా
పలుకే బంగారం ఒలికే వయ్యారమే ॥కలికీ॥
ఒకటే సరాగము ఒకటే పరాచికం
కలసీ విహారమే చేద్దాం హాయిగా
నీవే నేనుగా ॥చిలకా॥



'చిలకా గోరింకా కులికే పకాపకా' పాట కూడా హరింకాంభోజి, శంకరాభరణం రాగాల స్వరాలను కలుపుకుంటూ స్వరపరిచినదే. కావాలంటే లయని మరిచిపోయి కేవలం రాగాల్ని మాత్రం ఆలపించుకుంటూ పాడుకోండి అది 'చెట్టులెక్కగలవా' పాటకి తీసుకు వెళ్ళిపోతుంది. ఆ రోజుల్లో యువతరాన్ని ఉర్రూతలూపిన యుగళ గీతాలలో తిశ్రగతిలో సాగిన ఈ పాట కూడా ఒకటి. ఈ పాటకు రచన ఆరుద్ర గానం ఘంటసాల, జిక్కి, అభినయం అక్కినేని, అంజలి. పైన ఉదహరించిన పాటలతో పాటు కొన్ని స్వరఖండికలు, పద్యాలు కూడా 'చెంచులక్ష్మి' చిత్రంలో ఉన్నాయి. అతి చక్కని అనుభూతిని అందించే ఆ స్వర ఖండికల గురించి, పద్యాలలో అలౌకికమైన ఆనందాన్ని అందించే ఓ రెండు పద్యాలను గురించి వచ్చే సంచికలో...

మార్కెట్లో ఉన్న కొత్త క్యాసెట్లు










సిల్వర్‌జూబ్లిహిట్ చేసిన అఖిలాంధ్ర ప్రేక్షకులకు
ఇవే మాకృతజ్ఞతలు
అంతర్వేది శ్రీ లక్ష్మీనరసింహ స్వామి దివ్య ఆశీస్సులతో..
సూపర్‌హిట్ ఫ్రెండ్స్
175
వ.
రోజు
ప్రేమలో పావని కళ్యాణ్
Love is different
dts
బి.ఎ.రాజు బి.జయ పోలూర్‌ఘటికాచలం
పి.విజయ్‌వర్మ · ఘంటాడికృష్ణ · జవహర్‌రెడ్డి · కృష్ణ · వెంకటేష్ · రాంబాబువర్మ

